# ఆముక్తమాల్యద పరిశీలనము



అయాచితం నటేశ్వరశర్మ

# ఆముక్తమాల్యద పరిశీలనము

[పరిశోధనవ్యాసము]

**

## అయాచితం నటేశ్వరశర్మ



జాతీయ సాహిత్య పరిషత్

కామారెడ్డి శాఖ

1992

# ఆముక్తమాల్యద పరిశీలనము

(పరిశోధనవ్యాసము)




సర్వస్వామ్యములు : రచయితవి

ప్రచురణ : 15 ఆగస్టు 1992
భారత స్వాతంత్ర్యదినోత్సవము

ప్రతులు : 1000

ప్రతులకు :

ఆయాచితం నటేశ్వరశర్మ
సంస్కృతోపన్యాసకుడు
ప్రాచ్యవిద్యాపరిషత్తు ప్రాచ్యకళాశాల
కామారెడ్డి - 503 111.

ముద్రణ :

ఆంజనేయ ముద్రణాలయము
లింక్ రోడ్, కామారెడ్డి-503 111.
ఫోన్ : 2446



వెల : రు. 50/-

This book is published with the Financial Assistance of Tirumala Tirupati Devasthanams under their scheme Aid to Publish Relegious Books.

# శ్రీ వేంకటేశ్వరస్వామినే

## కృతిపద్మినీసమర్పణమ్

గోదాస్వరూపిణీం పద్మాం పరిణీయ విరాజసే।
శ్రీరంగనాథరూపస్త్వం వేంకటేశ! నమోఽస్తు తే॥

సర్వం మజ్జీవనం స్వామిన్! త్వత్కృపావర్ధనం సదా।
అతోఽహం భావయామి త్వాం నిత్యమాజీవనం ప్రభో॥

ఆముక్తమాల్యదం కావ్యం భక్తిసారసమున్నతమ్।
కల్పయేద్వైష్ణవం స్థానం పారమ్యం భక్తకోటయే॥
మద్వైతద్గ్రంథరచనం ప్రకాశనమపి ప్రభో।
త్వత్సహాయేనైవ కృతం మత్కృత్యం త్వత్పరాయణమ్॥
కౌముదీ చంద్రిమత్యేతి యథా గంగాంబుధిం తథా।
ప్రాప్నోతి త్వాం స్వీకురుష్వ మమేమాం కృతిపద్మినీమ్॥

## సాత్త్వదీనగీతి

పాంచభౌతికమైన నా వపువు నీది
మధురభావితమైన నా మనసు నీది
లలితలాలితమైన నా పలుకు నీది
కాగ, ఈ త్రికరణముల గాంగజలము
లోన బుట్టిన గ్రంథప్రసూనమిదిగో!
తాను కోరదు నీదు పదమ్ము గాక.
ఇంకెవ్వరి చేయను నమ్మి గాదె?



'కృతిపద్మినీపతి'

# శ్రీ వేంకటేశ్వరస్వామి



వినా వేంకటేశం న నాథో న నాథః సదావేంకటేశం స్మరామి స్మరామి
హరే వేంకటేశః ప్రసీదః ప్రసీదః ప్రియం వేంకటేశః ప్రయచ్ఛః ప్రయచ్ఛః

కావ్యనాయిక

# ఆముక్తమాల్యద



"స్వోచ్ఛిష్టమాలికాబంధగంధబంధుర జిష్ణవే
విష్ణుచిత్తతనూజాయై గోదాయై నిత్యమంగళమ్"

'ఆముక్తమాల్యదమ్' సంస్కృత చంపూకావ్యకర్తలు



శ్రీమాన్ అమరవాది
వేంకటనరసింహాచార్యులుగారు

(1913—1988)




# స్వాగతం

సంస్కృతాంధ్రాల్లో పాండిత్యాన్ని సంపాదించుకొన్న యువకవిమిత్రులు, స్నేహశీలి-శ్రీ అయాచితం నటేశ్వరశర్మగారు. శబ్ద-అర్థశాస్త్రాల మర్మాలను తెలిసికొని జాతీయ జీవనమూల్యాల పరిరక్షణకూ, వికాసానికీ నిరంతరం సాధనచేస్తున్న సాహిత్యసత్యవ్రతులైన ఈ మిత్రుడు ఇంతకు పూర్వమే "వసంతకుమారి"; "భారతీ ప్రశస్తి" వంటి గ్రంథాల్ని ప్రకటించారు. ప్రస్తుతం తాము శోధించి, సాధించిన "ఆముక్తమాల్యదపరిశీలనం" అనే ఈ గ్రంథాన్ని అందిస్తున్నారు.

తెలుగునాట సాహిత్యరంగంలో కాలుపెట్టిన యువతరం దిక్కూ, తెన్నూ తెలియక ఈ సమాజాన్ని - ఈ వ్యవస్థనూ సర్వనాశనం చేయాలనే హింసోన్మత్త వాదాల్ని ప్రచారం చేస్తూ, కల్లోలితవాతావరణనిర్మాణానికి కారకులవుతున్న సందర్భంలో మిత్రులు-శ్రీ నటేశ్వరశర్మగారు జాతీయతత్త్వాన్ని ఆత్మీయంగా పంచిపెట్టే ప్రయత్నం చేస్తున్నారు, అందులో సత్ఫలితాల్ని సాధిస్తున్నారు. వారి కావ్యఖండికల్ని పరిశీలిస్తే "జాతీయహితచింతనపథం" వారిదని ఎవరైనా చెప్పగలుగుతారు.

ఇక ప్రస్తుతగ్రంథం-"ఆముక్తమాల్యద పరిశీలనం". తెలుగు పంచకావ్యాలలో ఒకటిగా ప్రశస్తిగాంచింది రాయలవారి "ఆముక్తమాల్యద." సంస్కృతభాషలో శ్రీమాన్ అమరవాది వేంకటనరసింహాచార్యులవారు రచించిన చంపూకావ్యం 'ఆముక్తమాల్యదమ్'. ఈ ఆంధ్ర-సంస్కృత కావ్యాలలోని ఇతివృత్తాలను శ్రీ శర్మగారు ఈ పరిశోధనవ్యాసంలో తులనాత్మకంగా విశ్లేషించడం తెలుగు సాహితీ ప్రియులను ప్రత్యేకంగా ఆకర్షించే అంశం. ఉస్మానియా విశ్వవిద్యాలయ సంస్కృతశాఖకు ఈ లఘుసిద్ధాంతగ్రంథాన్ని సమర్పించి శ్రీ శర్మగారు ఎం.ఫిల్. పట్టభద్రులయ్యారు.

ఒక సామాజిక సంక్లిష్టపరిస్థితుల్లో, భక్తి వేదాంతతత్త్వ గ్రంథాలద్వారా భారతీయసమాజంలో చైతన్యాన్ని జాగృతం చేయడానికి ఆముక్తమాల్యదలాంటి గ్రంథాలు వచ్చినై. సరిగా అలాంటి సంక్లిష్టపరిస్థితుల్లో "భారతీయజనత" కొట్టుమిట్టాడుతున్నప్పుడు ఆ గ్రంథాలమీద ,అధ్యయనం, అనుశీలనం, పరిశీలనం, సిద్ధాంతీకరణం జరుగుతున్నది. సామాజికపరంగా ఈ రెంటిటిసంబంధం ఇది. ఆనాడు ఆ గ్రంథాలు ఎందుకు వెలువడ్డాయో; ఈనాడు ఈ గ్రంథాలు అందుకే పరిశీలింపబడుతున్నాయి. భారతమానసపర్యావరణం కాలుష్యమవుతున్న సందర్భంలో ప్రాదుర్భవించి పరిమళిస్తున్న ఈ హోమాగ్నిసౌగంధ్యానికి మనఃపూర్వకంగా స్వాగతం పలుకనిదెవ్వరు?

అఖిలభారతీయ సాహిత్యపరిషత్తుకు అనుబంధంగా వ్యవహరిస్తూ, జాతీయ భావసౌజన్యాన్ని పెంచిపెడుతున్న ఆంధ్రప్రదేశ్ జాతీయసాహిత్యపరిషత్తు అన్ని శాఖలూ ఈ గ్రంథానికి స్వాగతం పలుకుతున్నాయి. రచయిత కృషికి అభినందనలందజేస్తున్నాయి.

— **డా॥ కసిరెడ్డి వెంకటరెడ్డి**
కార్యదర్శి
జాతీయ సాహిత్య పరిషత్,
ఆంధ్రప్రదేశ్

భాగ్యనగర్
తేది 24-7-1992



**Prof. K. Kamala,**
M.A., Ph.D.,
Head, Department of Sanskrit,
Osmania University,
HYDERABAD – 500 007.

Residence :
16, Tuljaguda,
Mozamzahi Market,
Hyderabad - 500 001.
Phone : 557212

# అతిముక్తాలతాప్రశంసా

---

ఆముక్తం (ఉపభుక్తం) మాల్యం భగవతే రంగనాథాయ దదాతీతీయం గోదాదేవీ ఆముక్తమాల్యదా. తామధికృత్య విరచితం కావ్యమాముక్తమాల్యదమిత్యర్థోऽన్వీయతే. ఆండాళ్, చూడికొడుత్తనాచ్చియార్, నీలా, గోదేతి నామభిర్విఖ్యాతా; ద్వాదశసు దక్షిణాత్యేషు భాగవతోత్తమేష్వాళ్వారుష్వన్యతమా ఆముక్తమాల్యదా భగవతః శ్రీరంగక్షేత్రవాసినో రంగనాథస్య ప్రేయసీ మధురభక్తిపూర్ణా చ. 'గుణాః పూజాస్థానం గుణిషు న చ లింగం న చ వయః' ఇతీయముక్తిరన్వర్థా గోదాదేవ్యామ్.

దాక్షిణాత్యేషు మకరసంక్రాన్తేః పూర్వం మాస ఏకః సౌరమానానుసారేణ ధనుర్మాస ఇతి కథ్యతే. తస్మిన్మాసే గోదావిరచితస్య 'తిరుప్పావై' నామ్నస్సుప్రథితస్తోత్రస్య గానం విష్ణోర్దేవకులేషు గృహేషు చ సర్వత్ర ప్రాతఃకాలే ప్రతిదినం శ్రూయతే. గోదారంగనాథయోః కల్యాణేనేదం సమ్పన్నం భవతి. 'తిరువాయిమొళి' ఇత్యయమప్యన్యతమో గ్రన్థః గోదాదేవ్యా విరచితః. స్వప్నే దృష్టం భగవన్తం రంగనాథం గోదా వర్ణయత్యస్మిన్గ్రన్థే సుమధురయా వాచా. గోదాయాః కవితా తమిళవాగ్దేవ్యాః అనర్ఘం భూషణమ్.

అస్య సంప్రదాయస్య మహత్త్వం దర్శయన్తః; గోదాయాః స్తోత్రేష్వపి పరమన్వయం కుర్వన్తః వ్యాఖ్యాతారః; సర్వత్రాస్మిన్మాసే గోదాచరిత్రప్రచారం కుర్వన్తి. మాసేऽస్మిన్ రంగవల్లీనాం రచనేన, తాసు గోపికాప్రతిరూపస్య గోమయపిండకస్య స్థాపనేన, సర్వాణి గృహాంగణాని గోదామయానీవ సందర్శనీయాః విరాజన్తే.

విశిష్టాద్వైతమతానుయాయినాం గృహేషు వివాహకాలే కన్యకాః ఆముక్తమాల్యదావదలంక్రియంతే. సర్వా ఏవ కన్యకాః ప్రథమం విష్ణవే అర్ప్యన్త ఇవ భావస్తత్ర దృశ్యతే.

తమిళ-కన్నడ-తెలుగు-మలయాళభాషాసు గోదాచరితవర్ణనం ప్రాచుర్యేణ పరిదృశ్యతే. ఆంధ్రభాషాయాం సాహితీసమరాంగణసార్వభౌమేన విజయనగరాధీశేన రాజకవినా శ్రీ తుళువ నరసింహకృష్ణరాయేన "ఆముక్తమాల్యదా" ఇతి ప్రౌఢప్రబంధో విరచితః.

శ్రీయుక్తాః అమరవాది వేంకటనరసింహాచార్యాః అస్యైవ వింశతితమస్య శతకస్య ప్రౌఢాః విద్వాంసః, తమిళ-సంస్కృత భాషయోః కవయశ్చ. అస్యైవ శతకస్య 1988 తమే వర్షే పరం ధామ ప్రాప్నువన్తః. శ్రీమన్తః నరసింహాచార్యాః తమిళసంప్రదాయస్య సంస్కృతసాహిత్యస్య చ విశిష్టం జ్ఞానం సంపాద్య బహూన్ గ్రంథాన్ వ్యరచయన్. ఆచార్యాణామాంధ్రభాషాయా మేతత్సంప్రదాయమధికృత్య విరచితగ్రంథవిషయే విశేషః ప్రవేశ ఆసీదిత్యహం మన్యే. అన్యథా శ్రీకృష్ణరాయస్య ఆముక్తమాల్యదాయాః ప్రభావోఽస్మిన్ సంస్కృతాముక్తమాల్యదాగ్రంథే ఆచార్యవిరచితే దర్శ్యతే యథా తథైవ తమిళసాహిత్యసంప్రదాయస్య ప్రభావః అస్యాం కృతౌ బహుళరూపేణ దృశ్యతే. అయమేవాస్య గ్రంథస్య విశేషః. తత్ర తత్ర సంస్కృత మహాకవీనాం కాళిదాసాదీనామపి ముద్రా గ్రంథేఽస్మిన్ ప్రతిభాతి.

గ్రంథోఽయం "తెలుగు"లిప్యాం ప్రకాశితః వరంగల్ నగరాత్. ఉత్తర భారతే ప్రాయః ఏతాదృశానాం గ్రంథానాం లిపిజ్ఞానాభావాత్ప్రచారో న దృశ్యతే. నాగరీలిప్యామస్య గ్రంథస్య ప్రకాశనం భవితుమర్హతి, యేన భక్తాయాః మీరాయాః గోదాయాశ్చ తులనాత్మకమధ్యయనం కర్తుం శక్యతే. ద్వే అపి కృష్ణభక్తే, కవితా రాజ్యే ఉత్కృష్టిమలంకురుతః. యథా "మొల" కవయిత్రీ ఆంధ్రభాషాయాం రామాయణం విరచయ్య, రామభక్తిం ప్రకటితవతీ, తథైవైతే కృష్ణభక్తిప్రచారం కృతవత్యౌ. మీరా మానవేనాప్యేవ; గోదా తు భగవతైవానేన జాతా, భగవతా పరిణీతా చ. అస్యాః పూజా దేశకులేషు భవతి.

శ్రీమన్తః వి. ఉమాశంకరశర్మాణః అధ్యాపకాః కవయశ్చ సంస్కృతకావ్యమిదమధికృత్య ఉస్మానియా విశ్వవిద్యాలయస్య సంస్కృతవిభాగే ఎం.ఫిల్. పట్టస్య కృతే పరిశోధన నిబంధమేనం సమర్పితవన్తః. శ్రీమన్తః శర్మాణః ఆంధ్రాణాం సంస్కృతసాహిత్య సేవాయాః ప్రకాశనస్య చ కృతే జిజ్ఞాసవః ఇమం విషయం పరిశోధనార్థమగృహ్ణన్.

నిబంధేఽయం శ్రీమతాం నటేశ్వరశర్మణాం కావ్య-వ్యాకరణ-వైదిక సంప్రదాయేష్వభినివేశం శ్రద్ధాం చ దర్శయతి. కావ్యస్థాన్ శబ్దార్థాలంకారాంశ్చ నిఖిలాన్ శ్రీ శర్మాణః దర్శితవంతః. అస్య నిబంధస్య "తత్త్వవివేచనపరికరణమ్" మమహాయమానమిత్యహం మన్యే. విశిష్టాద్వైతసంప్రదాయస్య సూక్ష్మపరిశీలనమత్ర దృశ్యతే.

ఇదానీం పి.హెచ్.డి. పట్టస్యకృతే నటేశ్వరశర్మణాం "సౌందర్యలహర్యాః" శ్రీశంకరభగవత్పాదవిరచితాయాః అధ్యయనం ప్రచలతి. తస్మిన్ బహవస్తంత్ర శాస్త్రసంబద్ధాః విషయాః పరామృష్టాః. అపి శాక్తసంప్రదాయస్య - వైష్ణవసంప్రదాయస్య చ సమగ్రం జ్ఞానం నటేశ్వరశర్మాణః ప్రాప్నువన్తీతి మన్యే. ఇతోఽప్యధికం విజ్ఞానవర్ధకం కార్యం భవిష్యత్కాలే ఏతే కుర్యురితి; గోదాదేవీ అనేన గ్రంథ ప్రకాశనేన ప్రసన్నా నటేశ్వరశర్మణాం, తద్ధర్మపత్న్యాః పుత్రాణాం చ ఇష్టకరీ భవేదితి చాఽఽశాసే. ఏతద్గ్రంథప్రకాశనావసరే నటేశ్వరశర్మాణస్సర్వదా అభినందనీయాః.

ఇతి శమ్.

అంగిరోనామసంవత్సరస్య
గ్రీష్మర్త్వాషాఢకృష్ణపంచమీ
భానువాసరః
19-7-1992

— కే. కమలా



**Prof. A. Rajeswara Sarma,**
M.A., LL.B., Ph.D.,
U.G.C. Emeritus Professor in Telugu,
Osmania University;
Secretary, Prachya Vidya Parishad,
Kamareddy

Formerly :
i) Head, Dept. of Telugu,
Osmania University
ii) Head, Depts. of Telugu, Sanskrit & Hindi & Dean, Faculty of Arts,
Kakatiya University.

Residence :
H.No. 3-3-31,
Vithal Mandir Road,
KAMAREDDY - 503 111·
Phone : 2219

Date : 5-7-1992

"ఆముక్తమాల్యదమ్" అనే పేరు వినగానే తెలుగువారికి కృష్ణదేవరాయలు రచించిన ఆంధ్రమహాకావ్యం ఆముక్తమాల్యదకు ఈ కృతి సంస్కృతీకరణం అయి వుంటుందనే అభిప్రాయం కలగడం సహజం. అందులోను సంస్కృతకావ్య రచయిత ఆంధ్రుడయినప్పుడు కనీసం తెలుగుకావ్య ప్రభావమయినా దీనిమీద ఉండకపోదని అనిపిస్తుంది. కాని శ్రీ అమరవాది వేంకటనరసింహాచార్యులు రచియించిన "ఆముక్తమాల్యదమ్" అనే సంస్కృత చంపూకావ్యాన్ని చూస్తే ఈ రెండభిప్రాయాలు సరికావనే నిర్ణయానికి రావటానికి ఎంతోసేపుపట్టదు.

ఇతివృత్తం గోదాదేవి చరిత్రకు సంబంధించింది కావడమనే అంశం ఒక్కటే తెలుగు సంస్కృత కావ్యాల్లోవున్న పోలిక. కాకపోతే రెండు కూడా చంపూకావ్యాలే కావడమనేది మరోపోలిక. ఇంతకుమించి మరోపోలిక కానరాదు. కాని "ఆముక్తమాల్యదమ్" అనే నామకరణం చేయడంలో రాయలప్రభావం తప్పక వున్నదని నిశ్చయమౌతున్నది. అంతేకాదు రాయలవారి గ్రంథం ఆచార్యుల వారికి తెలిసిందే అనికూడ నిశ్చయమౌతున్నది. అయితే మరి కనీసం ఒకటిరెండు పద్యాలనో వర్ణనలనో సంస్కృతీకరించి రాయలవారి రచనమీద తన ఆదరాన్ని గ్రంథకర్త ప్రకటించి ఉండవచ్చుగదా! అదెందుకు చేయలేదని ప్రశ్న. అందుకు నాకు రెండు కారణాలు కానవస్తున్నవి—

నేను కొంతకాలం సీతారాంబాగు సంస్కృత కళాశాలలో చదువుకొని ఆ తరువాత కొత్వాలు ఆంధ్రగీర్వాణ విద్యాపీఠంలో భాషాప్రవీణ తరగతిలో చేరినాను. అట్లా చదువుకొంటున్నప్పుడే మధ్యలో ఒకసారి సీతారాంబాగు కళాశాలకు వెళ్లగా

అక్కడి సంస్కృత పండితులు కొందరు—"తెలుగుకూడా చదువదగిన భాషేనా!" అని కొంత ఏహ్యభావం ప్రకటించడం నాకు ఇప్పటికీ బాగా జ్ఞాపకం వున్నది. ఇది 45 సంవత్సరాలనాటి మాట. పైగా ఆ సంస్కృత పండితులుకూడ తెలుగువారే. సంస్కృత పండితులకు చాలమందికి ఇటువంటి అభిప్రాయం వుండేది. బహుశః అమరవాదివారికిన్నీ కూడా ఈ అభిప్రాయం వుండవచ్చు. లేదా రాయలవారి ఆముక్త మాల్యద తెలుగు ప్రబంధాల్లో వొకటి. కేవలసంస్కృతభాషాపాండిత్యం వున్నంత మాత్రాన అది కొరుకుడుపడేది కాదు. కనుక దానిని అర్థంచేసికొనే శ్రమ ఎందుకని విడిచి వుండవచ్చును. ఏమయినా రాయలవారి గ్రంథాన్ని చదివింతరువాత ఆ కావ్యసౌందర్యానికి ముగ్ధుడు కాకుండా వుండడంకాని, అప్పుడు అతడే సంస్కృతంలో అదే పేరితో అదే కథను కావ్యంగా రచిస్తూ వొకటిరెండు చోట్లనయినా రాయలవారి భావాలను తనగ్రంథంలో చేర్చుకోకుండా వుండడంకాని సంభవించదు. కారణం యేదయినా యీ రెండు గ్రంథాలకూ పోలికలేదనేది సత్యం.

శ్రీ నరేశ్వరశర్మగారు అమరవాదివారి "ఆముక్తమాల్యదమ్ - ఒక పరిశీలన" అనే సిద్ధాంతవ్యాసాన్ని ఉస్మానియా విశ్వవిద్యాలయంవారి సంస్కృతంలో ఎం.ఫిల్. పట్టాకోసం డాక్టర్ కే. కమలగారి పర్యవేక్షణలో సిద్ధంచేసినారు. ఈ రసపల్ల శర్మగారి ప్రతిభామాత్రమేకాక కమలగారి పర్యవేక్షణనైపుణ్యంకూడా ప్రస్ఫుటమౌతున్నది. ఈ యిద్దరినీ నేనభినందిస్తున్నాను. అమరవాదివారి గ్రంథాన్నిగూర్చి చెప్పదగిన విషయములన్నింటిని యీ గ్రంథం చక్కగా వివరిస్తున్నది. కనుక యీ సిద్ధాంతవ్యాసంవల్ల మూలగ్రంథ గౌరవం పెంపొందగలదని ఆశిస్తున్నాను.

**— అమరేశం రాజేశ్వరశర్మ**



'Sahitya Vidya Praveena'
**T. VENKATESWARA SARMA,**
M.A., B.Ed.,
Retired Principal,
P.V.P. Evening Oriental College,
KAMAREDDY - 503 111.

Present Address :
158 / SRT,
Saidabad Colony,
HYDERABAD-500 659.

# మాల్యామోదః

“ఆముక్తమాల్యదమ్”—నామైవ సుందరమ్. కావ్యమపి సౌందర్యమందిరమ్. కావ్యశైలీ తు జటిలా; న చ కుటిలా. కావ్యేతివృత్తం గోదాచరితగ్రథనరూపం విశిష్టాద్వైతతత్త్వకథనప్రవృత్తమ్; గోదావరీవారివ పవిత్రమ్; ముక్తిప్రకాశేన భక్తిమత్తాపహాశలవిత్రమ్. కావ్యకర్తా అమరవాణీపారంగతః ‘అమరవాదీ’ ఆచార్యః. పరిశోధకః సురభారతీవరివస్యాపరినిష్ఠితకవితామర్మప్రకాశనకర్మశీలీ; స్వర్ణార్పిత విద్యావర్ధిష్ణుః వేంకటేశ్వరశర్మా. పర్యవేక్షణాధికారిణీ, సంస్కృతశాఖాధ్యక్షా, విదుషీమణిః శ్రీమతీ కమలా మహోదయా. సర్వమపి సుందరసంస్కృతమ్.

ఆ-సమన్తాత్-గ్రథితమాలాస్థితస్యైకస్యాపి కుసుమస్య స్రంసనం యథా న భవతి తథా సంపూర్ణతయా ముక్తం వృత్త్యోద్ధృతం మాల్యం శిరోధార్యమాలేత్యాముక్తమాల్యమ్. తథాభూతం మాల్యం దదాతీతి-శ్రీరంగనాథాయ సమర్పయతీత్యాముక్తమాల్యదా-గోదాదేవీ. తామధికృత్య కృతం కావ్యమిత్యాముక్తమాల్యదమ్.

అథవా- ‘ఆమ్’ ఇత్యంగీకారార్థకమవ్యయమ్. ‘ఆమ్’ ఇత్యుక్తం, శ్రీరంగనాథేనాంగీకృతం, మాల్యం స్వశిరసా ధృతిపూర్వాం మాలాం దదాతీత్యాముక్తమాల్యదా. తత్పరం కావ్యమాముక్తమాల్యదమ్.

యద్వా—‘ఆ’ ఇతి సంతోషార్థకమవ్యయం ప్రగృహ్య సంజ్ఞితమ్ (నానార్థరత్నమాలా- అవ్యయకాండః). ఇదం మాల్యమాత్మనా ధృతమేవ శ్రీరంగనాథప్రీతిపాత్రం భవతీతి గోదాదేవ్యా సంతోషేణ శిరసః విమోచితం- ‘ఆ-ముక్త-మాల్యమ్’. తత్ శ్రీరంగనాథాయ సమర్పితవతీతి తత్సంజ్ఞయా సా వ్యవహృతా.

అథవా- ‘ఆ’ ఇత్యవ్యయం వాక్య, స్మరణార్థకమ్. (సిద్ధాంతకౌముదీ; అవ్యయప్రకరణం; బాలమనోరమా- తత్త్వబోధినీ) “గోదాదేవ్యా ధృతపూర్వా మాలైవ మమ సమ్మతా” ఇతి శ్రీరంగనాథవాక్యం స్మృత్వా అనంతరం తన్మాల్యం ముక్త్వా తస్మై ఉపహారతయా సమర్పయతీత్యాముక్తమాల్యదా.

గోదాపదస్థ 'గో' శబ్దస్య — స్వర్గ, బాణ, ధేను, వాక్, వజ్ర, దిక్, నేత్ర, కిరణ, భూమి, జలాద్యర్థాః గోదాదేవీపరతయా అన్వర్థీభవంతీతి శ్రీ వేదాంతదేశిక కృత గోదాస్తుత్యాదిగ్రంథవ్యాఖ్యానావసరే విద్వద్భిస్సమర్థితాః. మమ తు గోదాశబ్దే 'ఆముక్తమాల్యదా' ఇత్యర్థోఽపి ప్రతిభాతి. యథా గోశబ్దస్య 'కేశః' ఇత్యప్యర్థో విద్యతే — "గౌః క్రతౌ వృషభే చంద్రే వాగ్భూదిగ్ధేనుషు స్త్రియామ్, ద్వయోస్తు రశ్మి దృగ్బాణస్వర్గ వజ్రాంబు లోమసు" (నానార్థమాలా-ఏకాక్షరకాండః). కేశేషు, శ్రీరంగనాథాంగీకార్యమాల్యధారణయోగ్యేషు, తన్మాల్యం ధృత్వా విముచ్య, శ్రీరంగ నాథాయ దదాతీతి 'గోదా' ఇత్యర్థస్సమున్నేయః. ఏతేన, గోదాశబ్దపర్యాయత్వేన 'కోదై' ఇతి తమిళపదస్య పరిశోధకోక్తః 'మాలా' ఇత్యర్థోపి సంగచ్ఛతే. మాలాశబ్దే నైవ మాలాధారిణీ (గోదాదేవీ) తమిళభాషాయాం 'కోదై' ఇతి పదేన వ్యవహృతా స్యాత్ ఛత్రిన్యాయేన.

వేదం వేంకటరాయశాస్త్రివర్యైరాముక్తశబ్దస్యార్థః ధృతమిత్యేవ వ్యాఖ్యాతః అమరకోశానుసారేణ. (ఆముక్తమాల్యదాసంజీవినీవ్యాఖ్యా)

'గోదా — ఆముక్తమాల్యదా' ఇతి ద్వయోర్నామ్నయోః ప్రపన్నామృతస్థ 'ఆముక్తమాల్యదా' నామైవాతీవరుచిరమిత్యాచార్యైః పరిగృహీతమితి భాసతే. అత ఏవ శ్రీకృష్ణదేవరాయకవివర్యేణాపీదమేవ గృహీతమిత్యుక్తే యుక్తమేవస్యాత్. శ్రీకృష్ణదేవరాయః కావ్యనాయికానామ్నైవ స్వీయకృతిం వ్యవహృతవాన్. కావ్య నాయికామధికృత్య నిబద్ధమిదం కావ్యమిత్యాశయేనాచార్యవర్యైరాముక్తమాల్యదేతి నామకరణం కృతమితి వివేకః.

ప్రపన్నామృతోక్తం 'నామ' సాక్షాదేవ శ్రీకృష్ణదేవరాయేణ, ఆచార్యవర్యైః స్వతంత్రతయా పరిగృహీతమిత్యేవ సరసమ్. ఇతివృత్తప్రసంగే ఆముక్తమాల్యద పరిశోధక ప్రతిపాదిత దిశా — ఆంధ్రాముక్తమాల్యదాస్థకథా; ఆచార్యాముక్తమాల్యదస్థ కథా చ అధికాంశేషు విసంవాదిన్యావేవ. తథైవ కావ్యనామకరణేఽపి శ్రీకృష్ణదేవ రాయకావ్యనామ్నప్రభావః ఆచార్యకావ్యనామనిర్దేశేనైవ విద్యత ఇతి వక్తుం యుక్తతరం స్యాత్.

సంతునామ సన్నిధానం సూర్యనారాయణశాస్త్రివర్యాదయో లబ్ధప్రతిష్ఠాః కేచన సంస్కృతాంధ్ర పండితాః ఆంధ్రపంచకావ్యసంస్కృతానువాదకరణే ఉద్యుక్తాః. ఆచార్యవర్యాస్త్విదం కావ్యం స్వతంత్రప్రణాళికయైవ విరచితవంత ఇతి సంభావ నీయమ్.

ప్రావేశికప్రకరణాదారభ్య, తార్తీయీకప్రకరణం యావత్పరిశోధనసిద్ధాంతే ప్రతి పాదితాంశాః అన్యూనానతిరిక్తవిషయతావగసిద్ధే వసమర్థాస్సంతస్సర్వాంగీణపరామర్శతాం కలయంత ఇతి నాత్ర సందేహః. విశేషతః ఇతివృత్త, నామౌచిత్య, రస, తత్త్వవివేచన పరాః అంశాః పరిశోధకస్య తత్తదంశేషు పరినిష్ఠితం జ్ఞానం ప్రకటీకుర్వన్తి. తత్రాపి

కావ్యరసనిర్ధారణే భక్తేః రసత్వాంగీకారే రసవిషయే కావ్యలక్షణసమన్వయః; అనంగీకారేఽపి కావ్యే రసః శృంగార ఇతి సిద్ధాంతితం యత్, మృదులరీత్యా భక్తేః రసత్వనిరాసః; 'వడగలై' 'తెంగలై' శాఖయోస్సిద్ధాంతరీత్యా పరస్పర భేదప్రదర్శన పురస్సర ముభయవేదాంతప్రతిపాదితవిశిష్టాద్వైతసిద్ధాంతసంక్షిప్త పరిచయః; శ్రీవైష్ణవ సంప్రదాయే గోదాదేవ్యాః స్థానమిత్యాద్యంశాః న కేవలం విదుషాం ప్రమోదాయ; అపితు సాధారణ జ్ఞానవతామపి ధీమతాం నితరామితరానపేక్షతయా సులభగ్రాహ్యత్వేన శ్రీ వైష్ణవసంప్రదాయ జ్ఞానసాధనాయ కల్పంత ఇత్యనల్పం పరిశోధనప్రయోజనమ్.

పరిశోధనాంశ వివరణసందర్భే తత్ర తత్ర పరామృష్టానామంశానామనుసంధేయత్వేన భావితాః అధోనిర్దిష్టాంశాః పరిశీలనాయ పరిశోధకదృష్టిపథం నీయంతే.

గోదాదేవ్యాః భూదేవ్యవతారత్వేన యత్కథితమాచార్యైస్తత్ శ్రీకృష్ణదేవరాయాముక్తమాల్యదాకథనేన సంవదతి; గురుపరంపరాప్రభావ-ప్రపన్నామృతగ్రంథయో ర్లక్ష్మీదేవ్యవతారత్వేన కథితమితీతిపూర్వప్రకరణే ఉక్తాంశస్య-ద్వయోః కావ్యయోః భూదేవ్యవతారత్వకథనస్య మూలం శ్రీ వేదాంతదేశికవిరచితగోదాస్తుతిగ్రంథే దృశ్యమానా— 'సాక్షాత్ క్షమాం కరుణయా కమలామివాన్యామ్' (శ్లో. 1); వల్మీకతః శ్రవణతో వసుధాత్మనస్తే (శ్లో. 7) ఇత్యాదయః అనుసంధేయా ఇతిమన్యే.

అలంకారవివరణప్రసంగే 'యథావృక్ష' మితి శ్లోకే ఉపమానకోటౌ 'యథా' 'ఇవ' ఇత్యుపమావాచకద్వయస్య పృథక్ పృథగుపాదానమాచార్యైః కృత మనావశ్యకమ్; ఏకేనైవోపమావాచకేన సాదృశ్యస్య వాచ్యత్వే సిద్ధే అన్యతరస్య వైయర్థ్యాపత్తిరిత్యనుసంధేయతాయాః పాత్రం భవతి.

"సౌందర్యాబ్ధేః కిము పరిస్రుతా వీచికా సేతుమాలా" ఇత్యాదిశ్లోకే 'సౌందర్యాబ్ధిః' 'పద్మకింజల్కవల్లి'-'నాసావల్లీ' ఇత్యత్ర సత్యపి రూపకాలంకారే; 'పరిస్రుతా వీచికా సేతుమాలాకిము'-'వక్త్రోల్లాసప్రసవలతికేవ'-'మురజిన్మోహశక్తిః ప్రవేశః' ఇత్యత్రోత్ప్రేక్షాలంకారః; 'ఓష్ఠమంబుస్పృశీవత్' ఇత్యత్రోపమాలంకార ఇతి వక్తుం యుజ్యతే.

'తెలుసుదనము' ఇత్యంశే 'ప్రకటితదివ్య నారూపః' ఇత్యత్ర-'నాః ఇతి రూపం యస్యసః నారూపః' ఇతి విగ్రహేణ ఆచార్యప్రయుక్త 'నారూప' శబ్దస్య 'నరరూపః' ఇత్యర్థే సంస్కృతభాషాయాం; 'మమరూపః' ఇత్యర్థే ఆంధ్రభాషాయాంచ శ్లిష్టార్థత్వేన వక్తుం శక్యం వేతి పరిశోధకపరిశీలనార్హ మితి మన్యే.

పరిశోధననిబంధోఽయం పండితప్రశంసాపాత్రం భవిష్యత్యేవేతి నాత్ర విప్రతిపత్తిః. పరిశోధనరంగే శ్రీ నగేశ్వరశర్మణః ఉత్తరోత్తరపదవీప్రవృత్తిస్సంపత్తిశ్చా భూయాదిత్యాశాస్యతే.

అంగిరస-శ్రావణ-శుక్ల
ద్వితీయా-భృగువాసరః
31-7-1992

**— తిగుళ్ల వేంకటేశ్వరశర్మా**

# ఆత్మనివేదనము

**

1988లో ఉస్మానియా విశ్వవిద్యాలయముచే సంస్కృతమున ఎం.ఫిల్., పట్టమునకై అర్హముగా స్వీకరింపబడిన పరిశోధనగ్రంథమిది.

శ్రీమాన్ అమరవాది వేంకటనరసింహాచార్యులవారు రచించిన "అముక్తమాల్యదమ్" అను సంస్కృత చంపూకావ్యమును గూర్చిన పరిశీలనమును పరిశోధనాంశముగ సూచించినవారు అనాటి మా కళాశాల ప్రాచార్యులు; సంస్కృతాంధ్ర విద్వద్వరేణ్యులు - శ్రీ తిగుళ్ల వేంకటేశ్వరశర్మగారు.

నేనీ పరిశోధనను చేయుటకు అనుమతించి; అవకాశమును కల్పించినవారు మా కళాశాలసంచాలకులు; అనేక పరిశోధనగ్రంథరచనలద్వారా లబ్ధప్రతిష్ఠులైన సాహితీవేత్తలు-'ఆచార్య' డా॥ అమరేశం రాజేశ్వరశర్మగారు.

నా పరిశోధనవ్యాసమును ఆమూలాగ్రముగ పరిశీలించి, సూచనిర్దేశమొనరించుటయేగాక; అచిరకాలములో నా పరిశోధనకార్యము పూర్తియగుటకు తగిన ప్రోత్సాహమునందించిన పర్యవేక్షకురాలు; ఉస్మానియా విశ్వవిద్యాలయ సంస్కృత శాఖాధ్యక్షురాలు, విదుషీమణి—'ఆచార్య' డా॥ కే. కమలగారు.

నేను ఎం.ఫిల్., కోర్సులోచేరి అధ్యయనము చేయుచున్నప్పుడు నన్ను విశేషముగ ప్రోత్సహించుటయేగాక; తమ అమూల్యసందేశములను అందించినవారు అనాటి సంస్కృతశాఖాధ్యక్షులు 'ఆచార్య' డా॥ ప్రహ్లాదగణేశలాలేగారు.

తరగతులలోను; వైయక్తికముగను తమ సూచనలనందించి నన్ను ముందుకు నడిపించినవారు— 'ఆచార్య' డా॥ పుల్లెల శ్రీరామచంద్రుడుగారు; 'ఆచార్య' డా॥ బి. గోపాలరెడ్డిగారు; 'ఆచార్య' డా॥ నళినీసాధలేగారు; డా॥ టి. నరసింహాచార్యులుగారు.

నా పరిశోధనకు అవశ్యకములగు గ్రంథములనందించుటయేగాక, అనుక్షణము నన్ను ప్రోత్సహించి; అండదండగా నిలిచిన ధీశాలి, సహోపన్యాసకులు- డా॥ అవధానం రంగనాథ వాచస్పతిగారు.

పరిశోధనకార్యవశమున నేను వరంగల్లుకు వెళ్ళినపుడు అచట నాకన్ని విధములుగ సహకరించినవారు శ్రీ శాస్త్రుల భార్గవరామశర్మగారు; శ్రీమాన్ పరాంకుశాచార్యులుగారు. ఉత్తరాలద్వారా నాకు సందేశములనొసగినవారు శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల రఘునాథాచార్యులుగారు.

విశిష్టాద్వైత సంప్రదాయమునకు సంబంధించిన అనేక విషయములను తెలిపి; సంశయములను తీర్చినవారు— కామారెడ్డి ప్రభుత్వడిగ్రీ కళాశాల ప్రాచార్యులు డా॥ గుండి వేంకటాచార్యులుగారు.

ఈ పరిశోధనవ్యాసరచనలో— తమ గ్రంథములలోని విశేషములను సేకరించుకొనుటలో నాకు ప్రత్యక్షముగను; పరోక్షముగను తోడ్పడినవారు— డా॥ కోవెల సంపత్కుమారాచార్య; డా॥ ఎస్. చంద్రకాంత్; పండిత బలదేవ ఉపాధ్యాయ మరియు ఇతర గ్రంథముల, వ్యాఖ్యానముల కర్తలు.

ఈ గ్రంథము వెలుగులోనికి వచ్చుటకు, నేను కోరినవెంటనే 'ఆధ్యాత్మిక గ్రంథప్రచురణ సహాయపథకము' క్రింద రు. 10,000/-ల ఆర్థిక సహాయమును అందజేసినవారు- తిరుమల తిరుపతి దేవస్థానమువారు. ఈ కృషిలో పాలుపంచుకొన్న ముఖ్యులు కార్యనిర్వహణాధికారి శ్రీ ఎం.వి.ఎస్. ప్రసాద్, IAS గారు, సంపాదకులు శ్రీ పి. సుబ్బారావుగారు. ఆర్థికసహాయమునకై టి.టి.డి. వారిని అభ్యర్థింపవలసినదిగా నన్ను ప్రోత్సహించినవారు— శ్రీ గరికపర్తి శంకరశర్మగారు, శ్రీమతి శివాసీకేసరి దంపతులు.

నాపైగల అభిమానముతో గ్రంథప్రచురణకు ఇంకను అవసరమైన సిరిని నా జన్మస్థానము రామారెడ్డి గ్రామములో విరాళముల రూపములో సేకరించుటలో కృషిసల్పినవారు— శ్రీ సుష్మని గంగారాంగారు, శ్రీ తన్నీరు విఠల్‌గారు.

నేను కోరినవెంటనే విరాళములనందజేసి, తమ ఔదార్యమును ప్రకటించినవారు— ఈ గ్రంథము చివరగల "దాతల పట్టిక"లో ప్రకటింపబడిన పేర్లుగల దాతలు.

ఈ గ్రంథమును జాతీయసాహిత్యపరిషత్తు కామారెడ్డిశాఖ పక్షమున ప్రకటించుటకు "స్వాగతము" పలికినవారు జాతీయసాహిత్యపరిషత్తు— ఆంధ్రప్రదేశ్ కార్యదర్శులు, పరమ మిత్రులు డా॥ కనిరెడ్డి వెంకటరెడ్డిగారు.

నా కోరికను మన్నించి, తమ ఆశీరభినందనవచనపురస్సరములగు అభిప్రాయములను అందజేసి, నా కృషికి గౌరవమును కల్పించినవారు— 'ఆచార్య' డా॥ కే. కమలగారు; 'ఆచార్య' డా॥ అమరేశం రాజేశ్వరశర్మగారు; శ్రీ తిగుళ్ల వేంకటేశ్వరశర్మగారు.

శ్రీ విల్లిపుత్తూరులోని గోదాదేవి మూలవిగ్రహము ఛాయాచిత్రమును అందజేసినవారు శ్రీమాన్ డింగరి కందాళై కృష్ణమాచార్యులుగారు. శ్రీమాన్ అమరవాది వేంకటనరసింహాచార్యులుగారి ఛాయాచిత్రము బ్లాకును అందజేసినవారు డా॥ ఏ.వై. నారాయణాచార్యులుగారు.

ఈ గ్రంథమును సౌందర్యవంతముగను, నిర్దుష్టముగను ముద్రించుటలో ఆత్మీయమగు సహకారమునందించినవారు-కామారెడ్డి ఆంజనేయ ముద్రణాలయాధిపతి శ్రీ కారంపురి నారాయణగారు. అక్షరముల కూర్పులో ప్రత్యేకశ్రద్ధవహించిన సంస్కారహృదయులు— శ్రీ జక్కని తిరుపతిగారు.

ఇందరి సహకారము లేకున్నచో నేనీ కార్యమును ఈ రూపమున పూర్తి చేసెడివాడనుకాను. కావున వీరందరికీ నా కృతజ్ఞతాభివాదములను సమర్పించుకొను చున్నాను.

**— అయాచితం నటేశ్వరశర్మ**



# విషయసూచిక



## IV. తాత్త్విక ప్రకరణము (97—122)



## V. అనుబంధములు





# సంక్షేపపదసూచిక

**

| | | | |
|---|---|---|---|
| అంక. | .... | .... | అంకము |
| అధ్యా. | .... | .... | అధ్యాయము |
| అభిజ్ఞాన. | .... | .... | అభిజ్ఞానశాకుంతలమ్ |
| ఆముక్త. | .... | .... | ఆముక్తమాల్యదమ్ |
| ఆఖ్యా. | .... | .... | ఆఖ్యానము |
| ఆ.సౌ. | .... | .... | ఆముక్తమాల్యదా సౌందర్యము |
| ఉన్మే. | .... | .... | ఉన్మేషము |
| ఉల్లా. | .... | .... | ఉల్లాసము |
| చంద్రా. | .... | .... | చంద్రాలోకము |
| పద్య. | .... | .... | పద్యము |
| పరి. | .... | .... | పరిచ్ఛేదము |
| ప్రపన్న. | .... | .... | ప్రపన్నామృతము |
| పాద. | .... | .... | పాదము |
| పు. | .... | .... | పుట |
| బ్ర. సూ. | .... | .... | బ్రహ్మసూత్రములు |
| బృ. ఉ. | .... | .... | బృహదారణ్యకోపనిషత్తు |
| రం.వా.తు.వ. | .... | .... | రంగనాథ-వాల్మీకిరామాయణముల తులనాత్మక పరిశీలనము |
| రాయల ఆముక్త. | .... | .... | శ్రీకృష్ణదేవరాయల ఆముక్తమాల్యద |
| వచ. | .... | .... | వచనము |
| వా. | .... | ... | వార్తికము |
| శ్లో. | .... | .... | శ్లోకము |
| సూ. | .... | .... | సూత్రము |



# అవతారిక



సంస్కృత సాహిత్యమునకు ప్రచారము, ప్రోత్సాహము కొరవడిన ఈ రోజులలోకూడ ఆ భాషపై అపారమగు ప్రేమతో, గౌరవముతో సంస్కృత భాషా ప్రచారమునకు నడుముగట్టి, ఆ భాషయందు గ్రంథరచనము చేసిన, చేయుచున్న రచయితలు, కవులు కలరు. అట్టివారి కృషినిగూర్చి పరిశోధనము గావించి, వారిని ప్రోత్సహించుట సంస్కృతభాషాప్రియుల కర్తవ్యము. అట్టి పరిశోధనలు ఆయా రచయితలకేగాక, ఇతరులకును ప్రోత్సాహము కల్గించును. ఈ దృక్పథముతో నేను ఎం.ఫిల్. పట్టమునకు పరిశోధనాంశముగా శ్రీమాన్ అమరవాది వేంకటనరసింహాచార్యులవారి "అముక్తమాల్యదమ్" అను చంపూకావ్యమును గ్రహించితిని. ఆచార్యుల వారి రచనలు చాలవరకు సంస్కృతములోనే ఉన్నవి. వారి జీవితమంతయు సంస్కృత భాషయొక్క అధ్యయనము, అధ్యాపనము, ప్రచారములకు అంకితమైనది. ఆచార్యుల వారి ముద్రిత రచనలలో ఎన్నదగిన "అముక్తమాల్యదమ్" అను ఈ కావ్యము శ్రీ వైష్ణవ సిద్ధాంతప్రతిపాదకముగ కూడ విశేషస్థానము నలంకరింపదగియున్నది.

పై కావ్యమును గూర్చిన నా యీ పరిశోధనవ్యాసము ప్రధానముగ నాలుగు ప్రకరణములుగ విభజింపబడినది.

మొదటిదగు ప్రావేశిక ప్రకరణమున "ఉపక్రమణిక"లో సంస్కృత సాహిత్యమునందు చంపూకావ్యముల వైశిష్ట్యమునుగూర్చి సంగ్రహముగ పరిచయము చేయబడినది. ఈ కావ్యకర్తయైన శ్రీమాన్ అమరవాది వేంకటనరసింహాచార్యులవారిని గూర్చియు, వారి విద్వత్కవిత్వాదులను గూర్చియు, వారి బహుభాషాగ్రంథ కర్తృత్వమునుగూర్చియు, ప్రకృత పరిశోధనీయమగు "అముక్తమాల్యదమ్" కావ్యమును గూర్చియు 'కవి పరిచయము', 'కావ్యపరిచయము' అను శీర్షికలలో పరిచయమొనర్పబడినది

రెండవదగు "ఇతివృత్తప్రకరణము"లో ఆచార్యులవారు ఈ కావ్యములోని ఇతివృత్తమును ఏయే ప్రాచీనగ్రంథములనుండిగైకొనిరో ఇదమిత్థముగ తేల్చిచెప్పుటకు గురుపరంపరా ప్రభావము, దివ్యసూరిచరిత్ర, ప్రపన్నామృతము, ఆముక్తమాల్యద (రాయలు) మున్నగు గ్రంథములయందలి ఇతివృత్తములలో ఈ కావ్యేతివృత్తము

తులనాత్మకముగ పరిశీలింపబడినది. ఆచార్యులవారొనరించిన నవీన కల్పనములను పేర్కొని, వాని సామంజస్యములను గూర్చి చర్చింపబడినది. కావ్యనామౌచిత్యము సమీక్షింపబడినది. అనువాద వివేచనమను ద్వితీయభాగములో ఆచార్యులవారు తమిళ గ్రంథములనుండి అనువదించిన ఘట్టములు మూలములతో తులనాత్మకముగ పరిశీలింపబడినవి.

మూడవదగు "కావ్యాంశవివేచన ప్రకరణ"మున ఈ కావ్యమున శృంగార రసాంతర్భూతమైన మధురభక్తి ఎట్లు ప్రతిపాదింపబడెనో వివరించి, ప్రధానరసము శృంగారమనియు, అంగరసము శాంతమనియు ప్రతిపాదింపబడినది. పాత్ర చిత్రణము సమీక్షింపబడినది. వర్ణనలలో ఆచార్యులవారు ప్రదర్శించిన ప్రతిభ, నవ్యత ఎట్టిదో నిరూపింపబడినది. అలంకారములను ఆచార్యులవారు ఆయా సందర్భానుగుణముగ ఎట్లు సంబంధించిరో విశదపరుపబడినది. శైలి చర్చింపబడినది. ఆచార్యులవారి పద్య గద్య రచనావిధానమెట్లుండునో దిఙ్మాత్రముగ చూపబడినది, ఆచార్యులవారీకావ్యమున ప్రదర్శించిన ఛందోవైవిధ్యము పరిశీలింపబడినది, ఆయాపాత్రోచిత, సందర్భోచితములగు సుభాషితములెట్లు సమకూర్చబడెనో పరిశీలింపబడినది. ఆచార్యులవారు తెలుగువారుగనుక, వారి "తెలుగుదనము" కావ్యమునందెట్లు ప్రతిబింబించెనో సమీక్షింపబడినది. శాబ్దిక చమత్కారములు, ఆచార్యులవారికిగల వివిధ శాస్త్రవైదుష్యము సోదాహరణముగ ప్రదర్శింపబడినవి. ఆచార్యులవారి రచనలో పూర్వమహాకవుల భావములు, శైలియెట్లు అచ్చటచ్చట అనుసరింపబడెనో చూపబడినది.

నాలవదగు "తాత్త్విక ప్రకరణము"న—విశిష్టాద్వైత తత్త్వము, విశేషించి—తెంగలై శాఖా సంప్రదాయము సంగ్రహముగా పరిచయము చేయబడినది. పిమ్మట ఈ కావ్యమునందు ఆ తాత్త్వికాంశములెట్లు ప్రతిఫలించుచున్నవో, కావ్యమున వానికి గల ప్రాధాన్యమెట్టిదో సోదాహరణముగ నిరూపింపబడినది. శ్రీవైష్ణవసంప్రదాయము నందును, సాహిత్యమునందును గోదాదేవికిగల స్థానమునుగూర్చి ఈ ప్రకరణాంతమున ఉల్లేఖింపబడినది.

"ఉపసంహారము"నందు ఆచార్యులవారి సాహిత్యకృషియు, ఈ గ్రంథములో ఆయన ఆశించిన ప్రయోజనమును, దాని సాఫల్యమును చర్చింపబడినది.

అనుబంధములలో తొలుత శ్రీవైష్ణవసంప్రదాయపరంపరలో ప్రధానులగు పన్నిద్దరాళ్వార్లను గూర్చియు, నాథయామునాద్యాచార్యులను గూర్చియు సంగ్రహముగ పరిచయము గావింపబడినది. రెండవ అనుబంధమున శ్రీవైష్ణవములోని

'తెంగలై'-'వడగలై' శాఖల ప్రధాన భేదములు ఉల్లేఖింపబడినవి. పిమ్మట ఉపయుక్త గ్రంథసూచిక కూర్చబడినది. సంస్కృతము, తెలుగు, తమిళము, ఆంగ్లములలోని గ్రంథములు వరుసగా వేర్వేరుగా వర్ణక్రమమున కూర్చబడినవి.

ఈ వ్యాసములో ప్రథమ ప్రకరణమునకు పూర్వమే విషయసూచికయు, అందు ఉదాహరింపబడిన ఆయా గ్రంథముల కుపయోగించిన సంకేతపదముల వివరణయు, కూర్చబడినది.

ఈ వ్యాసమునందు సాధ్యమైనంత మేరకు సరళగ్రాంథికము అనుసరింపబడినది. సంధి ఐచ్ఛికముగా పాటింపబడినది. అరసున్నలు, శకటరేఫలు పరిహరింపబడినవి. తమిళగాథలనుదాహరించు సందర్భములందు కాంచీపురము శ్రీ భగవద్రామానుజ గ్రంథమాలవారనుసరించిన విధముగనే తెలుగు లిపి అనుసరింపబడినది.

తమిళములో ழ అను వర్ణమునకు ప్రత్యామ్నాయముగ తెలుగు లిపిలో ఴ కారము పై ముద్రికలననుసరించియే ప్రయోగింపబడినది.



# ప్రావేశిక ప్రకరణము



## ఉపక్రమణిక

సంస్కృత సారస్వతము ఆకాశమువలె అతివిశాలము. సాగరమువలె అతిగంభీరము. ఆ ఆకాశములో నిరంతరము యశోదీధితులచే వెలుగు మహాకవితారకలున్నవి. ఆ సాగరమునందు సత్కవి సుందర దీప్తులచే విలసిల్లు అమూల్య మహాకావ్యరత్నములున్నవి. ఆ ఆకాశసాగరములు నిరుపమానములు.

అనాదులును అపౌరుషేయములును అగు వేదములు మొదలుకొని ఆధునిక సాహిత్యము వరకు సకలవాఙ్మయజాతమును సంస్కృతసారస్వతము ఒకేరీతి విస్తరించియున్నది. ప్రభువువలె శాసించు వేదములు, మిత్రునివలె హితముచెప్పు పురాణములు, కాంతవలె అనునయించు కావ్యములు సంస్కృతవాఙ్మయమునందు విశ్వౌన్నత్యమునకు ప్రతీకలై నిలిచినవి. ఇదియంతయు నిరంతరవాహినియగు భారతీయ సారస్వతగంగాప్రవాహము.

ఇట్లు అనాదిగా ఉరువడి, అనంతముగా సాగిపోవుచున్న యీ పవిత్ర సంస్కృతసారస్వతజాహ్నవి కావ్యవాఙ్మయావిర్భావములో ఒక క్రొత్త మలుపు తిరిగినది. సుషుప్తావస్థలోనున్న మహాకావ్య జగత్తునకు వాల్మీకిమహర్షి ముఖారవిందము నుండి జాలువారిన "మానిషాద" శ్లోకము మేలుకొలుపైనది. అట్లు మేల్కొన్న సంస్కృతకావ్యజగత్తు నాటి వాల్మీకి మొదలు నేటి ఆధునిక వాల్మీకుల వరకు ఎన్నో వేల కవిచంద్రుల కవితామృతకిరణముల స్పర్శలకు పులకించి, ఎన్నో మహిత రఘువంశాది పద్యకావ్యములు, కాదంబర్యాది గద్యకావ్యములు, చంపూరామాయణాది చంపూకావ్యములు ప్రసాదించి సంస్కృత సారస్వత వారసంపదయైనది.

ఇట్టి విలక్షణమైన సంస్కృత కావ్యప్రపంచమున చంపూకావ్యములకు ఒక విశిష్టమగు స్థానము కలదు. ఆ వైశిష్ట్యమే గద్యపద్యసమ్మిశ్రితత్వము. దీనికే 'మిశ్రక

మాధ్వీకల కలయిక"గా వేంకటాధ్వరి అభివర్ణింపగా;[1] హృద్యములగు వాద్యవిశేషములతో కూడిన గీతికవంటిదని భోజుడు[2] శ్లాఘించెను.

ఇంతటి మనోహరత్వమును కలిగియున్న ఈ చంపూకావ్యముయొక్క గద్యపద్యమిశ్రితమగు శైలికి బీజములు వేదములయందే ఉన్నవనియు; సంస్కృత వాఙ్మయమున చంపూకావ్యములను పరిశీలించినచో అవి రామాయణ, భారత, భాగవత, శివపురాణ, జైనపురాణ, ఆచార్య, మహాపురుష, కవి, ఆశ్రయదాతృ, పుణ్యక్షేత్ర, దేవాలయ, ఉత్సవ సంబంధములగు ఇతివృత్తములతో కూడియున్నవనియు; సంస్కృతమునగల మొత్తము 245 ముద్రితాముద్రిత చంపూకావ్యములలో 199 చంపూకావ్యములు దక్షిణ భారతమునను, తక్కినవి ఉత్తర భారతమునను నిర్మింపబడియున్నవనియు - సంస్కృత చంపూకావ్యములపై సమగ్ర పరిశోధనము జరిపిన డా॥ ఛవినాథ్ త్రిపాఠీగారు సిద్ధాంతీకరించిరి.[3]

ఆధునిక సంస్కృత సాహిత్యరంగమున కావ్యనిర్మాణమే అరుదుగకన్పించును. ఏమియో కొన్ని బృహత్కావ్యములు, ఖండకావ్యములు అప్పుడప్పుడు నిర్మింపబడినను వానిలో ప్రాచీన కావ్యముల సరసన చేర్చదగు అర్హతను పొందగలవి స్వల్పములే. అట్టి స్వల్పముగ కానవచ్చు మంచి కావ్యములలో ఎన్నదగినది క్రీ.శ. 1978లో నిర్మింపబడిన చంపూకావ్యము - "ఆముక్తమాల్యదా". దీనికర్త శ్రీమాన్ అమరవాది వేంకటనరసింహాచార్యులవారు.

1. 'పద్యం యద్యపి విద్యతే బహు సతాం హృద్యం విగద్యం న తత్
గద్యం చ ప్రతిపద్యతే న విజహత్పద్యం బుధాస్వాదనమ్।
ఆదత్తే హి తయోః ప్రయోగ ఉభయోరామోదభూమోదయం
సంగః కిన్న హి సంగతో మధురిమా మృద్వీకమాధ్వీకయోః॥"

— విశ్వగుణాదర్శః శ్లో-4

2. గద్యానుబంధరసమిశ్రిత పద్యసూక్తిః
హృద్యా హి వాద్య కలయా కలితేవ గీతిః॥

—చంపూరామాయణమ్, బాలకాండమ్. శ్లో-3

3. డా॥ ఛవినాథ్ త్రిపాఠీ - 'చంపూకావ్యకా ఆలోచనాత్మక్ ఏవం ఐతిహాసిక్ అధ్యయన్' పృ. 365

ఈ కావ్యేతివృత్తము వైష్ణవ సాహిత్యమునందు సుప్రసిద్ధము, పరమపూజ్యము నైనది. ఇది శ్రీ ఆండాళ్ అనబడు గోదాదేవి వృత్తాంతము. గోదాదేవి శ్రీ వైష్ణవ సంప్రదాయమున పన్నిద్దరాళ్వారులలో ఒకరుగా, భూదేవ్యవతారముగా పేర్కొనబడినది. ఈ కావ్యములో కథ గోదాదేవి అవతరించినదిమొదలు ఆమె శ్రీరంగనాథుని వివాహమాడుట వరకు గలదు.

ఈ కావ్యము సంస్కృతవాణికి నూతనలంకరణము. ఆధునికములగు కవిత్వ ధోరణులెన్నియో విశృంఖలముగను, పుంఖానుపుంఖముగను చెలరేగుచున్న ఈ కాలమున ప్రాచీన కావ్యధోరణిని పుణికిపుచ్చుకొని, గుణవైశిష్ట్యముచే ఈ కావ్యము సహృదయులకు ప్రమోదకారకమగుచున్నదనుట అత్యుక్తి కానేరదు. ఆచార్యులవారి ప్రతిభ ఈ కావ్యమునందు బహుముఖముగా సాక్షాత్కరించినది. "ఆముక్తమాల్యద" అను పేరు బహుజనశ్రుతమైనదే. తెలుగు భాషలో శ్రీకృష్ణదేవరాయలు రచించిన "ఆముక్తమాల్యద" సుప్రసిద్ధమైన కావ్యము. ఇది తెలుగు పంచకావ్యములలో ఒకటి. శ్రీ ఆచార్యులవారు తెలుగువారైనను, అనేక ప్రాచీనమును, సుప్రసిద్ధమును అయిన రాయలవారి కావ్యమును అనుకరించబూనక, అదే పేరుతో స్వతంత్ర సంస్కృత కావ్యము నిర్మింపబూనుట ఒక విధముగా సాహసమే. అట్లు సాహసించియు చక్కని కావ్యముగ తీర్చిదిద్దుటలో కృతకృత్యులగుట వారి విశిష్ట ప్రతిభా సంపత్తికి తార్కాణము.

శ్రీ ఆచార్యుల వారిని గూర్చిన సమగ్రపరిచయము చివరనుంచిన పఠనీయముగు "కవిపరిచయము" అను వ్యాసమున ప్రకటింపబడుచున్నది.



# కవిపరిచయము

ఆధునిక సంస్కృత సాహిత్యోద్యాన వనమున ప్రాచీనకావ్యసుమ సౌరభములను గుబాళింపజేయు ఈ "అముక్తమాల్యదమ్" అను చంపూకావ్యమును రచించిన వారు శ్రీమాన్ అమరవాది వేంకటనరసింహాచార్యులవారు. కౌశికసగోత్రులైన శ్రీ ఆచార్యులవారు పరీధావి (క్రీ.శ. 1918) సంవత్సరము ఆషాఢ పౌర్ణమినాడు రంగనాయకీ, నారాయణాచార్య దంపతులకు వరంగల్లులో జన్మించిరి.

ఆచార్యులవారి విద్యాభ్యాసమంతయు జన్మస్థానమైన వరంగల్లులోనే కొనసాగినది. వారు చదివిన చదువు ఆర్షమైనది. అనూచానముగా ప్రాచీన పద్ధతిలో వచ్చిన సంస్కృతవిద్య. ఆ విద్యకూడ ఏ గురుకులమునందో అభ్యసించుటకాదు - స్వగృహమునందే. పితృసన్నిధిలోనే. ఉపనయన సంస్కారమునందు బ్రహ్మవిద్యనుపదేశించి, జ్ఞానచక్షూన్మీలనముగావించిన తండ్రిగారే ఆచార్యస్థానమునందుండుట శ్రీ నరసింహాచార్యులవారి పురాకృతపుణ్యఫలమైనది. తండ్రిగారు ఇంటిలోనే నిర్వహించుచుండిన సంస్కృత పాఠశాలలోనే ఆచార్యులవారి విద్యాభ్యాసము కొనసాగినది. అప్పుడే సంస్కృత సాహిత్యమున వారికి చక్కని లోతైన పరిజ్ఞానమలవడినది. దీనికంతకును పితృపాదులైన శ్రీమాన్ నారాయణాచార్యులవారి విశేషప్రోత్సాహమే కారణమైనది. శ్రీ నారాయణాచార్యులవారు గొప్ప విద్వత్కవి. ప్రకరణాంతముగ తర్కశాస్త్రమును అధ్యయనము చేసినారు. సంస్కృతమున "నీలాకల్యాణ" మను నాటకమును, "రామానుజయశోభూషణ"మను అలంకార శాస్త్రమును, కూర నారాయణ విరచితమగు "సుదర్శన శతకము"నకు వ్యాఖ్యానమును రచించినవారు. కాని ఇవియన్నియును అముద్రితములే.

ఇట్లు విద్వద్వంశమున జన్మించుటచేతను, పుత్రుని తనంతవానిగ తీర్చిదిద్దవలెనను తండ్రిగారి దీక్షచేతను శ్రీ వేంకటనరసింహాచార్యులవారు సంస్కృతమున పరినిష్ఠితమగు పాండిత్యమును సంపాదించిరి. అపిచ విశేషముగ కృషిసలిపి, సంస్కృత సాహిత్యాధ్యయనమునకు మెరుగులుదిద్దు ప్రాకృతమును; స్వమతసాంప్రదాయిక గ్రంథాధ్యయనమునకు ఆవశ్యకమైన ద్రావిడ భాషను స్వాధీనము చేసికొనిరి.

ఆచార్యులవారికి వేదాంతశాస్త్రముపై అభిమానమెక్కువ. కావుననే పరిశ్రమించి తండ్రిగారి శిక్షణలోనే "ఉభయవేదాంతము"[1] లను ఆకళించుకొనిరి. కాని

---

1. వేదోపనిషద్బ్రహ్మసూత్రాదులలో ప్రతిపాదింపబడిన వేదాంతమును; ద్రవిడ వేదమగు "నాలాయిరదివ్యప్రబంధ" ప్రతిపాదితమగు వేదాంతమును కలిసి ఉభయవేదాంతములనబడును.

కేవలమది అధ్యయనము వరకే పరిమితముకాలేదు. పండిత పరిషత్తులలో దిగ్గజముల వంటి విద్వాంసుల ఎదుట అధీతమగు శాస్త్రమును ప్రదర్శించి, మెప్పు పొందుటయే శాస్త్రాధ్యయనప్రయోజనమని వారు భావించిరి. ఆ కారణముచేతనే వివిధవిద్వత్పరిషత్తులలో ఆచార్యులవారి వేదాంతశాస్త్రపాండిత్యము వన్నెకెక్కినది. వారి శాస్త్ర వైదుష్యమునకు గుర్తింపుగ వివిధ విద్వత్పరిషత్తులు "వేదాంత విద్వాన్" అను బిరుదముతో వారిని సత్కరించినవి.

ఆచార్యుల వారికి వేదాంతమన్న ఎంత అభిమానమో, కవిత్వమన్న అంతకన్న ఎక్కువ మక్కువ. వరస్పర విరోధముగల ఈ రెండు విద్యలును ఆచార్యులవారిలో ఉండుట ఆశ్చర్యకరమైనను, వేదాంతమువలన లభ్యమగునదియు, కవిత్వము వలన పొందదగినదియు ఆనందమే కావున వారికి ఈ రెండు విషయములపైగల అభిరుచికి వరమప్రయోజన మొకటియే. ఆచార్యులవారు తమ పన్నెండవయేటనే రచనలు చేయుట ప్రారంభించిరి. ఈ రచనావ్యాసంగమునకును విద్వత్కవియైన తండ్రిగారే ప్రేరకులైరి. బాల్యముననే చక్కని కవిత్వముచెప్పి; సహృదయుల ప్రశంసలతో బాటు 'బాలకవి', 'ప్రౌఢకవి'-అను బిరుదములనుకూడ పొందిరి. ఇట్లు వారి బాల్య దశయందే ప్రారంభమైన రచనావ్యాసంగము ఆమరణము నిరంతర తపముగా కొనసాగినది.

ఆచార్యులవారు చిన్నవి పెద్దవి కలిపి మొత్తము 86 గ్రంథములను వ్రాసిరి. వీనిలో చాల వరకు అముద్రితములు. కొన్నిమాత్రమే ముద్రితములు. ఇవి సంస్కృత ద్రావిడ, ఆంధ్రములలో ఉన్నవి.

ముద్రితమైన తొమ్మిదిరచనలు సంస్కృత భాషలోనివి. వానిలో చంపూ కావ్యమైన "ఆముక్తమాల్యదమ్", గోదాదేవి శ్రీరంగనాథుల పరిణయ వృత్తాంతముతో కూడిన స్వతంత్ర కావ్యము. మరి రెండు వ్యాఖ్యాన గ్రంథములు, అవి-ప్రాచీన వేదాంత గ్రంథములైన "కురంగీపంచకమ్: గోదాగాథా" అనువానికి విస్తృతమగు వ్యాఖ్యానరూపములు. ఈ రెండును చాలకాలము క్రితమే "వైష్ణవ పత్రిక"లో ధారా వాహికముగ ముద్రితములైనవి కాని గ్రంథరూపమున వెలువడలేదు. రామగాథను గద్యరూపమున చెప్పిన వేదాంతదేశికుల ప్రసిద్ధకృతియగు "రఘువీరగద్య" ప్రేరణ ముతో వ్రాయబడినది యదువీరగద్యమ్. ఇది కృష్ణుని గాథను తెలుపునది."యాదాద్రి లక్ష్మీనృసింహపంచాశత్" - "సప్తత్రిమాలికా" - "రామచంద్ర (జీ డి క ల్)

సుప్రభాతమ్"-"ఆపదుద్ధార స్తవః" అనునవి వీరు నిర్మించిన లఘుస్తోత్రములు. వీనిలో "ఆపదుద్ధార స్తవః" అను స్తోత్రమును యాదగిరి క్షేత్రమునందలి శ్రీ లక్ష్మీనరసింహ స్వామి దేవస్థానమువారు ప్రచురించిరి. ముద్రిత రచనలలో చివరిది - "దుష్కృత్ప్రతిషేధః" అను వచన గ్రంథము. ఇది అద్వైత మతావలంబియైన ఒకరు రచించిన "వైష్ణవమతప్రతిషేధః" అను విమర్శనమునకు సమాధానముగ వ్రాయబడిన వేదాంత గ్రంథము.

అముద్రిత రచనలు 27. వీనిలో సంస్కృతమున 18, ద్రావిడమున 5, ప్రాకృతమున 3, తెలుగున 1 కలవు.

సంస్కృత రచనలలో స్తోత్రములు 7. అవి- "లక్ష్మీనరసింహ సుప్రభాతమ్" "హనుమద్గిరి యతిరాజ సుప్రభాతమ్"-"శ్రీరామచంద్ర సుప్రభాతమ్"[1] - "శ్రీలక్ష్మీ స్తవః"-హయగ్రీవ స్తవః"-"హనుమత్ స్తవః"-"అభీతి స్తవః" అనునవి. విశిష్టాద్వైత వేదాంతపరములగు రచనలు నాలుగు. అవి "ద్రావిడోపనిషత్తాత్పర్యః"-"పరమార్థ చింతామణిః"-"యతిరాజవిషయకప్రపత్తిః"-"వైరాగ్యపంచకమ్" అనునవి. "వైయాసికన్యాయమాలా"అనునది న్యాయశాస్త్రమునకు సంబంధించినది. "ధనంజయవిజయః" "కవిజనమనోరంజనమ్"- "ప్రచండభార్గవమ్" అను మూడు రూపకభేదములు. వీనిలో ధనంజయ విజయము, ప్రచండభార్గవము వ్యాయోగములు కాగా, కవిజన మనోరంజనము భాణము. వేదాంతదేశికుల హంససందేశము యొక్క ప్రేరణచే వ్రాయబడిన సందేశ కావ్యము-"పరమహంస సందేశః". తెలుగులో ప్రసిద్ధమైన భాస్కరశతకమునకు సంస్కృతీకరణము - "భాస్కర శతకమ్". భారత కథను తెలుపు వచన గ్రంథము"భారత కథాసంగ్రహః". ఇవి అముద్రిత సంస్కృత కృతులు.

అముద్రిత ద్రావిడ భాషాకృతులు-5. అందు మూడు వ్యాఖ్యానములు. అవి తమిళమున ప్రసిద్ధవేదాంతగ్రంథములగు "అర్చిరాది"-"సప్తగాథా"-"అర్థపంచకమ్" అనువానికి వ్యాఖ్యానములు. మిగిలిన రెండును తమిళమున స్వతంత్రముగ వ్రాయబడిన గ్రంథములు. అవి "చరమపర్వచూడామణిః"-"అపరాధ పరిహారం" అనునవి. తెలుగులోని ఒకే ఒక రచన "యాదగిరిక్షేత్ర మాహాత్మ్యము". ఆంధ్రదేశమున సుప్రసిద్ధ పుణ్యక్షేత్రమగు యాదగిరిక్షేత్రముయొక్క మహిమను తెలుపు గ్రంథమిది.

---

1. ఇది క్షేత్ర నిర పేక్షముగ వ్రాయబడినది.

ప్రాకృతరచనలు 3. వీనిలో "ప్రాకృత శబ్దమంజరీ" ప్రాకృత భాషాభ్యాసన శీలురైనవారికి ప్రాథమిక జ్ఞానమును అందించు పుస్తకము. ఇది సంస్కృత శబ్ద మంజరీ రచనా విధానముననుసరించి వ్రాయబడినది. "ప్రాకృతసమాసకుసుమావళిః" కూడ ప్రాకృతభాషాధ్యయనమునకు ఉపయోగపడు గ్రంథము. "ప్రాకృతభాగవత కథాసంగ్రహః" రామాయణకథాసంగ్రహముననుసరించి వ్రాయబడినది.

ఇట్లు వివిధ భాషలలో బహుగ్రంథకర్తలైన ఆచార్యులవారి సాహిత్యవ్యక్తిత్వము విలక్షణమైనది. ఉభయవేదాంత, న్యాయశాస్త్రములయందేగాక, వ్యాకరణశాస్త్రమును కూడ ఆచార్యులవారాపోశనపట్టిరి. వారి విశేష వ్యాకరణశాస్త్రజ్ఞత'ఆముక్తమాల్యదమ్' కావ్యమున పలుతావులలో వ్యక్తమగును. ఒక్క భాషయందు గ్రంథరచన చేయుటయే విశేషముగ కనిపించు ఈ రోజులలో పలు భాషలలో పాండిత్యమును సంపాదించి, లఘురచనలేగాక, బృహత్కావ్యములనుకూడ సహృదయరంజకములుగ తీర్చిదిద్ద గలుగుట ఆచార్యులవారి ప్రతిభకు నిదర్శనము. ఇట్లు విశిష్టమగు ప్రతిభయును, పరిశ్రమయును వారిని విద్వత్కవిగా నిలుపగా, వారి నిగర్వితయు, వినయశీలమును వారి కీర్తికిరీటమునకు కలికితురాయిలై వన్నెతెచ్చుచున్నవి. "ఆముక్తమాల్యదమ్" కావ్యారంభమున ఆచార్యులవారి వినయశీలమిట్లు విశదమైనది-

"బాహూ ప్రసారయతి మే కవితాభిమానః
తం చాజ్ఞతా ప్రతినిషేధతి వర్ణనాసు।
కర్తవ్యతా జలధియం త్వపదార భావః
మాధుర్యవాచ మనువాచయతి స్మ గోదే॥

గంభీరభావపదసౌష్ఠవభావబంధ
చంపూమయీ విజయతే కవిపర్యవాణీ।
ప్రజ్ఞాం స్వకామవిగణయ్య కృతిం చికీర్షోః
తామేనమంబ! కృపయా పరయా షమస్వ॥"

—(ఉల్లా: 1 శ్లో: 4, 5)

ఆచార్యులవారికి కవిత్వము సహజముగ అబ్బినది. కవితా సుందరి ప్రమోద ములో స్వయముగ రావలెనే కాని, యాచనవలన రారాదనియు; అట్లయినచో అది సరసమైనను విరసమే కాగలదని 'ధనంజయవిజయ వ్యాయోగము'న ఆచార్యులవాడు చెప్పిన శ్లోకము ఇచట స్మరింపదగినది-

"కవితా వనితాపి ముదా స్వయమాగచ్ఛతి యతేచ్ఛయా చేత్।
తద్వరమితి వదన్తి సరసాః నో చేత్సరసాపి యాచనాద్విరసాః"
—(ధనంజయ విజయవ్యాయోగః)

ఈ యభిప్రాయమునే సమర్థించుచు - డా॥ కోవెల సంపత్కుమారాచార్యులు గారు కూడ ఆచార్యులవారికి కవిత సహజముగ సిద్ధించినదని వ్రాసిరి-

"తనకు స్వయంగా, యతేచ్ఛగా లభించిన కవితను ఒక 'వరం'గా స్వీకరించి, సాహిత్యకేదారంలో వివిధ కావ్యసస్యాలను ఫలింపజేసిన సరసకవులు శ్రీమాన్ అమరవాది వేంకటనరసింహాచార్యులుగారు"[1]

ఇట్లు సహజ సిద్ధమగు కవితను సత్కావ్యనిర్మాణమున వినియోగించిన ఆచార్యులవారు ధన్యులు.

అహమహమికలో శబ్దార్థములు కట్టెదుట నర్తింపగల రచనలుచేయు ఆచార్యుల వారు ప్రాచీనకవి వర్గమున పరిగణింపదగినవారని ప్రముఖ పండితులు శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల రఘునాథాచార్యులు గారిట్లు ప్రశంసించిరి-

"అహమహమికయా శబ్దాః
వివిధాశ్చార్థా పురో బుభూషంతి।
యస్య హి కవేః స గణ్యః
వ్యాస ప్రాచేతసాది కవివర్గే॥"
—(ఆముక్తమాల్యదమ్-'శుభాశంసనమ్')

దేశము మిక్కుటమగు సాంస్కృతిక సంక్షోభమున మునిగియుండి, సంస్కృతాధ్యయనము మిక్కిలి వెనుకబడియున్న ఈ రోజులలో విద్వత్కవులైన శ్రీ వేంకట నరసింహాచార్యులవారు మన మధ్యనుండుట అదృష్టమనియు, అట్టివారిని ప్రోత్సహింపకుండుట మన విధ్యుక్త ధర్మమును మరచినట్లె యని డా॥ కోవెల సుప్రసన్నాచార్యులవారన్నమాటలు సత్యదూరములుకావు-

---

1. కోవెల సంపత్కుమారాచార్య- 'మనపండితులు కవులు రచయితలు' ప్రశమ సంపుటము పుట: 197

**"At the times when the country is passing through a deep cultural crisis and when Sanskrit learning is cared very little, we are very fortunate to find Sri Venkata Narasimha Charya, a Scholar poet with us and we will be failing in our duty, if we are not encouraging the author of this divine language"**

—(ఆముక్తమాల్యదమ్–**Preface· P-V**)

ఆచార్యులవారి ముద్రిత రచనలు తెలుగు లిపిలో నున్నవి. వారి ముద్రితాముద్రిత రచనలన్నియు నాగరిలిపిలో నిర్దుష్టముగ ముద్రించినచో సంస్కృత భాషాభిజ్ఞులగు అన్యప్రాంతముల వారికి కూడ పఠనీయములై ఇతోధిక ప్రచారంప్రయోజనములను సాధించుట కవకాశ మేర్పడును.

సాహిత్యాధ్యయనము, గ్రంథరచనములే ఆజీవన జ్ఞానయజ్ఞములుగా భావించిన ఆచార్యులవారు తమ డెబ్బదియైదవయేట ప్రభవ సంవత్సర పుష్య కృష్ణ చతుర్థీ నాడు (ది. 18-1-1988) వరంగల్లులోని తమ స్వగృహమున పరమపదము నలంకరించిరి. వారి మరణము సంస్కృత సాహిత్య ప్రపంచమునకు తీరనిలోటు. భౌతికముగ వారు లేకపోయినను, యశశ్శరీరముచే వారు అమరులే. రససిద్ధులును, కీర్తియే శరీరముగా గలవారునైన శ్రీ ఆచార్యులవారి విషయమున, భర్తృహరి మహాకవి పలికిన మాటలు నిత్యసత్యములగుచున్నవి-

"జయంతి తే సుకృతినో
రససిద్ధాః కవీశ్వరాః।
నాస్తి యేషాం యశః కాయే
జరామరణజం భయమ్॥"



# కావ్యపరిచయము

శ్రీమాన్ అమరవాది వేంకటనరసింహాచార్యులవారు వివిధ భాషలలో గ్రంథములను రచించిరి. వానిలో అగ్రగణ్యమైన సంస్కృత చంపూకావ్యము - "ఆముక్తమాల్యదమ్". ఇది స్వతంత్రమగు రచన.

ఈ కావ్యము ఎప్పుడు నిర్మింపబడినదను విషయమునుగూర్చి విశదముగ తెలియపరచు ఉద్దేశముతో ఆచార్యులవారు కావ్యాంతమున ఒక శ్లోకమును వ్రాసిరి. అదియే ఈ కావ్యముయొక్క రచనా కాలమును తెలుపుటకు పరమ ప్రమాణమైనది-

"విశ్వావస్వాషాఢే శుక్ల ద్వితీయాదినే సమారబ్ధః
పింగళ ఫాల్గునశుక్లే సంపూర్ణః మత్ప్రబంధోఽభూత్॥"

—(ఉల్లా: 5 శ్లో. 114)

విశ్వావసు సంవత్సరము-ఆషాఢమాసము-శుక్లపక్షము - ద్వితీయాతిథి అనగా ది. 1-7-1965 న ఈ కావ్యరచన ప్రారంభమైనది. పింగళ సంవత్సరము-ఫాల్గున మాసము-శుక్ల పక్షమున గ్రంథము పూర్తి చేయబడినదని ఆచార్యులవారు పేర్కొనిరి. కాని గ్రంథము ముగింపబడిన తిథిని పేర్కొనకపోవుటచే శుక్ల పక్షాంత దినమునే నేను గ్రంథము ముగింపబడిన దినముగ స్వీకరించితిని. అట్లయిన శుక్లపక్షాంత దినమగు ది. 24-3-1978 న గ్రంథరచన పరిసమాప్తి నొందియుండును.

ఈ కావ్యము సిద్ధార్థి సంవత్సరము - మాఘ మాసమున (జనవరి-1980) ప్రథమ ముద్రణతో సహృదయ ప్రపంచమున సాక్షాత్కరించినది. ఇది అయిదు ఉల్లాసములతో కూడిన కావ్యము.

ప్రథమోల్లాసమున 49 పద్యములు, 7 గద్యములు; ద్వితీయోల్లాసమున 57 పద్యములు, 27 గద్యములు; తృతీయోల్లాసమున 44 పద్యములు, 16 గద్యములు; చతుర్థోల్లాసమున 42 పద్యములు, 24 గద్యములు; పంచమోల్లాసమున 63 పద్యములు, 51 గద్యములున్నవి. కావ్యములోని మొత్తము పద్యముల సంఖ్య: 255, గద్యముల సంఖ్య: 125. ఇవిగాక కావ్యారంభమునకుముందు చెప్పిన పద్యములు రెండున్నవి. వానిలో ఒకటి పుష్పమాలికాబంధము, వేరొకటి చక్రబంధము.

"మంగళాదీని మంగళమధ్యాని మంగళాంతాని శాస్త్రాణి ప్రథన్తే"[1] ఇత్యాది భాష్యకారుల వచనములననుసరించియు, "ఆశీర్నమస్క్రియా వస్తునిర్దేశోవాపి తన్ముఖమ్",[2] అను ప్రాచీనాలంకారికోక్తిననుసరించియు ఆచార్యులవారీ కావ్యారంభమున గోదాస్తుతి పూర్వకమగు నమస్క్రియను; కావ్యముయొక్క ఆదిమధ్యాంతముల యందు ఎడనెడ గోదాస్తుతులను, విష్ణుస్తుతులను నిబంధించిరి. ప్రతి ఉల్లాసమునకు చివర ఆ యుల్లాసము ముగిసినట్లు సూచించు కవికావ్యనామధేయ పురస్సరములగు "పుష్పిక" లిట్లున్నవి-

"ఇతి వేదాన్త విదుషః అమరవాది వేంకటనరసింహాచార్యస్య కృతిషు ఆముక్తమాల్యద చంపూప్రబంధే ప్రథమ/ద్వితీయ/తృతీయ/చతుర్థ/పంచమోల్లాసః"

కావ్యారంభమున కవి రెండు శ్లోకములలో గోదాస్తుతిని, రెండు శ్లోకములలో తన వినయశీలమును ప్రకటించి ప్రాచీన కవులను భక్తితో స్మరించెను. కావ్యాంతములో నొక శ్లోకమున ఆచార్యులవారు తన కావ్యమును ఉత్తమమగు వేదోక్తమార్గము నవలంబించువారును, సుకవులును ఆస్వాదింతురు గాక" యని కోరిరి.

కావ్యములలోని వివిధభాగములకు ఉచ్ఛ్వాస, ఉల్లాస, స్తబక, ఆశ్వాస, కాండ, తరంగ, సర్గ, విలాసాది నామములను నిర్దేశించుట ప్రాచీనకవిసంప్రదాయము. ఆచార్యులవారీ సంప్రదాయము ననుసరించి తమ ఈ కావ్యమునందలి భాగములకు "ఉల్లాస"ములని పేరిడిరి.

కావ్యమారంభించుటకు ముందుగల రెండు బంధశ్లోకములలో మొదటి పుష్పమాలికాబంధములోని "చంపకమాల" గోదాదేవ్యంకితము. రెండవ చక్రబంధములోని "శార్దూలవిక్రీడితము" కవి గ్రంథనామసూచకము

ఇది కావ్యముయొక్క బాహ్యస్వరూపము. అంతస్స్వరూపమగు కావ్యకథా విధానమిట్టిది-

1. పతంజలి మహర్షి-మహాభాష్యమ్ (అధ్యా. 1 పాద. 1 సూ. 1 పుట 165)
2. దండి-కావ్యాదర్శః; పరిచ్ఛేదః-1 శ్లో. 14

ప్రథమోల్లాసము:- పూర్వము దక్షిణదేశమునందలి పాండ్య రాజ్యమున "చాపనగిరి" (శ్రీవిల్లిబుత్తూరు) అను పట్టణముండెను. ఆ పట్టణమున 'సాలావ్రుత'[1] గోత్రుడును, గరుడాంశసంభూతుడును, భూసురుడును అగు "విష్ణుచిత్తు" డను హరిభక్తుడు కలడు. అతడు 'నిరంతర సమారాధిత ముకుందపదారవిందుడు'. అత డొకనాడు విష్ణువునకు మాలాకైంకర్యముచేయు నిమిత్తమై పూలుకోసి తెచ్చుటకు పూదోటకేగెను. అచట అతడు విష్ణుధ్యానతత్పరుడై సంచరించుచుండగ, తులసీవన సమీపమున మెరుపుతీగనుబోలిన పసిపాప అగుపించెను. ఆ పసిపాపను చూచి, అమి తాశ్చర్యానందములలో అతడు మనమున విష్ణువును భక్తితో ధ్యానించెను. తత్ క్షణమే అతని ఎదుట విష్ణువు దృగ్గోచరుడయ్యెను. ప్రమోదాంతరంగుడైన విష్ణుచిత్తు నితో విష్ణువిట్లనెను- "ఓ పరమైకాంతీ! ఈ బాలికయొక్క అద్వితీయమగు అవతార రహస్యమును చెప్పుచున్నాను వినుము- నేను పూర్వము వరాహావతారమున హిరణ్యా క్షుని శిక్షించి, భూభారమును తొలగించితిని. అప్పుడు భూదేవి తన్ను కృతార్థురాలను చేయుమని నన్ను వేడినది. ఆ ప్రార్థననుసరించి ఈ జన్మయందే ఆమెను పరిపూర్ణ మనోరథను చేయదలచినవాడనై; సీతావతారముచే జనకుని కృతార్థునిగ నొనరించి నట్లు; ఈ గోదాదేవ్యవతారముచే నిన్ను కృతార్థునిచేయదలచి, నీకీబాలికను పుత్రికగా ప్రసాదించితిని" అని పలికి అంతర్ధానమయ్యెను. అపుడు ఇతికర్తవ్యతామూఢుడైన విష్ణుచిత్తుడు ఆనందాతిశయములో- "గోదా! గోదా!!" అని ఆ పసిపాపను పిలుచుచు స్పృశించుచు, తన ఇంటికి గొనిపోయెను. అచట ఆమెను గారాబముతో పెంచుచు కాలము గడిపెను. కొంతకాలమునకాబాలిక బాల్యదశను అతిక్రమించి, యౌవనమున అడుగిడెను. అప్పుడామె అలౌకిక సౌందర్యముతో నలరారెను. ఆమె అనురూపుడైన భర్తను ఎట్లు పొందునోయని విష్ణుచిత్తుడు చింతింపసాగెను.

ద్వితీయోల్లాసము:- ఒకనాడు విష్ణుచిత్తుడు గోదాదేవిని సమీపించి- 'అమ్మా! నా మనోవేదనను వినుము. నీవు బాల్యమును వీడి యౌవనమున అడుగిడితివి. యుక్త వయస్సునందే వివాహము చేయుట లోకధర్మము కదా. అట్లు చేయకున్న లోకము నన్ను నిందించును. కావున నీకిప్పుడు వివాహముచేయుట నా యభీష్టము" అనెను.

---

1. "ప్రపన్నామృతము"న సాలావ్రుత గోత్రమని కలదు-
"యశ్శాలావ్రుత గోత్రాబ్ధిచంద్రమా వైష్ణవోత్తమః"
—(అధ్యా. 17, శ్లో-12)

అపుడు గోదాదేవి జనకుని మనోగతమగు చింతను గ్రహించినదై-"తండ్రీ! నేను భగవంతుడైన ఆ శ్రీహరిని వీడియుండు ధానను కాను. కనుక ఆ రమాకాంతుని తప్ప అన్యుని వివాహమాడ నెంచను. ఆ శ్రీహరియే నా పతి" అనెను. విష్ణుచిత్తుడామె పలుకులు విని- "అమ్మా! ఏమి నీ యనంతవమగు మనోరథము? భగవంతుడైన ఆ హరిని పరిణయమాడుట కలలోనైన జరుగుపనియా?" అనెను. అప్పుడు గోదాదేవి తండ్రి మాటలకు ప్రత్యుత్తరమిచ్చుచు-"తండ్రీ! మీరు పూర్వవృత్తాంతముల నెరుగరా? నీళ, రుక్మిణి, సీత మొదలగు సాధ్వులు ఆ విష్ణువును వివాహమాడలేదా? నా ఈ కోరిక అసంగతమైనచో, అవి యన్నియు నసంగతములు కాకుండునా? కావున నేనా శ్రీరంగ నాథుని తప్ప ఇతరులను పరిణయమాడను-ఇదియే నా నిశ్చయమగు మనోరథము" అని పలికి, విష్ణుధ్యాన తత్పరయై యుండెను. విష్ణుచిత్తుడేమియు మాటాడకయుండెను.

ఇంతలో ప్రకృతియందు వసంతర్తువు ప్రవేశించెను. గోదాదేవికి శ్రీరంగ నాథునిపై విరహమతిశయించెను. ఆ ఋతువులోని రాత్రివేళలు విరహకాతరయై యున్న గోదాదేవికి సహింపరానివయ్యెను. ఆమె తన విరహమునుద్దీపింపజేయుచున్న చంద్రుని, మన్మథుని, మలయానిలయమును దూషించెను. తరువాత నిద్రావస్థయందామె శ్రీరంగనాథుని పరిణయమాడినట్లు స్వప్నమును గాంచెను. నిద్రనుండి మేల్కాంచిన పిదప తన స్వప్నపరిణయ వృత్తాంతమును చెలులకు చెప్పెను. రమాకాంతుని పాణి గ్రహణము చేయుటయో లేక మరణించుటయో ఈ రెండే శరణ్యములని నిర్ద్వంద్వ ముగ వారితో చెప్పెను. ఇట్లు చెలికత్తెలతో పలుకుచున్న గోదాదేవి పలుకులను విని విష్ణుచిత్తుడు అమితముగ సంతోషించినవాడై "ముకుందుడు నీయెడ ప్రసన్నుడగుగాక" యని గోదాదేవిని దీవించి వెడలిపోయెను.

తృతీయోల్లాసము:- ఒకనాడు విష్ణుచిత్తుడు క్రొత్తదైన పూమాలను శ్రీరంగ నాథునకు సమర్పింపుమని గోదాదేవితో చెప్పెను. తండ్రి ఆజ్ఞను పాటించి గోదాదేవి నూతనమగు పుష్పమాలికను అల్లెను. దానిని శ్రీరంగనాథునకు సమర్పించుటకు ముందు తాను ధరించెను. తన సౌందర్యమును అద్దమున చూచుకొనుచు ఆనందించు చుండెను. ఇంతలో ఆకస్మికముగ అచటికి వచ్చిన విష్ణుచిత్తుడా దృశ్యమును చూచి చిత్తనిరుద్ధశోకుడై-"గోదా! చాలు-చాలు. ఇది ఏమి వైపరీత్యము? శ్రీరంగనాథునకు సమర్పింపవలసిన మాలికను నీవు ధరించితివా? ఎంత అపచారము చేసితివి! అనాఘ్రాత సుమమాలయే కదా భగవదర్పణమునకు యుక్తమైనది! నీవిట్లేల ఆచరించుచున్నావు?"

అని పలువిధములుగ మందలించెను. తండ్రిమాటలకు చలింపక గోదాదేవి ఇట్లు పలికెను-"తండ్రీ! మీరిట్లు వారించుట తగదు. అనన్యలభ్యుడైన ఆ శ్రీహరిని పొంద గోరియే నేనిట్లలంకరించుకొంటిని. ఆ రంగనాథుని యందు తాదాత్మ్యభావము లేనిచో, బ్రహ్మాత్మభావమెట్లు సిద్ధించును? అనెను. ఇట్లు కుమార్తె పలికిన మాటలువిని కరార్పిత సుమమాలను శ్రీరంగనాథునకర్పింపనొల్లకుండెను. అంత శ్రీరంగనాథుడు అర్చక ముఖమున విష్ణుచిత్తునితో "విప్రోత్తమా! గోదధరించి విడిచిన మాలికయే నాకు ప్రీతి పాత్రము. కావున నీ వా మాలికలోడనే నాకు కైంకర్యమొనర్పుము" అని చెప్పెను. అపుడు విష్ణుచిత్తుడు భగవదనుశాసనమునకు బద్ధుడై ప్రతినిత్యము గోదాదేవి ధరించి విడిచిన మాలికలను శ్రీరంగనాథునకు సమర్పించుచు- "ఆమె మానవజన్మనెత్తిన అమానవశక్తి యనియు, అట్లుకాకున్న భగవంతుడట్లు పలుకడనియు, ఆమె మనోరథము ఫలవంతమగుననియు" తలచుచుండెను. వివాహానంతరము అట్టి అద్వితీయయగు పుత్రికను విడిచి ఉండుట ఎట్లని చింతించుచుండెను. గోదాదేవియును నిరంతరము శ్రీరంగనాథుని ధ్యానించుచు, అనన్యమనస్కయై విరహావస్థననుభవించుచుండెను.

**చతుర్థోల్లాసము:-** గోదాదేవి శ్రీరంగనాథుని విరహమును సహింపలేనిదై చెలికత్తెలతో ఉద్యానవనమున కరిగెను. అచట ఆమె చెలులతో-"సఖులారా! నా యీ దురవస్థను చూడుడు. శ్రీరంగనాథుని విరహమును ఉపశమించుకొనుటకై ఈ పూదోటకు వచ్చితిని. కాని, ఇచటనైతము నాకు విశ్రాంతి లభింపకున్నది." అనుచు తన విరహావస్థను వివరముగ చెలికత్తెలతో చెప్పెను. శ్రీరంగనాథుడెచ్చట కలడో చెప్పుమని వారిని ప్రశ్నించెను. శ్రీరంగనాథుని రూపలావణ్యములను, గుణగణము లను వర్ణించెను. చెలికత్తెలామె విరహమునుపశమింపజేయుటకై వివిధ క్రీడలచే ఆనందపరచిరి. గోదాదేవి చెలులతో క్రీడించుచు, వారి కనుమరుగై కొంతదూరము పరచి పోయెను. ఆ సమయమున లీలావినోదియగు శ్రీరంగనాథుడు గోదాదేవి ఎదుట నిలిచి, ఆమె క్రీడార్థమై కన్నులకు కట్టుకొన్న గంతలను తొలగించి స్వీయాలింగన ముచే ఆమెనాదరించెను. గోదాశ్రీరంగనాథులు ఒండొరులు తమ విరహమును దెలుపుకొని, సంభాషించిరి. పిమ్మట శ్రీరంగనాథుడు అదృశ్యమైపోయెను. ఇంతలో చెలికత్తెలు గోదాదేవిని వెదకుచు అచటికి వచ్చిరి. ఆనందబాష్పములు రాల్చుచు నిలిచియున్న గోదను చూచిరి. గోదాదేవి తనకు కలిగిన దివ్యానుభూతిని వారికి వర్ణించి చెప్పెను. అటుపిమ్మట గోదాదేవి విరహమతిశయించెను.

**పంచమోల్లాసము:—** సూర్యోదయమయ్యెను. ఒకవైపు వేదాధ్యయనముల ఘోష వినబడుచుండెను. మరొకవైపున ద్రవిడామ్నాయముల గానములు కర్ణపేయములగుచుండెను. ఆ సమయమున విష్ణుచిత్తుడు శ్రీరంగనాథుని ప్రాతఃకాలసేవకై బయలుదేరెను, గోదాదేవి శ్రీరంగనాథుని ధ్యానించుచు, విరహదుఃఖితయై యుండెను. తన చెలికత్తెలను పిలిచి, వారిలోనొకతెతో—"సఖీ! నా యవస్థను నీ వెరుగుదువు. శ్రీరంగనాథుని విడిచి క్షణమైనను నిలువలేకున్నాను. త్రిజగత్పతియగు నాతనికి నాపై కరుణ కలుగుటలేదు. నీవు ఇపుడే బయలుదేరి వెడలి, నా యీ సందేశమును స్వామికెరుకపరుపుము. అతని పాదపద్మములకడ శరణాగతురాలనై యుంటినని చెప్పుము" అనెను. చెలికత్తె గోదాదేవి సందేశమునుగైకొని శ్రీరంగనాథుని కడకు పోయెను. ఆ సందేశమును శ్రీరంగనాథునకు విన్నవించెను. శ్రీరంగనాథుడా సందేశమును విని సంతసించినవాడై "అచిరకాలముననే నా దూతలను పంపెదను. పరితపింపవలదు. సర్వము శుభమగు"నని చెలికత్తెతో గోదాదేవికి ప్రతిసందేశమంపెను. గోదాదేవి స్వామి ప్రతిసందేశమువిని ఆనందపరవశయయ్యెను. పిదప శ్రీరంగనాథుడు శఠమథవిష్వక్సేనాదిపారిషదులను తన యొద్దకు రప్పించి, వారిద్వారా తన సందేశమును విష్ణుచిత్తునకు పంపెను. పరమభాగవతోత్తములైన ఆ శఠమథాదులు విష్ణుచిత్తుని కడకేగి, అతని ఆతిథ్యమర్యాదలనుపొంది, అతనితో ఇట్లనిరి—"విష్ణుచిత్తా! నీ భాగ్యవశమున నీ సుతయగు గోదాదేవిని జగన్నాథుడగు ఆ శ్రీరంగనాథుడు పరిణయమాడ గోరుచున్నాడు. కావున గోదా శ్రీరంగనాథుల వివాహమొనర్చి ధన్యుడవుకమ్ము! నీవు కేవలము భక్తుడవైన విష్ణుచిత్తుడవేకావు—మహావిష్ణువునకు వాహనమగు గరుడుని అంశచే జన్మించిన మహాత్ముడవు. నీ సుతయగు గోదాదేవి పూర్వజన్మలందు సీతగను, సీతగను జన్మించి, ఈ జన్మమున గోదాదేవియై నిన్ను కృతార్థునిజేసి, శ్రీరంగనాథుని పరిణయమాడనున్న"దనిరి. విష్ణుచిత్తుడామాటలకు ప్రముదితాంతరంగుడై, గోదాదేవిని అభినందించెను. శ్రీరంగనాథుడంపిన దివ్యాలంకార, దివ్యవస్త్రాభరణాదులచే గోదాదేవినలంకరించిరి. పారిషదులు వెంటరాగా; గోదాదేవిని పల్లకిలో ఊరేగించి, కల్యాణ మంటపమున ప్రవేశింపజేసిరి. వివాహవేదికపై గోదాదేవి కూర్చొనియుండెను. శ్రీరంగనాథుడు దివ్యవస్త్రాభరణాద్యలంకృతుడై వివాహవేదిక నధిరోహించెను. గోదా శ్రీరంగనాథులకు అతివైభవముగ వివాహము జరిగెను. వివాహానంతరము శ్రీరంగనాథుడు విష్ణుచిత్తునకిట్లనెను—"విష్ణుచిత్తా! నీవు యథాపూర్వముగ నాకు నిరంతరి మాలాకైంకర్యమొనర్చుచు ధన్విపురమున నుండుము" అనెను. విష్ణుచిత్తుడా భగవదాజ్ఞకుబద్ధుడై ధన్విపురమున(చాపనగిరి) శ్రీరంగనాథునకు మాలాకైంకర్యమొనర్చుచు కాలము గడిపెను.

ఇది కావ్యాంతర్గతమగు కథావిధానము. దీనిని స్వీయప్రతిభచే ఆచార్యులవారు చక్కని కావ్యముగ తీర్చిదిద్దిరి.

ఈ కావ్యములోని విశిష్టగుణములకు నీరాజనము పట్టిన పలువురు విద్వాంసుల అభిప్రాయములివి-

"ఈ కావ్యము ప్రజ్ఞా, భావనా, శైలీ, స్వసంప్రదాయసారభాషా, సూక్తి, యుక్తి, శబ్దార్థసౌందర్య, వాగ్వైఖరులచే జనుల హృదయముల నాకట్టుకొను"నని ప్రసిద్ధ విద్వత్కవులు శ్రీ భాష్యం విజయసారథిగారిట్లనిరి-

"శ్రీమతాం విపశ్చిదపశ్చిమానాం అమరవాది వేంకటనరసింహాచార్యమహోదయానాం కృతిష్వన్యతమం ఇదం "ఆముక్తమాల్యదమ్" నామ చంపూకావ్యం భగవత్యాః జగజ్జనన్యాః శ్రీ గోదాదేవ్యాః పవిత్రప్రణయ పరిమలలహరీ పరీవాహ భాసురం, ప్రజ్ఞా పటిమ్నా, భావనామహిమ్నా, శైలీచరిమ్ణా, స్వసంప్రదాయసార పరిబ్రఢిమ్నా, భాషామధురిమ్ణా, సూక్తిస్వాదిమ్నా, యుక్తిసమ్మతిమ్నా, భావభూమ్నా, శబ్దార్థ సౌందర్యగరిమ్ణా, వాగ్వైఖరీప్రథిమ్నా విశ్వజనీన వ్యాఖ్యాన సంవాదస్య చ మహిమ్నా మహామోహాంధకార సంకులే వివిధ విక్షేప పరిక్లిష్టే వినష్టప్రాయే జనతాహృదయే ప్రబోధమయం ప్రకాశం ఆవిష్కరోతీతి దృఢా మే మనీషా."

—(ఆముక్తమాల్యదమ్-'ప్రరోచనా' పుట II)

ఈ కావ్యము "ప్రపన్నజనభోగ్యమనియు, వివిధ రసభావాలంకారాదులచే మనస్సునాకట్టుకొనునట్టి"దనియు సుప్రసిద్ధ విద్వాంసులు శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల రఘునాథాచార్యులవారిట్లు నుడివిరి-

"ఆముక్తమాల్యదాఖ్యం చంపూకావ్యం ప్రపన్నజనభోగ్యమ్।
రసభావాలంకారైర్వివిధైః ప్రసభం ధినోతి న శ్చేతః॥"

—(ఆముక్తమాల్యదమ్-"శుభాశంసనమ్" పుట 1)

ప్రముఖ విమర్శకులు డా॥ కోవెల సంపత్కుమారాచార్యులుగారు- "ఆధునిక కాలంలో సంస్కృతంలో కావ్యాలు రచించడమే తగ్గింది. ఆ రచింపబడిన కొద్ది కథా కావ్యాల్లో ఈ 'ఆముక్తమాల్యద' గణనీయమైన కావ్యం"[1] అని అభిప్రాయపడిరి.

ప్రముఖ సాహిత్యవేత్త డా॥ కోవెల సుప్రసన్నాచార్యులుగారు-"ఈ కావ్యము అరుదైన శైలిలో వ్రాయబడినదనియు, ఇందలి ప్రాకృతిక వర్ణనలు భారతీయసాహిత్యౌన్నత్యమును, కవితాప్రతిభను చాటుచున్నవని ఇట్లనిరి-

"This poem is written in a rare style with fertile Imagination, full of descriptions of nature in all seasons and it has tew parallels in Indian Literature for its poetic Originality"

—( ఆముక్తమాల్యదమ్ - Preface, పుట: V )

ఇట్టి కావ్యమును దిఙ్మాత్రముగ పరిచయముచేసి, ఈ ప్రకరణమును ముగించుచున్నాను.



1. కోవెల సంపత్కుమారాచార్య-'మనపండితులు-కవులు-రచయితలు': పుట 202

# ఇతివృత్త ప్రకరణము

## ఇ తి వృ త్త ము

ఈ కావ్యమున ఇతివృత్తమగు గోదాదేవి వృత్తాంతము శ్రీవైష్ణవ సంప్రదాయమున సుప్రసిద్ధమైనది. కనుక ఇది ఇతివృత్త భేదములలో 'ప్రఖ్యాత' మను కోవకు చెందినది. గురుపరంపరాప్రభావము, దివ్యసూరిచరిత్ర, ప్రపన్నామృతములలో ప్రసిద్ధాచార్యుల దివ్యచరిత్రము వర్ణింపబడినది. శ్రీవిష్ణుచిత్తులును, గోదాదేవియును ఆ పరంపరలోనివారు.

తెలుగులో సుప్రసిద్ధమగు శ్రీకృష్ణదేవరాయలవారి 'ఆముక్తమాల్యద' ప్రబంధము కలదు. రాయలు శ్రీ గోదా విష్ణుచిత్తుల వృత్తాంతములేగాక, యామునాచార్య చరితము, ఖాండిక్యకేశిధ్వజోపాఖ్యానము మున్నగు శ్రీ వైష్ణవతత్త్వప్రతిపాదకములగు ఇతరోపాఖ్యానములనుకూడ చేర్చి తన ప్రబంధమును కూర్చెను.

ప్రకృతమగు శ్రీమాన్ అమరవాది వేంకటనరసింహాచార్యులవారి రచన శ్రీ గోదాదేవి వృత్తాంతము వరకే పరిమితమైనది. శ్రీ విష్ణుచిత్తులు పాండ్యరాజసభలో విష్ణుపారమ్యమును స్థాపించుట మున్నగునవి ఇందులేవు. అనగా గోదాకల్యాణమే ప్రధానమగు ఇతివృత్తము.

సుప్రసిద్ధములగు పై పూర్వగ్రంథములలోని ఇతివృత్తమును, ఆచార్యులవారి రచనలోని ఇతివృత్తసన్నివేశములను తులనాత్మకముగ పరిశీలించి, ఆచార్యులవారు చేసిన మార్పులను, చేర్పులను, వాని సామంజస్యమును గూర్చి యీ వ్యాసభాగములో చర్చింపబడుచున్నది.

ఒకనాడు తులసీవనమున తిరుగుచుండగా విష్ణుచిత్తునకు పసిపాప (గోదాదేవి) లభించినట్లు ఆచార్యులవారు పేర్కొనిరి.[1] గురుపరంపరాప్రభావము[2] ప్రపన్నామృతము[3] దివ్యసూరిచరిత్ర[4] లలో తులసీవృక్షమూలమును త్రవ్వుచుండగా భూమినుండి పసిపాప లభించినట్లు చెప్పబడినది. రాయలవారి కథనము మాత్రమే ఆచార్యులవారి కథనములో సంవదించినది.[5]

పసిపాప లభించిన వెంటనే విష్ణుచిత్తుడు ఆనందములో విష్ణువును స్తుతింపగా విష్ణువు ప్రత్యక్షమై "ఓ పరమైకాంతీ! నన్ను పొందబోవు ఈ బాలికను నీవు కుమార్తెగా పెంచుకొనుము. వరాహావతారకాలమున నన్ను పిలచిన భూదేవి కోరికను తీర్చుటకు నీకు కుమార్తెగా ఈ గోదావతారమగు బాలికనిచ్చుచున్నాను" అని ఆదేశించెను.[6] విష్ణువిట్లు గోదాదేవి జన్మరహస్యమును తెలిపి, విష్ణుచిత్తునాదేశించుట ఆచార్యులవారి కల్పనమే. ఇతరులెవరును పేర్కొనలేదు. గోదాదేవిని భూదేవ్యవతారముగా ఆచార్యులవారు పేర్కొనిరి.[7] రాయలుకూడ ఇట్లె చెప్పెను.[8] కాని, గురుపరంపరాప్రభావము[9] నందును, ప్రపన్నామృతము[10]నందును ఆమె లక్ష్మీదేవ్యంశావతారముగ చెప్పబడినది.

విష్ణుచిత్తుడు స్వయముగా బాలికను పెంచినట్లు ఆచార్యులవారు పేర్కొనిరి.[11] అంతేగాక అతడు 'అపత్నీకుడు'[12] 'అసూర్యపత్నీకుడు'[13] అని స్పష్టముగా పేర్కొనిరి.

---

1. అముక్త. ఉల్లా: 1 పద: 19
2. ఆ.సౌ పుట 432
3. ప్రపన్నా అధ్యా: 19 శ్లో. 10
4. ఆ.సౌ. పుట. 431
5. రాయల ఆముక్త. ఆశ్వా: 5 పద్య: 4
6. అముక్త. ఉల్లా: 1 పద: 26
7. — Ibid—
8. రాయల ఆముక్త. ఆశ్వా 5 పద్య: 37
9. ఆ.సౌ. పుట. 432
10. ప్రపన్నా. అధ్యా: 19 శ్లో: 12
11. అముక్త. ఉల్లా: 1 పద: 26
12. — Ibid— శ్లో. 21
13. — Ibid— పద: 26

ప్రపన్నామృతమున భార్యప్రస్తావనయే లేదు.[1] విష్ణుచిత్తునకు భార్య ఉన్నదా లేదా అను విషయము అందు స్పష్టపడదు. కాని అంతకంటె ప్రాచీనములగు గురుపరంపరాప్రభావము[2] దివ్యసూరిచరిత్ర[3] లలో బాలికను విష్ణుచిత్తుడు తన భార్యకిచ్చినట్లు చెప్పబడినది. రాయలుకూడ 'ధర్మగేహిని'కి బాలికనిచ్చినట్లు వర్ణించెను.[4]

గోదాదేవి బాల్యవర్ణనము ఆచార్యులవారి కల్పనమే.[5] పూర్వోక్తములగు ఇతర రచనలలో లేదు.

గోదాదేవికి యుక్తవయస్సురాగా విష్ణుచిత్తుడామెకు వివాహము చేయుదునని పలుకును. తాను విష్ణువును తప్ప అన్యుని వివాహమాడనని గోదాదేవి స్పష్టపరుపగా, అది అసంభవమగు కోరికయని విష్ణుచిత్తుడు కుమార్తెను మందలించును. ఇది ఆచార్యులవారి కల్పనమే.[6] గురుపరంపరాప్రభావమునందుగాని, రాయల ఆముక్తమాల్యదలో గాని ఈ ప్రసక్తి లేదు. ప్రపన్నామృతమున విష్ణుచిత్తుడు కుమార్తెసంకల్పమునకు సంతసించి, 108 దివ్యతిరుపతుల వృత్తాంతమును తెలిపెను. విష్ణుచిత్తుడు స్తుతింపగా 108 దివ్యతిరుపతులలోని అర్చావతారములగు విష్ణుని రూపములు గోదను వివాహమాడవచ్చెనని రాగా, గోద స్వయంవరమున శ్రీరంగేశుని వరించెను.[7] దివ్యసూరి చరిత్రమున కుమార్తెకోరికపై విష్ణుచిత్తుడు 108 దివ్యతిరుపతుల మహిమను దెలుపగా, గోదాదేవి మనస్సు శ్రీరంగనాథునిపై లగ్నమయ్యెను. ఆ స్వామిని పొందుట ఎట్లని తండ్రిని కోరగా, విష్ణుచిత్తుడామెకు ధనుర్మాసవ్రతము నాచరింపుమని చెప్పెను. ఆమె అట్లే చేసెను.[8]

1. ప్రపన్న. అధ్యా: 19 శ్లో: 15, 16
2. ఆ పుట: 432
3. - Ibid— పుట: 431
4 రాయల ఆముక్త. ఆశ్వా: 5 పద్య: 6
5. ఆముక్త. ఉల్లా: 1 శ్లో. 29 నుండి 33 వరకు
6. Ibid ఉల్లా· 2 వచ: 11
7. ప్రపన్న. అధ్యా: 19 శ్లో: 63 నుండి 88 వరకు
8. ఆ.సో. పుట: 431

పుష్పమాలికను శ్రీరంగనాథున కర్పింపుమని తండ్రిచెప్ప[illegible] గోదాదేవి [illegible] మాలికను ధరించి, అద్దమున తన అందమును చూచుకొనుచుండగా విష్ణుచి[illegible] ఆమెను మందలించెను. గోదాదేవి ప్రత్యుత్తరమీయగా, గోదాకదార్పితసుమమాలను స్వామి కర్పింపనొల్లక చింతించుచుండిన విష్ణుచిత్తునకు స్వామి అర్చకముఖమున గోదాదేవి ధరించి విడిచిన మాలయే తనకు ప్రీతిపాత్రమని చెప్పినట్లు ఆచార్యులవారు వర్ణించిరి.[1] స్వామి విష్ణుచిత్తునకు స్వప్నమున కన్పించి గోద ధరించి విడిచిన మాలలే తనకు ప్రియములని పలికినట్లు గురుపరంపరాప్రభావమునందును,[2] ప్రపన్నామృతము నందును[3] చెప్పబడినది. గోదాదేవి పుష్పమాలికను స్వామికి అర్పింపుటకు ముందే ధరించుట విష్ణుచిత్తునకు తెలిసినట్లుగా దివ్యసూరిచరిత్రలోగాని, రాయల ఆముక్త మాల్యదలోగాని ప్రస్తావింపబడలేదు.

గోదాదేవి చెలులతో ఉద్యానవనమున క్రీడించుచు కనులకు గంతలుకట్టుకొని కొంతదూరముపోగా - ఏకాంతమున శ్రీరంగనాథుడు ప్రత్యక్షమై ఆమె కనులకు గట్టుకొన్న గంతలను తొలగించి, కౌగిటచేర్చి ఆనందింపజేసెనని ఆచార్యులవారు వర్ణించిరి.[4] గోదాదేవిని శ్రీరంగనాథుడు స్వప్నమున కౌగిట ఆదరించినట్లు దివ్యసూరి చరిత్రలో వర్ణింపబడినది.[5] తక్కిన గ్రంథములలో ఈ ప్రసక్తి లేదు.

గోదాదేవికి విరహమతిశయింపగా, చెలులద్వారా శ్రీరంగనాథునకు సందేశ మంపుటయు, స్వామి యామెకు ప్రతిసందేశమంపుటయు, పిమ్మట శ్రీరంగనాథుని దూతలుగా శతముఖచతుర్ముఖాదులు విష్ణుచిత్తునియొద్దకు వచ్చి శ్రీరంగనాథునితో గోదాదేవికి వివాహమొనరించుటకై యామెను శ్రీరంగమునకు తోడ్కొని రమ్మని స్వామి యాదేశమును తెలిపిరి. విష్ణుచిత్తుడట్లే గోదాదేవిని శ్రీరంగమునకు గొనిపోయి వివాహమొనర్చెనని ఆచార్యులవారు వర్ణించిరి.[6] శ్రీరంగనాథుని పొందుటకై ధనుర్మాస వ్రతమును చేయుచున్న కుమార్తె దీనావస్థనుచూచి విష్ణుచిత్తుడు స్వామికి తెలుపగా, అప్పుడాయన గోదాదేవిని శ్రీరంగమునకు గొంపోయి శ్రీరంగనాథునకిచ్చి కల్యాణము

---

1. ఆముక్త. ఉల్లా 3 పద 22
2. ఆ.సౌ. పుట 432
3. ప్రపన్న. అధ్యా. 19 శ్లో. 34, 35
4. ఆముక్త. ఉల్లా. 4 పద. 28
5. ఆ.సౌ. పుట. 431
6. ఆముక్త. ఉల్లా. 5 పుట: 55 నుండి 70 వరకు

చేయుమని చెప్పినట్లును, విష్ణుచిత్తుడట్లే చేసినట్లును గురుపరంపరాప్రభావములో కలదు.[1] స్వయంవరానంతరము స్వామిపై విరహముతో గోదాదేవి చింతించుచుండగా ఆమెను చూచి తండ్రియగు విష్ణుచిత్తుడు మిక్కిలి దుఃఖించి, శ్రీరంగనాథునితో తన కుమార్తెకు వివాహమొనర్చుట ఎట్లుసాధ్యమని మిక్కిలి కలతపడెను. శ్రీరంగనాథుడు స్వప్నమున కన్పించి, గోదాదేవిని శ్రీరంగమునకు తోడ్కొని రమ్మనియు, అచట నామెను వివాహమాడుదుననియు తెలుపును. గోద భగవత్ప్రీతికై ధనుర్మాసవ్రతము నాచరింపగా వ్రతసమాప్తి దినమున గోదాదేవి స్వప్నమున శ్రీరంగనాథుడు కన్పించి త్వరలోనిన్ను వివాహమాడుదునని తెలిపెను. శ్రీరంగనాథుడు గోదను తెమ్మని తన పరివారము నాజ్ఞాపింపగా వారు శ్రీవిల్లిబుత్తూరునకు వచ్చిరి. విష్ణుచిత్తుడు శ్రీవిల్లిబుత్తూరులోనున్న వటపత్రశాయి అనుజ్ఞనుపొంది,తన శిష్యుడగు మధురాపురప్రభువునకీ వృత్తాంతము నెరిగించి,గోదాదేవిని శ్రీరంగమునకు గొనిపోయెను.అచట శ్రీరంగనాథుడామెను శుభలగ్నమున వివాహమాడెను. ఆమె శ్రీరంగనాథునిచేరి, ఆ శేషశాయికి నమస్కరించి, అందరు చూచుచుండగ అదృశ్యమైనట్లు ప్రపన్నామృతమున వర్ణింపబడినది.[2] దివ్యసూరి చరిత్రలో గోదా విరహబాధను గ్రహించిన చెలికత్తె శ్రీరంగమునకుపోయి స్వామికి నివేదింపగా శ్రీరంగనాథుడు తన విరహమును తెలిపి, గోదాదేవిని కురుకూరునకు తోడ్కొని రమ్మని విష్ణుచిత్తునకా చెలితోడనే సందేశమంపును. విష్ణుచిత్తుడట్లే చేయగా కురుకూరున గోదా శ్రీరంగనాథుల వివాహము జరిగెను.[3]

రాయల తీర్పులో ఈ వృత్తాంతము మరింత కావ్యత్వమును, లోకజ్ఞతను సంతరించుకొన్నది-గోదాదేవి ధనుర్మాసవ్రతమాచరించి, పాటలు పాడుచుండగా ఆమె యవస్థనుచూచి, 'అబుద్ధేతుదనుఃప్రతు'డగు విష్ణుచిత్తుడు అదియేదో వ్యాధియని తలచి స్వామికి విన్నవించెను. స్వామి గోదను శ్రీరంగమునకు గొనిపొమ్మని ఆదేశించెను. శ్రీరంగమున విరహమోపని శ్రీరంగనాథుడు గోదను తనలో లీనముగావించుకొనగా, విష్ణుచిత్తుడు స్వామిని నిష్ఠురములాడెను. శ్రీరంగనాథుడు గోదాదేవిని విష్ణుచిత్తుని ఇల్లు చేర్చి, బ్రహ్మరుద్రులను, వాణీగౌరులను విష్ణుచిత్తునికడకుబంపి, తనకు గోదాదేవి నిమ్మ అడిగించెను. స్వామి శ్రీవిల్లిబుత్తూరునకు వేంచేసినచో కల్యాణ మొనర్తునని

1. ఆ.సౌ. పుట: 432
2. ప్రపన్న. అధ్యా. 21 శ్లో. 5 నుండి అధ్యా. 21 శ్లో. 68 వరకు
3. ఆ.సౌ. పుటలు: 431, 432

విష్ణుచిత్తుడు తెలుపగా శ్రీరంగనాథుడు సకలమునిగణములో శ్రీ విల్లిబుత్తూరును జేరి, అచట గోదాదేవిని వివాహమాడి, శ్రీరంగమునకు గొనిపోయెను.[1]

పై ఘట్టములన్నింటిని పరిశీలింపగా ఆచార్యులవారు పూర్వగ్రంథములలో ఏయొక్కదానినిగూడ సంపూర్ణముగ ననుసరింపలేదని స్పష్టమగును. కొన్ని స్వతంత్ర కల్పనములుగూడ చేసినట్లు వ్యక్తమగుచున్నది. ఇట్టి కల్పనలలో తొలుత పేర్కొనదగినది—

విష్ణుచిత్తునకు బాలిక లభించిన వెంటనే విష్ణువు ప్రత్యక్షమై ఆమె తనకు భార్యయగుటకే జన్మించినదనియు, భూదేవ్యవతారమని తెలుపుట. అనంతర కథలో కుమార్తెతో ఆమె వివాహమునుగూర్చి విష్ణుచిత్తుడు ప్రస్తావించినపుడు–గోద తాను విష్ణువునే వివాహమాడుదునని పలుకగా ఆమె కోరిక అనుచితమనియు, అసాధ్యమనియు మందలించినట్లుకూడ ఆచార్యులవారు కల్పించిరి. ఈ రెండు కల్పనలకును సమన్వయము కుదురుట కష్టము. విష్ణుమాయావృతుడై విష్ణుచిత్తుడు ఆ వృత్తాంతమును మరచియుండునని సమాధానపరచుకొనవలసి యుండును.

గోదాదేవి ధరించివిడిచిన మాలను స్వామికర్పింపజాలక, విష్ణుచిత్తుడు చింతించుచుండగా ఆమె తాల్చియిచ్చిన మాలయే తనకు ప్రియమని స్వామి అర్చకముఖమున తెలిపినటు ఆచార్యులవారు వర్ణించిరి.[2] ఇంతకు పూర్వము స్వయముగా విష్ణుచిత్తునితో సంభాషించిన స్వామి ఇప్పుడు అర్చకముఖమున ఏల పలుకవలసి వచ్చెనో ఈ కల్పనలోని ఔచిత్యమేమో బోధపడదు.

అట్లే ఉద్యానవనమున క్రీడించుచున్న గోదను ఏకాంతమున స్వామి కౌగిట నదరించెననుటయు ఆచార్యులవారి కల్పనమే.[3] వివాహముకంటె పూర్వమట్టి శృంగారమును వర్ణించుటలోని ఔచిత్యము విచార్యము.

కథాంశములలో నింతకన్న పేర్కొనదగిన మార్పులేవియునులేవు. స్వతంత్ర వర్ణనలనుగూర్చి మరియొకచోట విచారింపబడుచున్నది.



1. రాయల ఆముక్త. ఆశ్వా: 6
2. ఆముక్త. ఉల్లా: 3 పద: 22
3. —Ibid— ఉల్లా: 4 పద: 28

# నామౌచిత్యము

శ్రీమాన్ అమరవాది వేంకటనరసింహాచార్యులవారు తమ కావ్యమునకు 'ఆముక్త మాల్యదమ్' అని పేరిడిరి. కావ్యము కవికి మానసపుత్రిక. లోకమున ఆడు బిడ్డలకు బేసియక్షరములతో పేరుపెట్టుట అనూచానమగు సంప్రదాయము. పదాంతమగు వ్యంజనము ప్రత్యేక వర్ణముగ లెక్కింపబడును. కావున ఈ కావ్యనామమున పదాంత మకారముతో కలిపి ఏడక్షరములున్నవి. ఇట్లిచట ఆచార్యులవారు నామకరణ సంప్రదాయమును పాటించిరి.

'ఆముక్తమాల్యదమ్' - 'ఆముక్తమాల్యదాముద్దిశ్య కృతం కావ్యమ్' అని విగ్రహము. అనగా ఆముక్తమాల్యదనుగూర్చి రచించిన కావ్యమని అర్థము. 'ఆముక్త మాల్యద' యనగా గోదాదేవి. ఈమెకు తమిళమున 'శూడికొడుత్తాళ్' అను పేరు కూడ కలదు. 'ధరించి ఇచ్చినది' అని దీని యర్థము. ఈ తమిళనామమునకు సంస్కృతీ కరణము- "ఆముక్తమాల్యదా." ఈ సంస్కృతీకరణము ఆచార్యులవారు కల్పించినది కాదు. ప్రాచీన వైష్ణవగ్రంథరూఢమైనది.

'ఆముక్త'మనగా ధరింపబడినది. 'ఆఙ్' ఉపసర్గపూర్వకమగు 'ముచ్ల్ - మోక్షణే' అను ధాతువునకు క్త ప్రత్యయము చేరగా "ఆముక్త"యను రూపమేర్పడును. 'మాల్య' మనగా "సిగిలో ధరించు పూదండ" యని ఒక అర్థము.[1] "దా" అనగా ఇచ్చునది. "సిగిలో ధరించిన మాలనిచ్చునది" కనుక "ఆముక్తమాల్యదా" అనబడినది.

కావ్యనాయికకు "గోద" యనియు; "శ్రీ ఆండాళ్" అనియు, "ఆముక్త మాల్యద" యనియు పేర్లుండగా గోదా పరిణయమనియో, శ్రీ ఆండాళ్ కల్యాణ మనియో పేరుపెట్టక కవి "ఆముక్తమాల్యదమ్" అని ఆముక్తమాల్యదానామమునే స్వీకరించుటలో ఔచిత్యమేగాక, శ్రీకృష్ణదేవరాయల కావ్యనామ ప్రభావమును ఉన్నది.

గోదాదేవి చరిత్రమున ప్రధాన ఘట్టము స్వామికి తాను ధరించిన మాలికల సమర్పణము చేయుట. వానిని స్వామి ప్రీతితో ధరించుట. ప్రపన్నామృతమున గోదాదేవి ఇట్లు వర్ణింపబడినది-

---

1. "మాల్యం మాలా స్రజౌమూర్ధ్ని"అమరకోశము-కాం. 2 శ్లో: 135 పుట: 432

"ఆముక్తమాలికా యేన విష్ణవే గోదయార్పితా।
ఆముక్తమాల్యదా నామ తస్యాస్తేనాభవద్భువి॥"
—(ప్రపన్న. అధ్యా: 19 శ్లో: 37)

శ్రీ పరాశరభట్టరు అనతిచ్చిన శ్లోకమున సైతము–

"స్వోచ్ఛిష్టాయాం స్రజిని గళితం యా బలాత్కృత్య భుంక్తే" అని గోదాదేవి స్తుతింపబడినది. అట్లే మరియొక ప్రాచీనాచార్యులు చెప్పిన శ్లోకమునను–

"స్వోచ్ఛిష్టమాలికాబంధగంధబంధురజిష్ణవే" అని మంగళాశాసనము చేయబడినది.

ఇట్లు వైష్ణవ సంప్రదాయమంతయు ఈమె కీర్తికి శిఖరాయమాణమైన ఈ మాలా వృత్తాంతమునే విశేషముగా ప్రస్తావించినది. గోదాదేవి మాలాకారుడైన విష్ణుచిత్తునకు సుతయగుటయు ఒక విశేషమైనది. కావున ఈమెను గూర్చి రచించిన కావ్యమునందు ఈ సంఘటన ప్రాధాన్యమును స్ఫురింపజేయు నామమును స్వీకరించుటయే ఉచితము. అలంకారిక సంప్రదాయము కూడ ఇట్లేయున్నది–

"ఆస్తాం వస్తుషు వైదగ్ధ్యం కావ్యే కామపి వక్రతామ్।
ప్రధాన సంవిధానాంక నామ్నాపి కురుతే కవిః"[1]

అని రాజానకకుంతకుని యుపదేశము. ఆ మర్యాదయు ఇచట పాటింపబడినది. ప్రధానసంవిధానానుగుణమగు నాయికానామము ఆధారముగా కావ్యనామముంచుట ఇందలి విశేషము.

ఇట్లాచార్యులవారు తమ కావ్యమునకు పేరుపెట్టుటలో అనూచానమును, ఆచార్యపరంపరాప్రసిద్ధమును, అలంకారికమును, ఆంధ్రదేశీయసుప్రసిద్ధమును అగు సంప్రదాయమును పాటించి చక్కని యౌచిత్యమును ప్రదర్శించిరి.

1. వక్రోక్తి జీవితము: ఉన్మే: 4 శ్లో: 24

# అనువాద వివేచనము

ఆచార్యులవారు ఈ గ్రంథములో కొన్ని తావులలో ద్రవిడ ప్రబంధములలోని ఆయా గాథలకు అనువాదములుగా కొన్ని వచనభాగములను, శ్లోకములను సూచించిరి. కాని అవి కేవలము ఆ గాథలలోని భావమును దృష్టియందుంచుకొని రేఖా మాత్రముగ ఆ భావము ప్రతిఫలించునట్లు రచింపబడినవే గాని సంపూర్ణములగు అనువాదములుకావు.

"నాథోఽయంయది మామపేక్ష్యవిధినా శ్రీ సుందరః కామయేత్
కల్యాణం యది కారయిష్యతి తదా క్షీరాన్నమత్యుజ్జ్వలమ్।
మాధ్వీశర్కరమిశ్రమత్రశతధా దద్యాంతతః ప్రీతిదం
పశ్చాత్ శ్రీవనశైలనాథమమితంపర్యాంతదిద్వ్యాకరమ్॥"
—(ఉల్లా: 4 శ్లో: 12)

(వనశైల నాథుడగు ఆ శ్రీరంగనాథుడు నన్ను చేరి, విధిపూర్వకముగానన్ను వివాహమాడినచో, తేనె శర్కరలు కలిపిన నూరుకడవల క్షీరాన్నమును సమర్పించి, అతని ఇచ్ఛానుసారము పూజింతును.)

తమ ఈ శ్లోకమునుగూర్చి ఆచార్యులవారు పాదదీపికలో "నాచ్చియార్ తిరుమొళి 9వ తిరుమొళి-6 గాథానువృత్తోయం వనగిరి సుందర శ్లోకః"అని పేర్కొనిరి. ఈ గాథ ఇట్లున్నది-

"నాఱు నఱుమ్ పొழిల్ మాలిరుఞ్జోలై నమ్బిక్కునాన్
నూఱు తడావిల్ వెణ్ణెయ్ వాయ్‌నేర్న్దు పరావివైత్తేన్
నూఱు తడానిఱైన్ద అక్కారవడిశిల్ శొన్నేన్
ఏఱు తిరువుడైయాన్ ఇన్ఱువన్దివై కొళ్ళుఙ్గొలో."

ఈ గాథ భావమిది- "పరిమళముచ్చు ఆ వనగిరి ప్రభువునకు నూఱుకడవల వెన్నను, నూఱు శర్కరాన్నకుంభములను మధురోక్తి రూపముననే అర్పింతును. వీనిని ఆ హరి స్వీకరింపనిష్టపడునా అని శంక గలుగుచున్నది."[1]

ఈ గాథను, ఆచార్యులవారి శ్లోకమునకును భావమున పోలిక తావన్మాత్రమే.

---

1. నాచ్చియార్ తిరుమొళి-'శ్రీ అణ్ణంగరాచార్యస్వామి ఆంధ్రటీక' పుట: 65

ద్వితీయోల్లాసములోని గోదాస్వప్నపరిణయ వర్ణనము – "నాచ్చియార్ తిరుమొళి"లో "వారణమాయిరమ్"[1] ఇత్యాది గాథాదశకమునకు అనువాదము. ఈ పది గాథలను ఆచార్యులవారు పదకొండు శ్లోకములలో అనువదించిరి. వీనిలో నాలుగవ శ్లోకము, ఎనిమిదవ శ్లోకము ఒకే భావమును చెప్పునవే. ఇవి ఎనిమిదవ గాథకు అనువాదరూపములు. మూలమున తన స్వప్నపరిణయమును నాయిక తన చెలికత్తెలకు వర్ణించి చెప్పినట్లున్నది. ఆచార్యులవారి రచనలో "గోదాదేవికి ఇట్టు స్వప్నము కలిగె"నని కవి వర్ణించినట్లున్నది.

పై వరుసలోని మొదటిశ్లోకమిది–

"మత్తేభేంద్ర సహస్రసంవరివృతః పూర్ణ స్సనారాయణః
ఏతత్పట్టణమేష్యతీతి విబుధాస్సల్లాపయంతో వచః॥
గేహాగ్రస్థవితర్దికాసు కలశైః స్వర్ణైః పరిస్థాపయన్
స్వప్నాన్తే సుదతీ ముదాన్వితహృదా ఽపశ్యత్సఖీవాంఛురః॥"

—(ఉల్లా 2 శ్లో 63)

(పూర్ణస్వరూపుడగు ఆ నారాయణుడు వేయి ఏనుగులతో కూడినవాడై ఈ పట్టణమునకు వేంచేయుచున్నాడను మాటను వినినవారైన విబుధులు భవనముల పై భాగములందు స్వర్ణకలశములను స్థాపించిరని స్వప్నాంతమున సంతోషపరవశయైన గోదాదేవి చెలులతో చెప్పెను.)

పై ఆచార్యులవారి శ్లోకమునకు మూలము ఈ విధముగనున్నది–

"వారణ మాయిరమ్ శూళవలమ్ శెయ్ తు
నారణనమ్బినడక్కిన్దా నెన్దెతిర్
పూరణపొఱ్కుడమ్ వైత్తుప్పుఱమెఙ్గుమ్
తోరణమ్నాట్టక్కనాక్కణ్డేన్ తోళీ నాన్"

(నాచ్చియార్ తిరుమొళి 6వ తిరుమొళి 1వ గాథ)

"ఓ చెలీ! సమస్తకల్యాణ గుణభరితుడగు శ్రీమన్నారాయణుడు వేలాదిగ ఏనుగులతోకూడి ప్రదక్షిణముగా విచ్చేయుచుండెనని వాద్యధ్వనులచే తెలిసికొని, వానికెదురుగా బంగారు పూర్ణకుంభములనిడి పట్టణమంతటను తోరణ స్తంభములు పాతిరి. ఈ విధముగ నే కలలోగంటినమ్మా"[2]

1. 'ఆయిరమ్'అనగా తమిళమున 'వెయి' అని అర్థము. ఇందు వేయి ఏనుగులతో కూడి నారాయణుడు వచ్చుచున్నట్లు వర్ణింపబడుటచే ఈ గాథల సముదాయమునకు 'వారణమాయిరమ్'అని పేరు. ఇది ప్రారంభములోని పదము.
2. నాచ్చియార్ తిరుమొళి–శ్రీ అణ్ణంగరాచార్యస్వామివారి ఆంధ్రటీక పుట 39

పై మూలానువాదములను పరిశీలించినచో మూలములోని లాలిత్యము అనువాదమున కన్పింపదు. మూలమున ఈ గాథాదశకములో 'నాక్కడ్వేన్ తోళీ నాన్' అను మకుటముకలదు. అనువాదములో నాలుగు శ్లోకములలో చివరిపాదముగ 'స్వప్నాన్తే సుదతీమదాన్వితహృదాఽపశ్యత్సఖీనాంపురః' అను పాదము కూర్చబడినది. తక్కిన వానిలో 'స్వప్నాన్తే' అను మాట చతుర్థపాదాదియందు గలదు. కొంత జాగరూకత వహించియున్నచో అన్ని శ్లోకములలోను ఒకే మకుటమును సాధించి యుండవచ్చును.

ఆరవ గాథయొక్క అనువాద శ్లోకమున మూడవపాదము—'ఆరూఢోమణిపాదు కేవ కమలాకాన్తఃధరాం స్ఫోటయన్' అనునది అమూలముగ చెప్పబడినది. చివరి పాదములో 'స్వప్నాన్తే మృదుపాణిపీడనపరః తం చాప్యపశ్యన్స్మృతా' అని యున్నది. విష్ణువునకు విశేషణముగనిచట 'మృదుపాణిపీడనపరః' అను మాట కలుపుగానున్నది. ఇట్లే పెక్కు అమూలములగు విస్తరణలు యీ యనువాదమున కలవు. ఇవి భావ సౌందర్యమున కంతగా ఉపకరింపవు.

ఇంతకును ఆచార్యులవారు ఈ శ్లోకములను పై 'వారణమాయిరమ్' ఇత్యాది గాథాదశకమునకు అనువాదములని పేర్కొనలేదు. పేర్కొనకపోయినను ఈ అన్ని శ్లోకములును అనుసరణములనుట స్పష్టము.

చతుర్థోల్లాసమున–విరహార్తయగు గోదాదేవి తన ప్రియుడగు గోవిందుడెచట నున్నాడని చెలికత్తెలను ప్రశ్నించును. బృందావనములో నీ ప్రియుని చూచితిమని చెలికత్తెలు బదులుపలుకుదురు. ఇవి పది శ్లోకములు. తొమ్మిది శ్లోకములలో ప్రతి శ్లోకమునను ప్రశ్నయు, సమాధానమును ఉండును. పదియవ శ్లోకము ఫలశ్రుతి. ఈ పదియును 'నాచ్చియార్ తిరుమొళి'లోని 14వ తిరుమొళియగు 'పట్టిమేయన్దోర్' మున్నగు గాథాదశకమునకు అనువాదములు.

మూలములో ప్రతిగాథలోను మొదటి రెండు చరణములు ప్రశ్నగను, చివరి రెండు చరణములు సమాధానముగను నియతముగ కూర్చబడినవి. ఈ యనువాదమున అట్టి నియమమేమియు పాటింపబడలేదు. "వారణమాయిరమ్" ఇత్యాది గాథాదశకానువాదములోవలెనే వీనిలోగూడ మూలములోని కొన్ని పదములు విడువబడుటయు, కొన్ని అదనముగ వచ్చిచేరుటయు సంభవించినది.

మూలములో ఈ గాథాదశకమున నాలుగవగాథ ఇట్లున్నది.

"కార్ త్తణ్ కమలక్కణ్ణెన్నుమ్ నెడుఙ్గయిఱువడుత్తి ఎన్నై
ఈర్ త్తుక్కొణ్డు విళైయాడుమ్ ఈశ్వనైక్కణ్డీరే?
పోర్ త్తముత్తిన్ కుప్పాయప్పుగర్ మాల్ యానైక్కన్ఱేపోల్
వేర్ త్తునిన్ఱువిళైయాడ విరున్దావనత్తేకణ్డోమే"

—(నాచ్చియార్ తిరుమొళి 14వ తిరుమొళి 4వ గాథ)

"(నల్లని మేఘములలో తామరపూచినట్లుండు తన కండ్లనెడి పలలో నన్ను బిడవైచి లాగికొనివచ్చి విహరించెడి వాడొకడు మీకగుపడెనే? (అవాబు) ఆహా! ముత్తెపు కుబుసమును దొడిగిన ఏనుగుగున్న తిరుగులాడెనేమో!! అనదగి చెమ్మట బిందువులుచిమ్మునెమ్మేనితో విహరించు గొల్లపిల్లడు బృందావనమున నగుపడెను)"[1]

దీనికి ఆచార్యులవారి అనువాదమిది-

"ఘనాంభోద శ్యామః వికచనయనః శ్రీవిలసితః
క్వదృష్టః పుంనాగః వ్రజహృదయచోరః వృషసమః।
చలత్కేశః కుంభస్మదగజగతిస్తే ప్రియసఖః
పరాత్మా శ్రీబృందావన పరిసరే తిష్ఠతినఖి॥"

—(ఉల్లా 4 శ్లో 19)

(గోదాదేవి తన చెలిని ప్రశ్నించుచున్నది-నీల మేఘశ్యాముడు, వికచనయనుడు, లక్ష్మీదేవిచే కూడియుండువాడు, పురుషోత్తముడు, గోపికా హృదయచోరుడు, వృషసముడు, చలత్కేశుడు, ఉన్మత్తమత్తేభగమనుడు అయినవాడెచ్చటనైన కనబడెనా? అట్టి పరమాత్ముడను నీ ప్రియసఖుడు బృందావనపరిసరములందున్నాడుసఖీ! అని ఆ చెలికత్తె ప్రత్యుత్తరమిచ్చుచున్నది.)

1. నాచ్చియార్ తిరుమొళి-శ్రీ అణ్ణంగరాచార్యస్వామివారి ఆంధ్రటీక: పుట. 97

పై శ్లోకములకును, మూలములకును గల తారతమ్యము స్పష్టము. మూల భావములోని లాలిత్యమునుగాని, పదప్రయోగములోని సార్థకతనుగాని ఆచార్యుల వారు ప్రకటింపలేదు. ఈ పది శ్లోకములు పై గాథాదశకమునకు అనువాదములని ఆచార్యులవారు పాదదీపికలో పేర్కొనిరి. ఈ రెండు ఘట్టములను గోదాదేవి రచించిన పై రెండు గాథాదశకములకు అనువాదములనుటకన్న స్వేచ్ఛానుసరణలుగా భావించుట సమంజసముగా నుండును.

ఇట్లాచార్యులవారు చేసిన అనువాదములు యథామూలములుగాక, రేఖామాత్ర ప్రభావానుసరణలును, స్వేచ్ఛాభావానుసరణలును, విస్తరణలునునైయున్నవి.



# కావ్యాంశవివేచన ప్రకరణము

## రసము

ఈ కావ్యములో గోదాదేవి శ్రీరంగనాథుని పతిగా వలచి వరించుటయు, ఆ స్వామినారాధించి పరిణయమాడుటయు ప్రధానమగు ఇతివృత్తము. గోదాదేవి పరమ భక్తితో తన్నుతాను స్వామికర్పించుకొని, ఆరాధించినది. కనుక ఇందు మధురభక్తి గాని, శృంగారముగాని, అంగిరసముగా చెప్పవలసియుండును.

భక్తిని పలువురాలంకారికులు రసాంతరముగా అంగీకరింపక, శృంగారము నందే అంతర్భవించునని అభిప్రాయపడిరి. మధురభక్తి యందు భక్తుడు లేక భక్తురాలు తన్ను నాయికగా భావించుకొని, భగవంతుని నాయకునిగా జేసికొని శృంగారభావ నానుభూతిని కల్పించుకొనుట కన్పించును. భక్తికి రసత్వమును ప్రతిపాదించిన మధుసూదనసరస్వతి ఇటు పేర్కొనెను-

"రతిర్దేవాదివిషయా వ్యభిచారీ తథాంచితః।
భావః ప్రోక్తో రసోనేతి యదుక్తం రసకోవిదైః॥
దేవాంతరేషు జీవత్వాత్పరానందాఽప్రకాశనాత్।
తద్యోజ్యం; పరమానందరూపే న పరమాత్మని॥
కాంతాదివిషయా వా యే రసాద్యాస్తత్ర నేదృశం।
రసత్వంపుష్యతేపూర్ణసుఖాస్పర్శిత్వకారణాత్॥
పరిపూర్ణరసా క్షుద్రరసేభ్యోభగవద్రతిః॥
ఖద్యోతేభ్యఇవాదిత్యప్రభేవ బలవత్తరా"॥[1]

1. కావ్యాలంకార సంగ్రహము-శ్రీ సన్నిధానం సూర్యనారాయణశాస్త్రిగారి వ్యాఖ్య పుట: 308

(రసకోవిదులు దేవాదివిషయకరతి రసముగాదనియు, భావమనియు చెప్పిరి. ఇతరదేవతావిషయకమగు రతి భావమేఃఏలన, వారు జీవులేయగుటచేఁబరమానందము గలుగదు. పరమాత్మ స్వరూప శ్రీకృష్ణరతి పరమానందమునకు గొంపోవును. మఱియు కాంతాది విషయములగు నేరసములందును, భగవద్రతియందువలె బూర్ణ సుఖములేక యానందము కలుగదు. కాన, వానియందు దగిన రసపుష్టిలేదు. అవి క్షుద్రరసములు. భగవద్రతి పూర్ణరసము. మిడుగురుపుర్వులకన్న సూర్యకాంతి యెట్లు బలవత్తరమో యట్లే మిగిలిన రసములకన్న నది శ్రేష్ఠతరము. బలవత్తరము)[1]

పై వాదముననుసరించి ఈ కావ్యమున మధురభక్తియే రసమగుచున్నది.

భక్తికి రసత్వమును అంగీకరింపని పక్షమున ఇందు శృంగారము రసమగును. నాయికయగు గోదాదేవి శ్రీరంగనాథునకు స్వీయయగుటయేగాక, స్వాధీనపతికయునై యున్నది.

"స్వోచ్ఛిష్టమాలికాబంధగంధబంధుర జిష్ణవే।
విష్ణుచిత్త తనూజాయై గోదాయై నిత్యమంగళమ్"[2]

అనియు_

"నీళాతుంగస్తనగిరితటీసుప్తముద్బోధ్య కృష్ణం
పారార్థ్యం స్వం శ్రుతిశతశిరస్సిద్ధమధ్యాపయంతీ।
స్వోచ్ఛిష్టాయాంస్రజినిగళితం యా బలాత్కృత్య భుంక్తే
తస్మై గోదానమఇదమిదంభూయఏవాస్తు భూయః॥"
—(శ్రీ పరాశరభట్టరు)

అనియు గోదాదేవి స్తుతింపబడినది.

కాని, గోదా శ్రీరంగనాథుల కల్యాణమునకు పూర్వము గోదాదేవి పితృ పరాధీనయగు కన్యగావున పరకీయయే యగునుకదా. స్వీయఎట్లగును? అను సందేహము కలుగును. గోదా శ్రీరంగనాథుల సంబంధము జన్మాంతరీయము. అంతేగాక, శ్రీవైష్ణవ సంప్రదాయమున జీవులెల్లరు పారతంత్ర్యముకలవారే. శేషియగు

---

1. కావ్యాలంకార సంగ్రహము-శ్రీ సన్నిధానం సూర్యనారాయణశాస్త్రిగారి వ్యాఖ్య పుట: 308
2. ప్రాచీనాచార్యప్రోక్తము.

శ్రీమన్నారాయణుడొక్కడే స్వతంత్రుడు, పురుషుడు. నాయికాభావమును వహించిన జీవులెల్లరును స్వామికి స్త్రీయలే యగుదురు. ఈ కావ్యమున కవి గోదాదేవికి అనన్య శేషత్వము, అనన్యభోగ్యత, అనన్యకైంకర్యములను చెప్పెను.[1] కావున గోదాదేవి ఈ ఇతివృత్తమున శ్రీరంగనాథునకు స్వీయగనే భావింపవచ్చును.

మధుర భక్తికిని, శృంగారమునకును మౌలికమగు భేదమొక్కటియే. ఇతర నాయికలయందు నాయికకు రతి శృంగారమనియు, పరమానందస్వరూపుడగు శ్రీకృష్ణునియందలి రతి మాత్రము భక్తిరసమనియు భక్తిరసవాదుల అభిప్రాయము.

కనుక ఈ కావ్యమున శృంగారమును అంగిరసముగా భావించిన పక్షములో గూడ అది ఎట్లు పరిపుష్టమైయున్నదో చర్చింప వలసియున్నది.

గోదా శ్రీరంగనాథులీ కావ్యమున నాయికా నాయకులు. వారీ శృంగార రసమునకు ఆలంబనవిభావములు. నాయికయగు గోదాదేవి యౌవనసౌందర్యములును, శ్రీరంగనాథుని దివ్యమంగళాకారవైభవమును ఉద్దీపన విభావములు. గోదాదేవి విరహావస్థలోని ఆమె భావనలు, అవస్థలు సంచారిభావములు. గోదాదేవిని శ్రీరంగనాథుడు పూదోటలో పరిరంభణముచే ఆదరించిన సందర్భమున అనుభావములు వర్ణింపబడినవి. ఇట్లు రసనిష్పత్తిసామగ్రియంతయు ఈ కావ్యమున సమకూర్పబడినది.

శృంగారరసము సంభోగము విప్రలంభము అను భేదముచే ద్వివిధము. నాయికా నాయకుల పరిణయమునకు పూర్వభాగము ప్రాయికముగ విప్రలంభశృంగారాత్మకమై యుండును. ఇది పూర్వరాగము. పరిణయానంతర శృంగారమునందు సంభోగవిప్రలంభములు రెండును ఉండవచ్చును. ఇది ఉత్తరరాగము. పరిణయాంతమైన ఈ కావ్యమున ఉత్తరరాగమునకు అవకాశములేదు. కాని, పక్షాంతరమున శ్రీరంగనాథుడు పూదోటలో గోదాదేవిని పరిరంభణమున ఆదరించుటయే పూర్వరాగమున కవధిగా భావించినచో తరువాత వర్ణింపబడిన గోదావిరహము, సఖీసందేశము ఇత్యాదులు ఉత్తరరాగముగా భావింపవచ్చును. గోదాదేవి భూదేవ్యవతారమనియు, తన్ను

---

1. అనన్యశేషత్వమనన్యభోగ్యతా మనన్యకైంకర్యమనన్యయోగ్యమ్।
పశ్రితయాకారతయాఽవనీసుతా బభార కాంచీరశనామివాన్యామ్॥
—(ఆముక్త. ఉల్లా: 1 శ్లో: 49)

పొందుటకే ఆమెను పుత్రికగా విష్ణుచిత్తునకు ప్రసాదించుచుంటినని స్వామి కథారంభము ననే విష్ణుచిత్తునితో పలికెను. కావున శ్రీరంగనాథునితో గోదాదేవికున్నది అనేక పూర్వజన్మముల సంబంధము. వారి పతిపత్నీభావము జన్మాంతర సిద్ధము, దివ్యము. దాని క్రియారూపమగు అభివ్యక్తిమాత్రమే ఈ జన్మమున పూదోటలోని వృత్తాంతముతో ఆరంభమైనది. కావున ఈ ఘట్టమును పరిణయస్థానమున సంభావించుటలో సామంజస్యమున్నది.

విష్ణుచిత్తునకు తులసీవనమున బాలిక లభించిన సందర్భముననే విష్ణువు ప్రత్యక్షమై ఆ బాలికనుగూర్చి—

"మత్ప్రాప్తయే మమపసీతఫలోదయేఽయం
మద్భక్తిభావలలితా మదనస్యశీలా"
— (ఉల్లా: 1 శ్లో: 25)

అనియు, "మయాపరిగృహీత వరాహవేషేణ పరిహృతభార్యయా నివేదితమనోరథయా తదనుమతి సంపుటితమనుసంతా అస్మిన్నపి జన్మని పరిపూర్ణఫలాం చికీర్షుణా సీతామివ తాం జనకమివ భవంతం గోదాపితారేణ కృతార్థయితుం చిత్తామసేహి ఇమాం సుతాం" (ఉల్లా: 1 వచ: 28) అని అనతిమ్పుటలోనే ఈ కావ్యమున శృంగారరసము నకు బీజావాపము జరిగినది. గోదాయౌవనవిలాసమును వర్ణించుటలో ఇది విస్తరింప బడినది.

ద్వితీయోల్లాసమున విష్ణుచిత్తుడు గోదాదేవితో ఆమె వివాహమునుగూర్చి ప్రస్తావింపగా ఆమె తాను విష్ణువును తప్ప అన్యుని చేరనొల్లనని పలుకును. అది అసాధ్యమగు కోరికయని విష్ణుచిత్తుడు మందలింపగా గోదాదేవి తన అభిప్రాయమును సమర్థించుకొనును. ఈ పలుకులలోని దృఢత్వము ఆమె మనోవాంఛా తీవ్రతను నిరూపించును.

అటుపిమ్మట వర్ణింపబడిన వసంతువుర్ణనము, రాత్రి వర్ణనము శృంగార రసమునకు తటస్థవిభావములు. గోదాదేవి విరహార్తయై చంద్రాదులను దూషించుటయు ఈ విప్రలంభ శృంగారమునకు పోషకమే. ఆ తరువాత కూర్చబడిన స్వప్నపరిణయ వృత్తాంతము; ఆ అనుభూతిని చెలికత్తెలకు వర్ణించి చెప్పుటకూడ శృంగారరసమును చక్కగా పోషింపజాలియున్నది.

చతుర్థోల్లాసమున–గోదాదేవి చెలులతో ఉద్యానవనవిహారము చేయుచు, ఒక చోట నిలువఁజాలక, తుమ్మెద ఝంకారములు, ఆయావృక్షముల సౌందర్యము మున్నగు నవన్నియు తనకు బాధాకరములుగా వర్ణించుటయు తన ప్రియుడెచట నున్నాడని చెలులను ప్రశ్నించుటయుకూడ ఇచటి విప్రలంభ శృంగారమునకు పరిపుష్టినిచ్చుచున్నవి. అటుపిమ్మట క్రీడా వశమున చెలికత్తెలనుండి దూరముగా వచ్చిన గోదాదేవి నేత్రపటమును తొలగించి విష్ణువామెను కౌగిట అదరించుట సంభోగశృంగారము. అటుతరువాత మరల గోదాదేవి విరహమునను భవించుటయు చెలితో స్వామికి సందేశమునంపుటయు వర్ణింపబడినది. ఇవి ఉత్తరభాగమున విప్రలంభమును పోషించినవి. గోదా శ్రీరంగనాథుల కల్యాణముతో ఈ కావ్యములో శృంగారము పరిపుష్టమైనది.

కావ్యమున మధురభక్తి నే రసముగా భావించినను, పై విభావాదులన్నియు యథాతథముగ దానికి అన్వయించును. గోదాదేవి శ్రీరంగనాథునకు కేవలము భక్తురాలై భక్తిభావనలో స్వామిని ఆరాధించియున్నచో మధుర భక్తిరసమనియు, కేవలము స్వామికి ప్రియురాలై వలచి వలపించి పరిణయమాడియున్నచో శృంగారరసమనియు నిష్కర్షచేయవచ్చును. ఇచట గోదాదేవియందు భక్తియు, ప్రణయమును కూడ నిరూపింపబడి, గోదా శ్రీరంగనాథుల అనుబంధము వివాహాంతమైనది. కనుక పై రెండు రసములను ఈ ఇతివృత్తమున అన్వయించుట కవకాశము కలిగినది.

పలువురు ప్రామాణికులైన ఆలంకారికులు భక్తికి రసత్వము నంగీకరింపక పోవుటచేతను, భరతముని దీనిని రసముగా పేర్కొనకపోవుటచేతను, ఆలంకారిక సంప్రదాయమునుబట్టి ఈ కావ్యమున రసము 'శృంగార'మనియే చెప్పుట సమంజసము.

ఇట్టి కావ్యమున శృంగారరసము సాంగోపాంగముగ పోషింపబడినను, గోదాదేవిచేతను, సంభోగానంతరము శ్రీరంగనాథునినోట, గోదాదేవితోను పలికించిన పలుకులలో సుదీర్ఘములగు తాత్త్వికచర్చలు గలవు. ఇవి కావ్యములోని అంగిరసమగు శృంగారమునకు భంజకములన్పించును.

ఈ కావ్యమునగల అంగరసములలో తొలుత పేర్కొనదగినది శాంతము. శృంగారము అంగిరసమైనప్పుడు శాంతరసప్రసక్తి కావ్యమున ప్రధానరసమునకు భంజకమే అయినను, ఈ రెండు రసములు ఏకనాయకాశ్రితములైనప్పుడు వీనినతుమ

అద్భుతరసమును కూర్చవలెనని అలంకారిక సమ్మతి కలదు.[1] శ్రీరంగనాథుని లీలలు అద్భుతావహములు కనుక పై అలంకారిక సంప్రదాయమిచట ఈ రసవైరుధ్యమును పరిహరించుచున్నది.

కవికిగల విశిష్టాద్వైత తత్త్వాభినివేశము కారణముగను గోదావిష్ణుచిత్తులు పరమ భక్తులు కావునను ఈ కావ్యమున పలుతావులలో శాంతికాంశములు ప్రస్తావింపబడినవి. శృంగార సన్నివేశములలోగూడనివి విస్తృతముగ చోటుచేసికొన్నవి.

గోదాదేవిని కౌగిట అదరించిన విష్ణువు ఆమెనిట్లాశ్వాసించును—

"అయిగోదే! చిరాత్సముపగతోఽయం ఆనందానుభూతిః. బ్రహ్మానందే చిరానందోదయః చిరానందే బ్రహ్మానంద ఇతి పంచటీవ సంచిత ప్రపంచ మిథ్యానుభావోఽయం కిమనయా అద్వైతసిద్ధాంత భావోఽప్యుపగతః—నాయం 'తథా' అనేన జీవేనాత్మనానుప్రవిశ్యనామరూప వ్యాకరణమివ ఆనందానుభావోఽపి తాదృశవివేతి సముపగతోయం విశిష్టాద్వైతప్రతిభంగీకరణేవ మయా సమువస్థితః" (ఉల్లా: 4 వచ: 30) మున్నగు వచనములు శమప్రధానములు.

ఈ కావ్యమున శృంగారశాంతరసములు పోషింపబడిన విధానమునుబట్టి ఆచార్యులవారు అలంకారిక మర్యాదలను శ్రద్ధతో పాటించిరని చెప్పవచ్చును.



1. కావ్యాలంకారసంగ్రహము—ఆశ్వా. 4 పుట: 321

# పాత్ర చిత్రణము

రసమునకు ఆధారభూతమైనవి కావ్యమునందలి నాయికా నాయకాది పాత్రలు. కావ్యమున పాత్ర చిత్రణలో కవిచూపు నేర్పునుబట్టియే ఆ కావ్యప్రయోజనము సిద్ధించును. పాత్రచిత్రణమున ఆ పాత్రను గూర్చి కవి తానుగా పలికిన మాటలు, ఇతర పాత్రలు ఆ పాత్రనుగూర్చి పలికిన మాటలు వివిధ సన్నివేశములలో ఆ పాత్ర ప్రవర్తించిన తీరుతెన్నులు, పలికిన మాటలు, స్వరూపస్వభావములను నిరూపించును. ప్రఖ్యాతమగు ఇతివృత్తమును స్వీకరించిన కవి ఇంతకుపూర్వమే సహృదయుల మనస్సులలో రూఢమైయున్న ఆ పాత్ర స్వరూపస్వభావములను తానెంతవరకు చిత్రింపగలిగెనను విషయము కవి సామర్థ్యమునకు గీటురాయి.

ఈ కావ్యమున నాయిక గోదాదేవి. నాయకుడు శ్రీరంగనాథుడు. గోదాదేవి తండ్రియగు విష్ణుచిత్తుడు, మఱియొక పాత్ర. ఈ మూడు పాత్రలతోడనే కథ అంతయు నడచును. చెలికత్తెలున్నను, ఆ పాత్రల నామరూప స్వభావములు పరిగణనలోనికి రాలేదు. కథాగమనమున చెలికత్తెలకు ప్రమేయములేదు

విష్ణుచిత్తుడు పన్నిద్దరాళ్వారులలో 'పెరియాళ్వారు'గా పేర్కొనబడినవాడు. ఇతడు నిరంతరసమారాధితముకుందపదారవిందుడనియు, 'సాలావృత'[1] గోత్రజుడనియు; తార్క్ష్యాంశజుడనియు ఆచార్యులవారు పేర్కొనిరి. ఇవి విష్ణుచిత్తుని గూర్చి తెలిపిన గ్రంథములన్నియు పేర్కొన్నవే. గురువులవద్ద శాస్త్రములు చదువకయే పాండ్యరాజసభలో శాస్త్రవిజయమును పొందినవాడని పేర్కొనబడెను. ఇదియును ఇతరులు పేర్కొన్నదే.

ఆచార్యులవారు విష్ణుచిత్తునిగూర్చి-"జితేంద్రియాపదీరిత మిథున కథాశ్రయః" అనియు, "అపత్నీకు"డనియు; "అనూఢపత్నీకు"డనియు పేర్కొనిరి. విష్ణుచిత్తునకు భార్యలేనట్లు ఇతర గ్రంథములలో కన్పింపదు. గురుపరంపరాప్రభావము, దివ్యసూరి చరిత్రలలో ఇతడు పూదోటలో లభించిన బాలికను భార్యకిచ్చినట్లు వర్ణింపబడినది. తెలుగులో శ్రీకృష్ణదేవరాయలు ఈయనను "అబుద్ధేషుదనుఃపుత్రు"డని పేర్కొనుచునే

---

1. 'శాలావృత' గోత్రమని ప్రపన్న. అధ్యా: 17 శ్లో: 12

"ధర్మగేహిని" యున్నట్లు చెప్పెను. ప్రపన్నామృతమున భార్య ఉన్నదనిగాని, లేదని గాని స్పష్టముగా చెప్పబడలేదు. ఆచార్యులవారు ఇంత స్పష్టముగా విష్ణుచిత్తునకు భార్యలేదనిచెప్పుటవలన సిద్ధించిన ప్రయోజనమేదియు కన్పింపదు.

పరమభాగవతుడగు విష్ణుచిత్తుడుకూడ కుమార్తె బాల్యావస్థనుండి యౌవనమున ప్రవేశింపగనే లోకములోని అందరు తండ్రులవలెనే బిడ్డ వివాహమునుగూర్చి చింతించెను. కుమార్తెతో వివాహవిషయమై ప్రస్తావింపగా ఆమె తాను శ్రీహరియందే మనస్సు నిల్పినదానననని పలుకగా విష్ణుచిత్తుడు ఆమెపల్కులకు చింతించి హేయగుణ బంధురమగు దేహముచేతను, హేయమగు దురహంకారముచేతను విష్ణువును పొంద గోరుట అయుక్తమనియు, అట్టికోరిక ఈ జన్మయందేగాక, ముందుజన్మలలోగూడ సిద్ధించునది కాదనియు పలుకును. అంతేగాక కరతలముచే కుమార్తె కపోలతలమును పరామర్శించినట్లుకూడ ఆచార్యులవారు వర్ణించిరి.

విష్ణుచిత్తునకు గోదాదేవి లభించినప్పుడే విష్ణువు ప్రత్యక్షమై ఆమె భూదేవ్యవ తారమనియు వరాహావతారమున తన్నుకోరిన భూదేవి మనోరథమును నెరవేర్చ, ఆమెను కృతార్థురాలినిగా చేయదలచి, ఈ బాలికను నీకర్పించుచుంటినని పలికెను. గోదాదేవి పెరిగి, పెద్దదై తన మనోరథము తెలిపినపుడు విష్ణుచిత్తుడు అది అసాధ్యమనుటలో సామంజస్యము కథాపరముగ కన్పింపదు. బాలకృష్ణునినోట భువన భాండములన్నింటిని దర్శించిన యశోద మరల విష్ణుమాయచే దానిని విస్మరించినట్లె విష్ణుచిత్తుడును గోదాదేవి భూదేవ్యంశావతారమనియు, విష్ణువునకు పత్నియగుటయే ఆమె అవతారపరమార్థమనియు విస్మరించుట అట్టి విష్ణుమాయయే అని ఊహింపవలసి యున్నది. ఈ విస్మృతికారణముగనే గోదాదేవి విష్ణువునకై కూర్చిన మాలను గోదాదేవి ధరించినపుడీతడు వ్యాకులపడి కుమార్తెను మందలించెను. బాలిక లభించి నప్పుడే విష్ణువామె జన్మరహస్యమునీ భక్తునకు చెప్పినట్లు ఆచార్యులవారు కల్పిం చుటచే సాధించిన ప్రయోజనము తాత్త్వికము మాత్రమే. శకుంతలను అత్తవారింటికి పంపు కణ్వుని వలెనే విష్ణుచిత్తుడు తన కుమార్తెను శ్రీరంగనాథునకు పరిణయము చేయబోవుచున్నప్పుడును, పరిణయసందర్భమునకూడ పుత్రికా వియోగమునకు మిక్కిలి పరితపించెను. 'కోవా మోహః వ్యథయతిమనః భాగ్యవంతోఽనపత్యాః' (ఏదో మోహము మనస్సును బాధకు గురిచేయుచున్నది. సంతానములేనివారుకదా భాగ్యవంతులు!) అని దుఃఖించెను. ఇది మోహమని ఎరిగియు, పరమపురుషుడగు శ్రీరంగనాథుడు అల్లుడై తనను తరింపజేయుచున్నాడని గ్రహించియు కూడ, ఈ

పరమభక్తుడు పుత్రికా వియోగదుఃఖమును ఆపుకొనలేకపోయెను. ఇదిలోకసహజము. ఆచార్యులవారిట్టి పాత్రకు లోకసహజమగు పితృహృదయమును కల్పించి సహజ సుందరముగ తీర్చిరి.

కావ్యనాయికయగు గోదాదేవి భూదేవి అవతారము. వరాహావతారకాలమున శ్రీహరి ఇచ్చిన వరమును సఫలీకరించుకొనుటకు గోదాదేవిగా అవతరించినది. తన పుణ్యచరిత్రముచేతను, మధుర భావలలితమైన భక్తి కవిత్వముచేతను లోకులను తరింపజేయవచ్చిన కారణజన్మురాలు. ఈమె దివ్యచరిత్రము ద్రవిడవేదాది గ్రంథములలో వర్ణింపబడినది. శ్రీవైష్ణవసంప్రదాయములోని పన్నిద్దరాళ్వారులలో గోదాదేవియు పేర్కొనబడినది. 'గోద' యను శబ్దమునకు 'వాక్కును ఇచ్చునది' అని యొక అర్థము.[1] తిరుప్పావై, నాచ్చియార్ తిరుమొళి అను పవిత్రగ్రంథములలో ఈమె శ్రీహరినారాధించినది. ఈ యవతారమున ఈమెకు శ్రీహరియందు ప్రగాఢమగుభక్తియు అనురక్తియు శ్రీ విష్ణుచిత్తుని పెంపకములో వేదవేదాంతాదిపరిజ్ఞానము నేర్పడినది. కాని ఈమెకు తాను భూదేవి అవతారమను స్ఫురణయున్నట్లు కనిపింపదు. ఆచార్యుల వారేగాక ఈ వృత్తాంతమును వర్ణించిన పూర్వులెవ్వరునుగూడ ఈమెకిట్టి స్ఫురణ మున్నట్లు పేర్కొనలేదు. ఒక్క గోదాదేవి విషయముననేగాక, అంశావతారమూర్తు లందరి విషయమునను మహాకవులిట్టి విస్మృతినే ప్రకటించిరి. దీనివలన వారిచర్యలు దివ్యములుగాక, ఉత్తమ మానవగుణములుగా భాసించుచు లోకమునకు వారిని సన్నిహితులుగను, ఆదర్శప్రాయులుగను చేయును. అట్లే గోదాదేవి అనన్యసామాన్యమగు తన భక్తివిశేషముచేత ఆరాధ్య అయినది.

గోదాదేవి విష్ణుచిత్తుని కుమార్తెగా పెరిగినది. బాల్యమునుండియే ఈమెయందు శ్రీహరిపట్ల భక్త్యనురాగములును, వేదవేదాంతాది పరిజ్ఞానమును వ్యక్తములైనవి. రమాకాంతునియందే తన హృదయము లగ్నమైనదని ఆమెపలికినప్పుడు తండ్రి మందలింపగా గోదాదేవి ఇచ్చిన ప్రత్యుత్తరములో ఆమె సాంప్రదాయికవిద్యాపరిజ్ఞాన పాటవము వ్యక్తమగును. వటపత్రశాయి కొరకు కూర్పబడిన మాలికనామె ధరింపగా విష్ణుచిత్తుడుచూచి ఆమెను మందలించును. అప్పుడు గోదాదేవి తండ్రికి చెప్పిన-

1. గోదాదేవిని తమిళమున 'కోదై'అని పిలుతురు. కోదైఅనగా మాలయని అర్థము.

"వినిమయతి తదర్థత్వాను సంధానభావః
త్యజతిన తదుపాదీన్ న్యాసవిద్యానపాయః
జ్వలతి భువి తథాయః పిండపేషోగ్నిరిద్ధః
పిబతి ఖలు మరందం భృంగయోగేన కీటః"

—(ఉల్లా: 3 శ్లో: 17)

మున్నగు మాటలలో ఈమె వేదాంతశాస్త్రపరిజ్ఞానము స్పష్టమగును.

గోదాదేవి ధరించి ఇచ్చిన మాలికలే తనకు ప్రీతికరములని శ్రీమహావిష్ణువు అనతిచ్చిన పిమ్మట విష్ణుచిత్తుడు కుమార్తెనుగూర్చి ఇట్లు తలచెను-

"అకామయద్దోషదూయమానా
తదీయ సేవారతి మాదధానా।
నమః పదే సంచిత పారతంత్ర్యా
మమః పదే విష్ణుపరా బభూవ॥"

—(ఉల్లా: 3 శ్లో: 32)

"యుక్తమేవాస్యాః గోపీ సంస్థానవిశేషాపతాః అగమవిద్భిః భగవన్నిత్యార్చనావిధిషు విధీయమానః.... శిష్టాచారానుమితోయమనూచానస్సంప్రదాయః........"

—(ఉల్లా: 3 వచ: 33)

ఈ మాటలలో గోదాదేవి వ్యక్తిత్వము రూపుగట్టంబడినది.

ఇట్టి ఉదాత్తమగు గోదాదేవి ప్రణయము సాధారణ మానవశృంగారభావన వంటిదికాదు. ఆమె శృంగారభావనమొక ఆధ్యాత్మికానుభూతి. ఇందు శృంగారము, తాత్త్వికత అభిన్నములుగ కలసిపోవును. కాని ఆచార్యులవారు ఈమె విరహావస్థను వర్ణించుచు సాధారణ నాయికలచేతవలె మన్మథదూషణాదులు చేయించిరి. తెలుగులో శ్రీకృష్ణదేవరాయలు గోదావిరహమున శ్రీరంగనాథుని మాత్రమే ఉపాలంభించినట్లు వర్ణించెను. ప్రబంధయుగములోని రాయలు ఇట్టి పాత్రయొక్క ఉదాత్తతను పోషింపగా, తెలుగు ప్రబంధముల ప్రభావమునకులోనై ఆచార్యులవారు మన్మథదూషణాదులను కల్పించుట గోదాదేవి పాత్రలోని ఉదాత్తలౌకికభావనమునకు భంగకరముగనున్నది.

ఈ కావ్యమున మిగిలిన ప్రధానపాత్ర శ్రీరంగనాథుడు. పరమపురుషుడగు స్వామిని ఏ కవి ఎట్లు వర్ణించినను పాత్ర చిత్రణము సమగ్రముకాదు. ఆయా సందర్భములలో కవి వాక్కులలోను, గోదాదేవి వాక్కులలోను కూర్పబడిన శ్రీరంగనాథుని దివ్యమంగళవిగ్రహవర్ణనము, ఆచార్యుల భక్తిభావమును వ్యక్తము చేయును. విష్ణుచిత్తునకు గోదాదేవి లభించిన సందర్భమున శ్రీరంగనాథుడు ప్రత్యక్షమై గోదావతార పరమార్థమును తెలుపును. చెలికత్తెలతో గోదాదేవి పంపిన సందేశమును స్వయముగా అందుకొని తానే బదులుపలుకును. కాని గోదాదేవి ధరించిన మాలికను అర్పించుటకు విష్ణుచిత్తుడు ఇష్టపడకపోయిన సందర్భమున ఆ మాలికయే తనకు ప్రియమని అర్చకముఖమున చెప్పుటలో కవి సాధించిన ప్రయోజనము కనిపింపదు.

ఇతివృత్తము, అందలి పాత్రలు పరంపరాప్రసిద్ధములైనవి. ఆచార్యులవారు వీనిని చాలవరకు సంప్రదాయానుగుణముగనే మలచిరి. ఈ పాత్రలను ఆచార్యులవారు తీర్చిన విధానము సంప్రదాయముపట్ల ఆయనకుగల ప్రత్యయమును వ్యక్తము చేయుచున్నది.



# వర్ణనలు

కావ్యమున వర్ణనలు అపరిహార్యములు. ఆచార్యులవారు తమ కావ్యమును విష్ణుచిత్తుని నివాసమగు శ్రీ విల్లిబుత్తూరును వర్ణించుటలో ప్రారంభించిరి. అష్టాదశ వర్ణనలలో కథా సందర్భమునకు సముచితమైన వర్ణనావకాశములను విడువక ఆచార్యులవారు వసంతఋతువర్ణనము, రాత్రివర్ణనము, ప్రభాతవర్ణనము, గోదా బాల్య వర్ణనము, విరహవర్ణనము, వివాహవర్ణనములను చేసిరి. ఈ వర్ణనలకు సంబంధించిన భాగములలో శ్లోకములు, గద్యములు కూడ కలవు.

వీనిలో శ్రీ విల్లిబుత్తూరు వర్ణనము ప్రథమోల్లాస ప్రారంభమున చేగలదు. వసంతఋతువర్ణనము, రాత్రివర్ణనము ద్వితీయోల్లాసమున కూర్పబడినవి. పంచమోల్లాన ప్రారంభమున ప్రభాత వర్ణనము చేయబడినది. గోదాదేవి బాల్య మాపన వర్ణనలు ప్రథమోల్లాసముననే కలవు. గోదాదేవి విరహము తృతీయోల్లాసమున వర్ణింపబడినది. పంచమోల్లాసమున గోదా శ్రీరంగనాథుల వివాహము వర్ణింపబడినది.

పై వర్ణనలేగాక, ద్వితీయోల్లాసమున గోదాదేవి స్వప్నమున, శ్రీరంగనాథుడు పరిణయమైన వృత్తాంతము వర్ణింపబడినది. ఇది గోదాదేవి విరచితమగు 'నాచ్చియార్ తిరుమొళి'లోని 'వారణమాయిరమ్'అను భాగమునకు అనువాదముగనుక దీనినిగూర్చి 'అనువాద వివేచన'మను వ్యాసమున ప్రస్తావింపబడుచున్నది. ఈ వ్యాసభాగమున స్వతంత్రవర్ణనలు మాత్రమే పరిశీలింపబడుచున్నవి.

పైన పేర్కొనబడిన వర్ణనలన్నియు సంస్కృతాంధ్ర కావ్యములలో పూర్వ కవులు యథోచితముగ కావించినవే. కాని ఆచార్యులవారు స్వాతంత్ర్య భావములతో తమ వర్ణనలకు వైశిష్ట్యమును సంతరించిరి. అచ్చటచ్చట పదన శైలియందో నానొక భావరేఖయందో, ప్రాచీన సంస్కృతాంధ్ర కవుల పద్ధతి గోచరించినను, భావములు చాలవరకు స్వతంత్రమైనవి.

శ్రీ విల్లిబుత్తూరు వర్ణనమునందు-తొమ్మిది శ్లోకములును, ఒక గద్యమును కలవు. ఇందలి గద్యము—

"సమస్తనగరీ తిలకాయమానా–నిజమణిమయ మందిరాగ్ర జయధ్వజ విచాలిత మహేంద్రపురవైభవా, శర్వాణీవ సర్వమంగళాలంకృతా........................." (ఉల్లా. 1 వచ: 7) అను రీతిగాసాగి దండి మహాకవిశైలిని, తలపించుచున్నది. ఈ వర్ణనలో ఆ పట్టణపు మేడలను, సంగీతవిశారదలగు సౌందర్యవతులను, వేదవేత్తలగు విద్వాంసులను, వర్ణించుటయేగాక, ఆ పట్టణమున వటపత్రశాయి వీడకయుండునని ప్రస్తావించుట సముచితముగ నున్నది. ఈ పురవర్ణలోనేగల–

"ఉత్తుంగ సౌధాగ్ర చలధ్వజాగ్రం
సమీర ధూతాంశుకఖండ మారాత్।
అకాలకేతుం కిల శంకమానః
చంద్రః పురస్త్రీవదనే ఽలంబే॥"
—(ఉల్లా: 1 శ్లో: 10)

(ఎత్తైన మేడలపై కదలుచున్న ధ్వజముల కొనలపై గాలిచే కొట్టబడుచున్న చీనాంశుక ఖండములను దూరమునుండి చూచుచు, అకాలమునవచ్చిన 'కేతు'వేమో అని అనుమానించిన చంద్రుడు పురసుందరీమణుల ముఖములపై వ్రేలాడుచున్నాడు.)

—వంటి శ్లోకములు సరళసుందరముగా మనోజ్ఞాలంకారబంధురములుగ కనిపించును.

ఈ కావ్యము మధురభక్తిభరితమైనది. మధురభక్తి శృంగారమున అంతర్భవించునని పలువురు ఆలంకారికుల అభిప్రాయము. వసంతము శృంగారమునకు ఉద్దీపకము.

వసంతర్తు వర్ణనమున ఆచార్యులవారు ఆరామవృక్షముల సొబగును, పశుపక్ష్యాదుల ఉల్లాసమును మనోజ్ఞముగ వర్ణించిరి. ఈ వర్ణమున మూడు వచనములు, ఎనిమిది శ్లోకములు కలవు. ఇవియన్నియు శబ్దార్థాలంకారములతో విరాజిల్లుచున్నవి–

"వసన్తలక్ష్మీ చరణ ద్వయాంత
ర్లాక్షాను రక్తాయిత పుష్పగాత్రాః।
మహీరుహాః పల్లవితా వనాంతాన్
విభీషయంతీవ విభాన్తి కాంతాన్॥"
—(ఉల్లా: 2 శ్లో: 24)

(వసంతలక్ష్మియొక్క చరణయుగమునందలి లత్తుకచే ఎఱ్ఱబారిన పువ్వులుగల చిగురించిన వృక్షములు ప్రియులను భయపెట్టుచున్నట్లున్నవి.)

ఈ వర్ణనమున ఆచార్యులవారు కథను విస్మరింపక, ఈ వసంతము—"నితాంత రమాకాంతస్వాధీన స్వాంతరంగాం గోదాం నితరాం సంతాపయాంచకార" (ఉల్లా: 2 వచ: 23) అనియు, వర్ణనచివరలో "అనను భావ్యేన రూపేణ విరహేణ గోదాం సహసతిరోనాం నితరాం ప్రతారయామాస" (ఉల్లా: 2 వచ: 32) అనియు పేర్కొని సందర్భౌచిత్యమును పాటించిరి.

ద్వితీయోల్లాసముననే గోదా విరహవర్ణనమునకు పూర్వరంగముగ, వసంత వర్ణనమునకు పిమ్మట రాత్రివర్ణనము కూర్పబడినది. ఈ వర్ణనము సూర్యాస్తమయము మొదలు చంద్రోదయ పర్యంతము నాలుగు శ్లోకములు, ఆద్యంతములలో రెండు వచనములలో సాగినది. ఈ వర్ణనమందు—

"దినకర కిరణ ప్రభాతిరస్కృత దివాశిఖిశిఖః ప్రవాహప్రసూతాగ్ని ధూమరేఖా విధూమితం కిము" (ఉల్లా: 2 వచ: 33) వంటి మనోహరములగు భావములు గలవు.

పంచమోల్లాస ప్రారంభములో నాలుగు వచనములు, ఏడు శ్లోకములలో 'ప్రభాతము' వర్ణింపబడినది. ఇందలి వచనములు—

"అంబరతల మిదం – ఉదయగిరి రంజితర కటకతట నముదిత చటుల విహరమాణ కలభయూస కుంభోపమ కుంభస్థలస్థగిత గ్రావోపలక్ష్యమాణ రక్తసిందూర సిందురితాలంబ ఇవ కిమరుణితః" (ఉల్లా: 5 వచ: 1) వంటి ధారాళములగు రచనలో నొప్పుచున్నవి. శ్లోకములును మనోజ్ఞములగు భావములతో నొప్పును.—

> "ప్రాభాత సూర్యకిరణ ప్రభవాప్రభేయం
> పుష్పైర్ద్రుమైస్స్రుత పరాగ గణైరుపేతా।
> దిక్సుందరీ కుచయుగీ పరిరంభణాయ
> చ్ఛిత్రీకరోతి మకరీ రచనా తరంగే॥"
>
> —(ఉల్లా: 5 శ్లో. 8)

(వేకువజామున సూర్యుని కిరణముల నుండి వెలువడిన ఈ కాంతి, పూలనుండి రాలిన తెల్లని పుప్పొడిచే కూడినదై, దిక్కనెడు సుందరి యొక్క స్తనయుగమును కౌగలించుకొనుటకై, ఆ దిక్సుందరి శరీరమున మకరికాపత్రమును రచించుచున్నది.)

ఇట్టి శ్లోకములలో ప్రభాతమునకు మనోజ్ఞత్వమునే గాక—

"శ్రీనాథ వక్షఃస్థల వైజయన్తీ
మాలా సురభ్యంచిత దివ్యదేహః।
స్పర్శానుమేయో మలయానిలో౽యం
తదీయ సంశ్లిష్ట రసో౽నువాతి॥"

—(ఉల్లా: 5 శ్లో: 5)

(స్పర్శచే అనుభవింపబడు ఈ మలయానిలము శ్రీహరి వక్షఃస్థలముపైనగల వైజయంతీ మాలా సౌరభములచే కూడిన దివ్యపరిమళముగలదై; ఆ శ్రీహరి సంశ్లేషసుఖానుభూతితో కూడినదై వీచుచున్నది.)

—అని ప్రభాత వాయువులకు పవిత్రతను కూడ కవి సంతరించెను.

కావ్యనాయిక యగు గోదాదేవి బాల్యమును, యౌవనమును ప్రధమోల్లాసమున కవి వర్ణించెను. ఈ ఇతివృత్తమును గ్రహించిన ప్రాచీన కవులెవ్వరును గోదాదేవి బాల్యవర్ణనమును చేయలేదు. కాళిదాసమహాకవి రచించిన కుమార సంభవములోని పార్వతీదేవి బాల్య యౌవన వర్ణనములు ఆచార్యులవారిని ఈ వర్ణనలకు ప్రేరేపించి యుండవచ్చును. గోదాదేవి బాల్యము ఆయిదు శ్లోకములలో వర్ణింపబడినది. ఈ బాల్యవర్ణనలో—

"సమీప ముపసర్పితే హసతి యాతి చాక్రోశతి
క్షణాత్కృమితు మిచ్ఛతి ప్రబల భావ మన్విచ్ఛతి।
విలోలదలకావళిం కరయుగేః క్షిపన్తీసతీ
కరాగ్రమనుచుంబతి ప్రణయశీలయా లీలయా॥"

—(ఉల్లా. 1 శ్లో: 30)

(సమీపమునకు వెళ్లగా నవ్వును, దరిజేరును, ఆక్రోశించును. క్షణముననే పాటకు ప్రయత్నించును. జారుచున్న ముంగురులను చేతబట్టుకొనును. కరాగ్రమును ముద్దాడును.)

—ఇంటి మనోహరములగు స్వభావోక్తులేగాక—

"వసుంధరేయం నవరత్నగర్భే
త్యాహుః కవీంద్రా యది సత్యవాచః।
ముష్ట్యా గృహీత్వాపి రజాంసి తస్యాః
అనీక్షమాణాత్సముదక్షిపత్సా॥"

—(ఉల్లా: 1 శ్లో: 32)

భూమి "నవరత్నగర్భ"యని కవీంద్రులనుచున్నారు-ఒకవేళ అది సత్యమైనను, గోదాదేవి బాల్యావస్థచే ఆ భూమిలోనిమట్టిని చేతబట్టుకొనియు, వానినెరుగకపోవుటచే పారవైచుచున్నది.)

—వంటి చక్కని యుత్ప్రేక్షలును గలవు.

"విహరతి సఖీయుక్తా సంస్థాప్య కృత్రిమపుత్రికాః, వితరతి మధుక్షీరాపూపాన్నశాకఫలాని సా" (ఉల్లా: 1 శ్లో: 33) అనుచోట పోతన భాగవతములో రుక్మిణి బాల్యక్రీడావర్ణనమునగల-"పేర్వేర బొమ్మల పెండ్లిండ్లు సేయుచు, సఖులలతోడ వియ్యంబులందు; గుజ్జన గూళ్లను కొమరొప్ప వండించి చెలులకు బెట్టించు చెలువు మెరయ" అను భావమును స్ఫురింపజేయును.

యౌవన వర్ణనములో గోదాదేవికి యౌవన మావిర్భవించుటయు, సంపూర్ణయౌవనమున ఆమె సౌందర్యమును, ఇరువది శ్లోకములలో వర్ణింపబడినది. ఆమె యౌవనమును "పంకజనాభభోగ్యాం" (ఉల్లా: 1 శ్లో: 34) అనియు, "ముకుంద భోగ్యాం" (ఉల్లా: 1 శ్లో: 53) అనియు ఆచార్యులవారు ఆద్యంత శ్లోకములలో పేర్కొని ఆమె యౌవన పరమార్థమును స్పష్టపరచిరి.

గోదాదేవికి యౌవనమురాగా, కలిగిన మార్పులచే తనకిక నిలువస్థానములేదని కోపించి బాల్యము వెడలిపోయెనని కవి ఇట్లు వర్ణించెను—

"కౌటిల్యం చికురాన్తతోఽదరమణిర్మాంసం దృశౌ శోణతాం
న్నమత్వం వదనం సమున్నతమురో హాసం కపోలాగతా।
నిమ్నో నాభిరసౌ చ మధ్యమమిదం సూక్ష్మం పరిద్యోతతే
సంవాసో మమ కిం ను తైరితి రుషాయాతా దశా శైశవీ॥"

—(ఉల్లా: 1 శ్లో: 35)

గోదాదేవి యౌవనదశయందు అడుగిడినంతనే శిరోజములు కౌటిల్యమును పొందినవి. అధరములు మౌనమును దాల్చినవి. నేత్రములలో అరుణిమ అలముకొన్నది. ముఖము త్రపాభారముచే వంగినది. వక్షఃస్థలము సమున్నతమైనది. చెక్కిళ్లను హాసము పొందినది. నాభిలోతైనది. నడుము సన్నబడినది. ఇట్టి స్థితిని చూచి ఇక వీనితో సాహచర్య మెందులకని కోపించిన బాల్యదశ వెళ్లిపోయినది.)

గోదా యౌవనవర్ణనమిట్టి మనోహరములగు శ్లోకములతో కూడియున్నది. అయినను ఇందు గోదాదేవి సౌందర్యము సీమంతరేఖ మొదలు పాదనఖాంతముగ వర్ణింపబడినది. మానుషస్త్రీ వర్ణనము ఆచూడపాదముగను, దేవతాస్త్రీ వర్ణనము ఆపాదచూడముగను నుండుట సంప్రదాయము.[1] కాళిదాస మహాకవి పార్వతీదేవిని ఆపాదచూడముగనే వర్ణించెను. ఆచార్యులవారు ఇచట భూదేవ్యవతారమును, అయోనిజయు, ముకుంద భోగ్యయునగు గోదాదేవి సౌందర్యమును మానుషస్త్రీ సౌందర్యమును వర్ణించినట్లు ఆచూడనఖముగ వర్ణించుట సముచితముగ తోచదు.

ఆచార్యులవారు గోదాదేవి విరహమునందు ఆరు శ్లోకములలో చంద్రదూషణమును; ఏడు శ్లోకములలో మన్మథ దూషణమును; నాలుగు శ్లోకములలో వాయు దూషణమును గావించిరి. ఇది తెలుగు ప్రబంధముల ప్రభావమనవచ్చును. కాని ప్రబంధయుగములో వెలసిన శ్రీకృష్ణదేవరాయలు ఇదే ఇతివృత్తమును స్వీకరించియు, పరమపావనియు దివ్యయునగు గోదాదేవిచే ప్రబంధనాయికల చేతవలె చంద్రాది దూషణము చేయింపలేదు. సాధారణ కామినీ జనోచితమగు చంద్రదూషణాదికమును ఆచార్యులవారు గోదాదేవి పరముగ చేయుట అంత యుచితముగ తోచదు.

చంద్రదూషణములోని—

"దోషాకరో గురు వధూ గమనాద్యదాసీః
యాతో జటాంచ గిరిశస్య హాలాహలార్తః ॥
సత్వం కుయుష్టుతసి ధైర్య మపాకరిష్యః
రోచిష్ణు రర్దయసి మాం కిమపత్ర విష్ణుః॥"

—(ఉల్లా. 2 శ్లో: 40)

---

1. 'దేవతానాం రూపం పాదాంగుష్ఠప్రభృతి వర్ణ్యతే, మానుషాణాం కేశాదారభ్యేతి ధార్మికాః'–మల్లినాథసూరి వ్యాఖ్య; ('అభ్యున్నతాంగుష్ఠ'........శ్లోకావతారిక) కాళిదాసు–కుమారసంభవము: ప్రథమసర్గ శ్లో: 33 పుట: 29

(ఓ చంద్రుడా! నీవు గురుపత్నిని అనుగమించిన కారణమున దోషాకరుడ వైతివి. హాలాహలమునుకోరి శివుని శిరస్సునెక్కితివి. ఇట్లు విరహాతిశయముచే నా ధైర్యమును పోగొట్టుచున్న నీవు క్షమార్హుడవు కావు.)

—వంటి పెక్కు శ్లోకములలో భావలాలిత్యముగాని, చమత్కారముగాని మృగ్యము.

అయినను, వాయు దూషణమున గల—

"వక్షోజాంతర లంబినీం బిసలతాం వేణీం భుజంగాకృతిం
భీతో వీక్ష్యనదాగతిః ప్రతి తరుం ధావన్ న కుత్రస్థిరః।
రంధ్రాన్వేషణతత్పరో హి సుదతీపాదాబ్జశింజారవైః
ఆక్రోశన్నివ భాతి ఘాతుకజనాః ఏవం విషీదన్తి హి॥"

—(ఉల్లా: 2 శ్లో: 56)

(ఓ వాయూ! నీవు స్త్రీల వక్షోజములనడుమ వ్రేలాడుచున్న జడనుచూచి, సర్పముగా భ్రమించి, భీతిల్లి నిరంతరము పరుగులు దీయును చెట్టుచెట్టు నాశ్రయించుచు ఒకచోట నిలువలేకున్నావు. రంధ్రాన్వేషణతత్పరుడవై (తప్పులను వెదకు దుష్టస్వభావము గలవాడవై) తిరుగుచు, స్త్రీల కాలిమువ్వల సవ్వడులలోబడి అరచుచున్నట్లున్నావు. ఘాతుకులైనవారట్లే దుఃఖింతురు.)

—వంటి రెండు మూడు శ్లోకములు చక్కని భావచమత్కారములో కూడియున్నవి.

పంచమోల్లాసమున గోదా శ్రీరంగనాథుల పరిణయము వర్ణింపబడి కావ్యమును మంగళాంతము గావించుచున్నది. ఇంతకు పూర్వమే ద్వితీయోల్లాసమున స్వప్న పరిణయము వర్ణింపబడి యుండుటచే నిచట కల్యాణము సంక్షిప్తముగ వర్ణింపబడినది.

కల్యాణ మంటపము మూడు వచనములలో వర్ణింపబడి; శ్లేష, విరోధాభాసాద్యలంకారములచే నొప్పుచున్నది—

"యాహి కల్యాణమంటప శ్రీః, కావ్యసంపదివ సద్వృత్తాలంకారా, శబ్దార్థ రస వ్యంజకోద్దీపనోద్దీపితేవ భావనామయా, చాంద్రీకళాన్విత బుధానుగమ్యమానాపి విబుధ పదాధిరోహిణీ............" (ఉల్లా: 5 వచ: 82)

—వంటి వాక్యములు ఆచార్యులవారి పాండిత్యమును, రచనా చమత్కారమును ప్రదర్శించుచున్నవి.

ఇట్లే కావ్యములోని వర్ణనలు ఆచార్యులవారి గుణములను, లోపములను కూడ ప్రతిబింబించుచున్నవి.

# అలంకారములు

కావ్యమునకు శోభ కలిగించునట్టి అలంకారములను నిబంధించుట చిరంతనమగు కవిసంప్రదాయము. ఏ విషయమునైనను సుందరతరముగ తీర్చుటకు అలంకారములు ఆవశ్యకములు. సమష్టి కావ్యమునైగాక, ఆయా శ్లోకములలో వ్యష్టిగా కవి తన ప్రతిభను, కల్పనాచమత్కృతిని ప్రకటించుటకు అలంకారములు అవకాశమిచ్చును.

ఆచార్యులవారు సంస్కృతాంధ్ర సాహిత్యమును చక్కగా చదివినవారు. ఈ ఆలంకారిక సంప్రదాయములను వారు ఆకళించుకొనిరి. ఆయన కావ్యములో మనోహరములగు అలంకార విచిత్రములు పెక్కుగలవు. అవి దిఙ్మాత్రముగ ఈ వ్యాసమున నిరూపింపబడుచున్నవి...

అలంకారములలో అగ్రిమమైనది ఉపమాలంకారము. అది అనేకాలంకారములకు మూలభూతమైనది. కవిలో చమత్కార కల్పనాదృష్టి పెరిగినకొలది ఉపమాలంకారములు వెనుకబడి, తక్కిన యలంకారములు ప్రచురములగును. అయినను, విషయమును రమ్యముగా, సూటిగా చెప్పవలసినచోట ఉపమాలంకారమే శరణ్యము. కావుననే ఉపమాలంకారము కవి భావనాపటిమకు నికషోపలమైనది. ఆచార్యులవారు తమ కావ్యమున కొన్ని మనోహరములగు ఉపమాలంకారములను ప్రయోగించిరి. మచ్చునకు ఒకటి రెండు చూడదగియున్నవి—

వర్ష మోల్లాసమున విష్ణుచిత్తునకు పూదోటలో ప్రత్యక్షమైన విష్ణువును ఆచార్యులవారిట్లు వర్ణించిరి—

"శ్రీ విష్ణుచిత్త కృపయాకు రయం దయాళుః
బాలావిలోకనకలాస్పృహయాకు రీశః॥
అమ్లాన కోమల మనోజ్ఞపదైకయాశుః
రత్నోజ్జ్వల స్ఫురిత మేఘ ఇవావిరాసీత్॥"

—(ఉల్లా. 1 శ్లో: 22)

(ఈశ్వరుడు దయాళువు, విష్ణుచిత్తునిపై కృపసేయనిచ్చగలవా… దర్శన చూచుటయను కళయందు ఈప్సితుడు. సుకుమారసుందరమైన వటప… శయనించువాడునగు విష్ణువు రత్నోపలస్ఫురితమేఘమువలె ప్రత్యక్షమయ్యెను.)

ఈ శ్లోకమున కవి విష్ణువును 'రత్నోపలస్ఫురితమేఘము'తో ఉపమించెను. నీలవర్ణుడగు విష్ణువును మేఘముతో పోల్చుట సంప్రదాయసిద్ధమే కాని, 'రత్నోపలస్ఫురితమేఘ' మనుటలో ఆచార్యులవారి కల్పనా సామర్థ్యము వ్యక్తమగుచున్నది.

ద్వితీయోల్లాసమున గోదాదేవి తండ్రియగు విష్ణుచిత్తునితో తన మనస్సు హరినే ఆశ్రయించినదని ఇట్లు పలికెను—

"యథా వృక్షం మార్గమాణా లతేవ
శ్రితేయం మే శ్రీనిధౌ చిత్తవృత్తిః ॥
యథాఽనన్యా భానునా తత్ప్రభేవ
తథాఽహం స్యాం నాయకేన ప్రతీతా ॥"

—(ఉల్లా 2 శ్లో. [illegible])

వృక్షమును వెదకు తీగవలె నా మనస్సు శ్రీహరిని కోరుచున్నది. సూర్యకాంతి సూర్యుని వీడియుండనట్లు నేనా శ్రీహరితో కూడియే యుందును.)

'వృక్షమును వెదకు తీగవలె నా చిత్తవృత్తి శ్రీహరియందే చేరియున్న' దను పూర్వార్థములో గోదాచిత్తవృత్తి శ్రీహరియందు చేరుట ఉపమేయము. లతవృక్షము నాశ్రయించుట ఉపమానము. వృక్షాశ్రయములేని లత శోభింపదు. అట్లే విష్ణువును చేరని తన హృదయమునకును సార్థకత లేదు. కావున అది అపరిహార్యమను భావమిందు రమ్యముగా చెప్పబడినది. వృక్షశబ్దము పుంలింగము. లతాశబ్దము స్త్రీ లింగము. నాయికానాయకుల సంబంధమును తెలుపుటకిది చక్కని యుపమానము. ఉత్తరార్థమున, సూర్యునితో సూర్యకాంతి ఎట్లు భిన్నము కాదో, తానునట్లే తన నాయకునకభిన్నురాలనని గోదాదేవి ప్రకటించెను. ఈ ఉపమానమే సీతారాముల అనుబంధవిషయమున వాల్మీకి ఉపయోగించెను. అదే యుపమానము ప్రపన్నామృతమున గూడ గోదా శ్రీరంగనాథుల విషయమున ప్రయోగింపబడినది. ఆచార్యులవారీ యుపమానమును స్వీకరించుటలో సంప్రదాయమర్మజ్ఞతను, శాస్త్రీయకదృష్టిని చక్కగా ప్రకటించిరి.

ఇట్టి మనోహరములగు ఉపమానములు ఆచార్యులవారి రచనలో ఓరిమిగ కనిపించును.

ఉపమాలంకారము తరువాత భరతముని పేర్కొనినది—రూపకాలంకారము. గోదాదేవి నాసికను కవి—

"సౌందర్యాబ్ధేః కిము పరిష్కృతా వీచికా సేతుమాలా
కారుణ్యశ్రీకర పరిలసత్పద్మకింజల్కవల్లీ"
—(ఉల్లా: 1 శ్లో: 42)

(గోదాదేవి నాసిక సౌందర్యసాగరమున నిర్మించిన సేతుమాలయాఏమి? కారుణ్యలక్ష్మి కరమున విలసిల్లు పద్మకింజల్కవల్లియా ఏమి?)

—అని వర్ణించెను. ఇందు మొదటి పాదమున సౌందర్యము అబ్ధిగను, నాసిక సేతువుగను, ఆరోపింపబడినది. రెండవ పాదమున కారుణ్యము శ్రీదేవిగను; నాసిక ఆదేవి కరమునను్న పద్మముయొక్క కింజల్కవల్లిగను ఆరోపింపబడెను. ఇట్లు నాసికను సౌందర్యసాగరమునకు సేతువుగా చెప్పుట వినూత్నభావము.

కవి యూహావిహారమున కాలవాలమైనది యుత్ప్రేక్ష. ఈ కావ్యములో పెక్కు మనోహరములగు ఉత్ప్రేక్షలు గలవు.

గోదాదేవి సీమంతసిందూరరేఖను కవి ఇట్లు వర్ణించెను—

"హరేర్విభూతిద్వయ భాగ్యరేఖా
కృతాఽద్వితీయా చతురాననేన।
ఇతి స్మ గోదా శిరసి వ్యరాజత్
సీమంత సిందూర మనోజ్ఞరేఖా॥"
—(ఉల్లా: 1 శ్లో: 36)

(శ్రీహరియొక్క నిత్య లీలా విభూతిద్వయముచే కూడిన భాగ్యరేఖ బ్రహ్మచే అద్వితీయగా చేయబడినదా అన్నట్లుగ గోదాదేవి శిరముపైనున్న సీమంతసిందూర మనోజ్ఞరేఖ అలరారుచున్నది.)

బ్రహ్మదేవుడు విష్ణువుయొక్క నిత్యవిభూతిని, లీలావిభూతిని, ఒకటిగా చేసెనా యనునట్లు గోదాదేవి శిరస్సున సీమంతసిందూరరేఖ మనోజ్ఞముగా ప్రకాశించినది. ఈ యుత్ప్రేక్ష తాత్త్విక దృష్టిగల కవికి మాత్రమే భాసించును. ఈ కల్పనము

గోదాదేవి పావనతయు, ఆమెకు శ్రీమన్నారాయణుని విభూతిద్వయములోగల జన్మాంతరీయ సంబంధమునుగూర వ్యక్తపరచును. ఇచట వస్తువుకాని దానిని వస్తువుగ చెప్పుటచే వస్తూత్ప్రేక్ష.

ద్వితీయోల్లాసములోని రాత్రి వర్ణనమున —

"దినకరకిరణ ప్రభా తిరస్కృత దివాభీత తమః ప్రభావ
ప్రసూతాగ్ని ధూమరేఖా విధూమితం కిము"
—(ఉల్లా: 2 వచ: 33)

"సూర్యకిరణములచే తిరస్కరింపబడిన గుడ్లగూబల తపః ప్రభావమున జనించిన అగ్నియొక్క ధూమరేఖచే పొగచూరినదా ఏమి" అనునట్లు ఆకాశము వినీలితమైనది. ఇచట ఆకాశము వినీలితమగుటకు హేతువు ఘూకముల తపోగ్ని ధూమరేఖ కాకున్నను అట్లు వర్ణింపబడినది. కనుక ఇది హేతూత్ప్రేక్ష.

విరహతప్తయగు గోదాదేవి చంద్రుని ఇట్లు దూషించెను—

"క్షీరాబ్ధిస్తే జనన వసనం సోదరీతే రమాఽభూత్
పద్మాకాన్తస్తవ చ భవితా భావుకస్త్వం గరీయాన్।
తత్రాపి త్వం నిశిచరవశాన్నీచ భావం గతోఽభూః
కే వా రుంధ్యుర్గతి పతితం కర్మభిః ప్రాప్తదోషమ్॥"
—(ఉల్లా: 2 శ్లో: 41)

(ఓ చంద్రుడా! నీవు క్షీరసాగరమున బుట్టితివి. లక్ష్మీదేవి నీ సోదరి. శ్రీహరి నీకు బావయగును. ఇట్లు నీవు గొప్పవాడవైనను రాత్రులందు చరించుట అను కారణముచే నీచభావమును పొందితివి. కర్మలచే పతితుడైనవాని నెవరాపగలరు?)

ఈ శ్లోకమున అభిజాత్యము, సర్వోత్తముల బాంధవ్యము కలిగియు చంద్రుడు నిశిచరవశమున నీచభావమును పొందెనను విశేషవిషయము, లోకమున పాపకర్మలచే పతితుడైనవాని నెవరాపగలరు? అను సామాన్యార్థముచే సమర్థింపబడినది కావున అర్థాంతరన్యాసాలంకారము.

ఆచార్యులవారు శాబ్దిక చమత్కారములపట్ల కొంత ఆసక్తిని కనబరచిరి. కావుననే ఆయన రచనలో పెక్కు శ్లేషలు, ముద్రాలంకారములు కన్పించును.

శ్రీ విల్లిబుత్తూరు వర్ణనమున ఆచార్యులవారు—"వసన్త లక్ష్మీ ప్రచేవ సముపాశ్రిత మాధవవిలాసా........"(ఉల్లా: 1 వచ: 7) ఇత్యాదిగా వర్ణించిరి. శ్రీ విల్లిబుత్తూరులో వటపత్రశాయియగు మాధవుడు నెలకొని యుండుటచే ఆ పురము 'సముపాశ్రిత మాధవవిలాస' అయినది. వసన్తలక్ష్మి పక్షమున—మాధవుని అనగా ఋతురాజగు వసంతుని ఆశ్రయించిన విలాసముగలది. ఇచట మాధవుడనగా వసంతుడు. ఇట్లు మాధవశబ్దము ప్రకృతమగు విల్లిబుత్తూరుపక్షమునను, అప్రకృతమగు వసంతుని పరముగను కూడ అన్వయించుచున్నది. కావున ఇది ప్రకృతాప్రకృతశ్లేష.

ఉద్యానవనమున శ్రీహరి తన నేత్రపటమును తొలగించి తన్ను కౌగిట ఆదరించిన వృత్తాంతమును గోదాదేవి చెలులకు వర్ణించు సందర్భమున ఆచార్యులవారు—

"దేవదేవీవ సముపాశ్రిత విప్రనారాయణా........రాధికేవ మాధవారాధికా, ప్రావృడ్వలాహక మండలేవ సముల్లసిత పయోధర మండలా........నిత్యసూరిమాలికేవ సదాపశ్యన్తీ" అని వర్ణించిరి. (ఉల్లా: 4 వచ: 53)

ఇందు సముపాశ్రిత విప్రనారాయణా, మాధవ, పయోధర, సదాపశ్యన్తీ శబ్దములలోని శ్లేషమనోహరమై ప్రకృతాప్రకృతములకు అన్వయించుచున్నది.

ఆచార్యులవారు ముద్రాలంకారమును ఈ కావ్యమున ప్రచురముగ ప్రయోగించిరి. "ప్రకృతార్థపరములగు పదములతో సూచ్యార్థ సూచనము చేయుట" ముద్రాలంకారము.

శ్రీ విల్లిబుత్తూరు వర్ణనమున ఆచార్యులవారు—

"మందాక్రాంతా విషయరహితా భాతి దస్పీ షరీ సా"

—(ఉల్లా: 1 శ్లో: 11)

అని వర్ణించిరి. ఇచట'మందాక్రాంత'యను శబ్దము పాపనగరి కన్వయించుటయే గాక, ఇది 'మందాక్రాంతా' వృత్తనామమును సూచించుచున్నది. అట్లే ద్వితీయోల్లాసమున—కుమార్తె వివాహమును గూర్చి చింతించుచు విష్ణుచిత్తుడామెను చేరి పలికిన సందర్భమున ఆచార్యులవారు—

"ఇత్థం విలోక్య తనయాం వినయాభిరామాం
రామామివాశ్రిత-ముకుంద పదారవిందామ్।
నందన్ముకుందతనయో నిజనందనాంత
క్షోణీ వసంతతిలకామివ తామువాచ॥"

—(ఉల్లా: 2 శ్లో: 1)

(వినయాభిరామయును, ఆశ్రయింపబడిన ముకుందుని పదారవిందములుగల లక్ష్మివంటి సౌందర్యరాశియును, తన ఇల్లనెడి నందనవనప్రాంతమునందలి వసంతకాల తిలకవృక్షమును అగు కుమార్తెనుచూచి సంతోషాంతరంగుడైన ఆ ముకుంద తనయుడగు విష్ణుచిత్తుడు ఆమెతో ఇట్లు పలికెను.)

—అని చెప్పిరి. ఇచట 'వసంతతిలకా' శబ్దము గోదాదేవికి ఉపమానముగ ప్రకృతార్థమున అన్వయించుచు 'వసంతతిలకా' వృత్తనామమును సూచించుచున్నది.

ఇట్లే ఆచార్యులవారు ఇతరత్ర 'మాలిని' 'ద్రుత విలంబితము' అను వృత్త నామములను కూడ ముద్రాలంకారముచే సూచించిరి.

కవి సమయసిద్ధమగు సాదృశ్యముచే ఒక వస్తువును మరియొక వస్తువుగా భ్రమించుట "భ్రాంతిమదలంకారము." గోదా విరహవర్ణనములోని వాయుదూషణమున కవి—

"పక్షోజాంతరలంబినీం బిసలతాం వేణీం భుజంగాకృతిం
భీతోవీక్ష్య సదాగతిః ప్రతితరుం ధావన్ న కుత్రస్థితః॥"

— (ఉల్లా 2 శ్లో: 56)

—అని వర్ణించెను. ఇచట వాయువు వేణిని సర్పముగా భ్రమించి చెట్టువెంట పరుగెత్తినటు చెప్పుట భ్రాంతిమదలంకారము. వాయువు వృక్షములవెంట పరుగెత్తుటకు కారణము ఈ భయము కాకపోయినను, కారణముగ వర్ణింపబడినది కనుక ఇది ఉత్ప్రేక్ష. ఇచట ఈ రెండలంకారములు పరస్పర సాపేక్షములు గనుక వీనికి సాంకర్యము.

శ్రీ విల్లిబుత్తూరు పురముయొక్క ఘనతను కవి ఇట్లు వర్ణించెను—

"యూపోచ్ఛ్రాయః కథయతి మహాయజ్ఞకృద్భాగధేయం
వేదాభ్యాసః చిదచిదయస్ప్రక్రియాం వక్త్రభోగ్యామ్।
వీరాలాపః ప్రచలతి కథాశేషితాన్యప్రతాపం
మందాక్రాంతావిషయ రహితా భాతి ధన్వీపురీ సా॥"

—(ఉల్లా: 1 శ్లో: 11)

(యూపస్తంభముల ఆధిక్యము మహాయజ్ఞములను చేయువారి సంపదను చెప్పు చున్నది. వేదాఖ్యానము చిరచిత్తత్త్వము యొక్క మార్గమును బోధించుచున్నది. పిరాలాపము శత్రుప్రతాపమును కథలో మాత్రమే మిగులునట్లు చేసి, కొనసాగుచున్నది. ఇట్లా పట్టణము; మందులచే (సోమరులచే) ఆక్రమింపబడినదను విషయమునకు తావులేనిదై విరాజిల్లుచున్నది.)

ఇందు సమృద్ధి వర్ణింపబడుటచే ఉదాత్తాలంకారము గలదు.

ఇట్టి కల్పనాచమత్కారముగల యలంకారములనేగాక, ఆచార్యులవారు వర్ణ్య వస్తువును యథాతథముగ స్వభావోక్తి మధురముగ వర్ణించుట యందును నేర్పును ప్రకటించిరి.

గోదాదేవి బాల్యలీలను ఆచార్యులవారిట్లు వర్ణించిరి—

"సమీపముపసర్పితే హసతి యాతి చాక్రోశతి
క్షణాత్కృమితు మిచ్ఛతి ప్రబలభావ మన్విచ్ఛతి।
విలోలదలకాపశిం కరయుగేః క్షిపన్తీ సతీ
కరాగ్రమనుచుంబతి ప్రణయశీలయా లీలయా॥"

(ఉల్లా: 1 శ్లో: 30)

—ఈ శ్లోకమున గోదాదేవి బాల్యచేష్టలు సహజసుందరముగా వర్ణింపబడినవి.

ఇట్లీ వ్యాసమున సమన్వయింపబడినవేకాక, ఇంకను విరోధాభాసము, కావ్య లింగము, అతిశయోక్తి మున్నగు అలంకారములను కవి ఈ కావ్యమున కూర్చెను.

అర్థాలంకారములనేగాక, శబ్దాలంకారములను కూడ ఆచార్యులవారు చక్కగా ఉపయోగించిరి.

గోదా విరహవర్ణనమున కవి—

"ఏషమకాండకాండవిత ప్రచండమార్తాండమండలేనేవ అఖండదోర్దండ మండిత పాండిత్యవైతవేన వధూమండలం నిజమండనే ఖండయతి" (ఉల్లా: 2 పద: 57) అని బిందుపూర్వక దకారపునరావృత్తిచే చక్కని వృత్త్యనుప్రాసనుకూర్చెను.

గోదావిరహవర్ణనముననే వాయుదూషణమున కవి—

"సంతానయిష్యన్ సకలర్తుపుష్పం
పుష్పేషు గీతిం దిశి తానయిష్యన్।
దిగంతకాంతాప్రణయం నయిష్యన్
వాయుర్వవౌ మాం ప్రతికూలయిష్యన్॥"
—(ఉల్లా: 2 శ్లో: 55)

(సకలర్తు పుష్పములను పూయించుచు, పువ్వులపై వ్రాలు తుమ్మెదల కమ్మని పాటలను దిక్కులందు వినిపించుచు, దిగంతకాంతల ప్రణయ సందేశమును తీర్చుచు, నన్ను ప్రతికూలింపజేయుచు వాయువు వీచుచున్నది.) అని చక్కని అంత్యానుప్రాసను ప్రయోగించెను.

గోదాదేవి, స్వప్నమున తన్ను శ్రీరంగనాథుడు వివాహమాడిన వృత్తాంతమును చెలికత్తెలకు చెప్పుచు ఆ స్వామినిట్లు వర్ణించెను—

"కశ్చన యువా కుమారః–కుమారికాపతమాల శ్యామల కోమల విపుల శరీరః; శరీరాంతర విద్యోతమానమణికిరీట ప్రభాప్రకాశిత పారమ్యవిద్యోతిత దిగంతరాళః; దిగంతరాళ సముపగతసమదమదగజ సహస్రజ శ్వేతచ్ఛత్రలేఖావగమ్యమానః–మాననీయ విరహిణీమృత్యుద్యోయాపథప్రపల్లితకోల్లాస విలాసిత మాతృశకునీనాలాప భాసురః–భాసురగంధ హస్తీవ మందగమనః". –(ఉల్లా: 2 పు. 76)

ఇచట పూర్వవాక్యములోని అంత్యపదమునే అనంతర వాక్యారంభమున మరల గ్రహించుటచే 'ముక్తపదగ్రస్తము'.

బంధకవిత్వమును లాక్షణికులు చిత్రాలంకారముగ పరిగణించిరి. ఆయా ఆకృతులలో పద్యము ఇముడుటకు అనువుగా కొన్ని వర్ణములు నియతస్థానములలో పునరావృత్తములగుట బంధకవిత్వమున కన్పించును. ఆయా బంధముల ఆకృతిని బట్టి వానికాయా పేర్లుంచబడినవి. ఆచార్యులవారు ఈ కావ్యమును ఆరంభించుటకు పూర్వమే గోదాస్తుతి పరమగు ఒక పుష్పమాలికాబంధమును చంపకమాలావృత్తమునను, కవి గ్రంథనామాంకితముగ ఒక చక్రబంధమును శార్దూల విక్రీడిత వృత్తమునను కూర్చిరి.

పుష్పమాలికా బంధమును 'చంపకమాల'లో కూర్చినపుడు—

పద్యములోని నాలుగు పాదములలోను మొత్తము 84 అక్షరములుండును. పద్యములోని ప్రతి ఏడక్షరములను ఒక పుష్పముగా భావించినచో పాదమునకు మూడు పుష్పముల చొప్పున మొత్తము పద్యమున పన్నెండు పుష్పములగును. ప్రతి పుష్పములోని రెండవ అక్షరమే నాలుగవదిగను, ఆరవదిగను కూడ ఆవృత్తమగును. ప్రతి పుష్పము కూర్పులోను రెండునుండి ఆరువరకుగల అక్షరములు పుష్పముగాగా, ఒకటవ, ఏడవ అక్షరములు దానికిరువైపులనున్న దారములోని భాగములు.

పుష్పమునకు-పుష్పమునకు నడుమ వ్యవధానముగ ఇట్లు పూర్వ పుష్పపు కూర్పులోని చివరి వర్ణము, తరువాతి వర్ణము-వెరసి రెండక్షరముల వ్యవధానమేర్పడును.

ఆచార్యులవారు దీనికి లక్ష్యముగ ఈ క్రింది శ్లోకమును రచించిరి—

1 2 3 4 5 6 7 8 9 10 11 12 13 14 15 16 17 18 19 20 21
"ము ర హ ర సా ర సో క్తి ప ర ప ద్మ ప రా ర్పి త జా త శీ త లా

22 23 24 25 26 27 28 29 30 31 32 33 34 35 36 37 38 39 40 41 42
క ర ప ర సా ర పు ష్ప ప రి ప క్వ ప వి త్ర ర సే ర మా ర మే।

43 44 45 46 47 48 49 50 51 52 53 54 55 56 57 58 59 60 61 62 63
కు రు క రు ణా రు ణా క్షి ము ఖి ము క్త ము కుం ద ప దే ప రే ప భూ

64 65 66 67 68 69 70 71 72 73 74 75 76 77 78 79 80 81 82 83 84
సు ర ప ర పీ ర పు త్రి ప ర ప త్ని న య ప్ర ద ప్ర త్న ప్ర వ్య దే॥"

ఈ శ్లోకమున బంధమును నిబంధించుటకై ఆచార్యులవారు పెక్కు వ్యర్థ పదములను ప్రయోగింపవలసి వచ్చినది. అంతేగాక, చివరిపాదమున 'ప్రత్న' లోని 'ప్ర'కు ముందుగల 'ద' వర్ణమును; 'ప్రవ్య'లోని 'ప్ర'కు ముందున్న 'త్న' అనునదియు, సంయుక్తాక్షరమునకు ముందున్నవగుటచే గురువులు కావలసివచ్చును. 'ప్ర' పరమైనపుడు పూర్వవర్ణములకు గురుత్వము వైకల్పికముగ కొందరు భావించిరి. దానినిట అనుసంధించుకొనవలసి యుండును. లేనిచో గణభంగమగును. అయినను శ్లోకమున బంధలక్షణము తప్పినది. తొమ్మిదవ, పదకొండవ పుష్పమున వర్ణ పునరావృత్తి లక్షణానుగుణముగలేదు. ఆ కారణముచేతనే తొమ్మిది, పది పుష్పముల నడుమ మూడక్షరముల వ్యవధానము; పన్నెండవ పుష్పము తరువాత రెండక్షరములు వచ్చినవి.

మూడవ పాదములోని చివరి ఏడు వర్ణములు 'దపదేపరేపభూ' అను వానిలో రెండు, నాలుగు స్థానములలో 'ప' వర్ణము రాగా, ఆరవది 'ప'అని వచ్చినది. నాలుగవ పాదములో రెండవ వర్ణ సప్తకములోని రెండు, నాలుగు స్థానములలో 'ప' వర్ణము వచ్చినది కాని, ఆరవస్థానములో రాలేదు. ఆ కారణముచేత చివరి పుష్పము చివరి వర్ణ సప్తకముగాక వర్ణాష్టకములో ఏర్పడి, చివరకు రెండు వర్ణములు మిగిలినవి. ఇట్లీ శ్లోకము బంధలక్షణమున కనుకూలముగ లేదు.

ఆచార్యులవారు గ్రంథారంభమున రచించిన పుష్పమాలికాబంధముయొక్క స్వరూపమును స్పష్టతకై ప్రక్కపుటలో ప్రదర్శించుచున్నాను—

దీని తరువాత ఆచార్యుల వారొక "చక్రబంధము"ను శార్దూలవిక్రీడిత వృత్తమున కూర్చిరి. దీని లక్షణమును ప్రతాపరుద్రీయవ్యాఖ్యానమగు 'రత్నాపణ' మున కుమారస్వామి సోమపీథి ఇట్లు పేర్కొనెను—

"లిఖ్యతే షడరం చక్రం ప్రత్యరం తన్నవాక్షరమ్।
త్రయాణామపి పాదానాం దశమం కర్ణికాక్షరమ్॥
ఆదితస్త్వంత్యతుర్యార్ణై స్త్రయః పాదాశ్చతుర్థగాః॥
వర్ణాష్టాంత్యమారభ్యనంవరంతేంతిమాక్షరైః॥
మధ్యే ద్వ్యద్వ్యవిసంవాదా షడరేషు క్రమాద్భవేత్।
చతుర్థైస్సప్తమైర్వర్ణైర్వర్ణనం కవికావ్యయోః॥"[1]

ఈ బంధము శార్దూలము మున్నగు 19వ ఛందములోని సముచిత వృత్తమున కూర్చబడును. తొలి మూడుపాదములలోని పదియవవర్ణము—అనగా పదవ వర్ణము సమానముగ నుండును. ఇది కర్ణికాక్షరము. మూడవ పాదము చివరి అక్షరమే నాలుగవ పాదము ఆరంభమున నుండును. తరువాత రెండేసి అక్షరముల వ్యవధానములో 1, 2, 3 పాదముల ఆద్యక్షరములు అంత్యాక్షరములు నాలుగవ పాదమున ఆవృత్తి నొందును. కర్ణికనుండి ప్రత్యక్షరములోని నాలుగవ, ఏడవ వర్ణములు కవి గ్రంథనామాంకితములుగ నుండును. ఆచార్యులవారు ఈ బంధమున కూర్చిన శ్లోకమిది—

"అవ్యాద్దాశ్రిత సత్యరత్నమహితా మోహప్రదా మానసా
లక్ష్మీముగ్ధహరస్వరూప మహిజా కృష్ణానుమాల్యప్రదా।
విద్యుక్త ప్రియసింధురాజగమన ప్రీతిస్పదా మోదదా
దామశ్రీరనుపాలనీయవిభవా మాధుర్యదా మోదదా॥"

ఆచార్యులవారి కావ్యమునందు ముద్రింపబడిన ఈ శ్లోకముయొక్క బంధ స్వరూపమిది—

1 కుమారస్వామి సోమపీథి—'రత్నాపణ' వ్యాఖ్య.
—ప్రతాపరుద్రీయమ్: శబ్దాలంకారప్రకరణమ్: పుట. 297

# చక్రబంధము



(ముద్రితప్రతిలోనిది)

లక్షణానుసారముగ మూడు పాదములలోని 3వ అక్షరములను, 17వ అక్షరములను వరుసగా వ్రాసినచో కావ్యనామము—

"ఆముక్తమాల్యదా"

అనియు; ఆరవ; పదునాలుగవ అక్షరములను వరుసగా వ్రాసినచో కవి నామాంకితముగ—

"వరసింహకృతిః'

అనియు రావలెను.

ఆచార్యులవారు ఉద్దేశించినదికూడ అదియే కాని, రెండవ పాదమున పదునాల్గవ అక్షరముగా రావలసిన 'కృ' పదమూడవ అక్షరముగనే వచ్చి బంధలక్షణము తప్పినది. మూడవపాదమున కర్ణికాక్షరమే కుదురలేదు. పై రెండు పాదములలో కర్ణికాక్షరముగనున్న 'మ' వర్ణము ఈ పాదమున 11వ అక్షరమైనది. అందుచే తక్కిన వర్ణములుకూడ "కర్ణిక" నుండి గణించినపుడు ఆయా నిర్దిష్టస్థానములందు రాలేదు. కాని, మూడు, ఆరు, పదునాలుగు, పదిహేడు స్థానములలో మాత్రము ఒదిగినవి. రెండవపాదమున "మహిజా శ్రీకృష్ణమాల్యప్రదా" అనియు, మూడవ పాదమున—"సింధురాగ్నమున సంప్రీతిస్సదా మోదదా" అనియు ఉండినచో బంధము చక్కగా పద్యమున సమన్వయమగును. బహుశః ఇది ముద్రణ దోషమో; వ్రాతప్రతిలోని దోషమో కావచ్చును.

ఇట్లు ఆచార్యులవారు ఈ కావ్యకన్యను శబ్దాలంకారములలో చక్కగ శోభింపజేసిరి.



ఈ 'చక్రబంధము' ఈ క్రిందివిధముగనున్నచో
లక్షణముతో సమన్వయమగును-



(సవరించినది)

# ఛందోవైవిధ్యము

ఆచార్యులవారి కావ్యములో కూర్చిన మొత్తము శ్లోకముల సంఖ్య: 257. ఇందు కావ్యారంభమునకు ముందు గోదాస్తుత్యాత్మకముగ పుష్పమాలికాబంధమున కూర్పబడిన నొక చంపకమాలయు; కవి, గ్రంథ నామాంకితముగ చక్రబంధమున నిబంధింపబడిన ఒక శార్దూలవిక్రీడితమును చేరియున్నవి.[1] ఇవియేగాక పూర్వాచార్యులు చెప్పిన మంగళాశాసన శ్లోకమగు "స్వోచ్ఛిష్ట మాలికాబంధ........"ఇత్యాది శ్లోకముకూడ అదనముగ నున్నది.

ఆచార్యులవారి కావ్యమున శిఖరిణి, వసంతతిలక, శార్దూల విక్రీడితము మున్నగు ప్రసిద్ధ వృత్తములనేగాక, ఆఖ్యానకి, శాలిని, నర్కుటకము, సుందరి మున్నగు అరుదైన ఛందములనుకూడ ప్రయోగించిరి. ఈ కావ్యములో మొత్తముమీద 21 ఛందోభేదములు కలవు. రెండు వృత్తములను మాత్రము నేను ఇదమిత్థములని నిర్ధయింపలేకపోయితిని. ఈ వృత్తములుగల శ్లోకములివి—

"యథా వృక్షం మార్గమాణా లతేవ
శ్రితేయం మే శ్రీనిధౌ చిత్తవృత్తిః।
యథాऽనన్యా భానునా తత్ప్రభేవ
తథా హం స్యాం నాయకేన ప్రతీతాః"

—(ఉల్లా: 2 శ్లో: 6)

"అష్టాక్షరీం కామయన్తీ త్రివద్యా
ద్వివద్యా సా షట్పదీ కృత్యవాచా।
చతుర్వింశత్యాయా పంచపద్యా
రమాంకాంతం మాలయా పూజయత్తమ్॥"

—(ఉల్లా: 8 శ్లో: 2)

1. ఇవి ఈ వ్యాసాంతములోని పట్టికలో ప్రతిమోల్లాసశ్లోకములుగ చూపబడినవి.

ఏనిలో మొదటి శ్లోకమున "య త త గ గ" అను గణములు వచ్చినవి. కాని రెండవ శ్లోకములోని ప్రథమ పాదమున మొదటి గణము "త" గణమైనది. ఇది మాత్రాచ్ఛందమో లేక, పై పాదమున ఆచార్యులవారు ఛందోభంగము చేసిరో నిశ్చయించుటకు నాకు తగిన ఆధారములు లభింపలేదు.

సర్గాంతములలో ఛందో వైవిధ్యమును ప్రకటించుట సంస్కృత కావ్యములలో నియతముగ కన్పించును. ఈ కావ్యమున అట్టి సంప్రదాయము కనిపింపదు. ఆయా రససందర్భానుగుణముగ ఆయా వృత్తములను ప్రయోగింపవలెనను నియమము భరతాదులచే నిర్దేశింపబడినది. దానిని పాటించినవారు అరుదు. ఆచార్యులవారుకూడ అట్టి నియమమును పాటింపలేదు.

ఈ కావ్యములో ఏయే ఉల్లాసములో ఏయే వృత్తమెన్ని పర్యాయములు ప్రయుక్తమైనవో తెలుపు పట్టిక ఈ వ్యాసానుబంధముగ నీయబడుచున్నది.



| క్ర. సం. | ఛందోభేదము | ఉల్లాసములు | | | | | మొత్తము |
|---|---|---|---|---|---|---|---|
| | | i | ii | iii | iv | v | |
| 1 | శిఖరిణి | 2 | 2 | 10 | 18 | 11 | 43 |
| 2 | వసంతతిలక | 13 | 9 | 5 | 2 | 7 | 36 |
| 3 | శార్దూలవిక్రీడితము | 5 | 13 | - | 3 | 5 | 26 |
| 4 | హరిణి | 2 | 5 | 7 | 5 | 3 | 22 |
| 5 | మాలిని | 1 | 4 | 3 | 6 | 5 | 19 |
| 6 | మందాక్రాంత | 7 | 5 | 1 | - | 3 | 16 |
| 7 | పృథ్వి | 4 | 1 | 2 | 1 | 4 | 12 |
| 8 | ద్రుతవిలంబితము | 1 | 4 | 1 | - | 6 | 12 |
| 9 | ఉపేంద్రవజ్ర | 2 | 2 | 6 | - | 1 | 11 |
| 10 | ఆర్య | 1 | 2 | - | 3 | 4 | 10 |
| 11 | ఉపజాతి | 4 | - | 2 | - | 3 | 9 |
| 12 | శాలిని | - | 1 | 3 | 1 | 3 | 8 |
| 13 | ఇంద్రవజ్ర | 3 | 1 | 2 | 1 | - | 7 |
| 14 | మంజుభాషిణి | 2 | 1 | 1 | - | 1 | 5 |
| 15 | వంశస్థము | 1 | 2 | - | 2 | - | 5 |
| 16 | నర్కుటకము | - | - | - | - | 4 | 4 |
| 17 | స్రగ్ధర | 1 | 2 | - | - | - | 3 |
| 18 | అనుష్టుప్ | 1 | - | - | - | 1 | 2 |
| 19 | ఆఖ్యానకి | - | 2 | - | - | - | 2 |
| 20 | సుందరి | - | - | - | - | 2 | 2 |
| 21 | చంపకమాల | 1 | - | - | - | - | 1 |
| 22 | వృత్తనామములు తెలియనివి | - | 1 | 1 | - | - | 2 |
| | మొత్తము | 51 | 57 | 44 | 42 | 63 | 257 |

# శైలి

కవితావిషయమున శైలియను పదమును ప్రసిద్ధాలంకారికులెవరును పేర్కొన లేదు.[1] కాని ఆధునిక సాహిత్య విమర్శనమున ఈ పదము విస్తృతముగ ప్రయోగింప బడుచున్నది. దీనిని పాశ్చాత్యుల "Style" అను పదమునకు సమానార్థకముగా నేటి విమర్శకులు వాడుచున్నారని డా॥ జి.వి. సుబ్రహ్మణ్యము గారభిప్రాయపడిరి.[2] స్థూలముగా విచారించినచో ఒక కవి ఎన్నుకొను పద్యములు, పదములు, వాని సంయోజనము, రచనలోని ధారాశుద్ధి, పదాన్వయములో ప్రత్యేకత మున్నగు వానిని "శైలి" యను దాని పరిధిలోనికి చేర్చవచ్చును.

ఆచార్యులవారీ కావ్యమునందు భిన్నభిన్నములగు శైలీభేదములను ప్రకటించిరి. కథాగమనమున ఆచార్యులవారి రచన సరళసుందరముగా నుండును.

గోదాదేవి విరహము ననుభవించుచు- వసశైలనాథుడు (విష్ణువు) తన్ను వివాహమాడినచో ఇట్లు సపర్యలు చేయుదునని పలుకుచున్నది —

"గృహ్ణామి పాదం చిబుకం స్పృశామి
ప్రేమాకరం సుందరమంచయామి।
అత్యాంతదాస్యం కరవాణి నిత్యం
కింకిం తదిచ్ఛానుకృతం కరోమి॥"

—(ఉలా. 4 శ్లో: 13)

(పాదములపైబడుదును. గడవ పట్టుకొందును. ప్రేమపూర్వకముగ చరింతును. అత్యాంతదాస్యమొనర్తును. అతని ఇచ్ఛానుసారము ప్రవర్తింతును.)

ఇట్లే గోదాదేవిని పూదోటలో శ్రీరంగనాథుడు పరిరంభణముచే అనుగ్రహించిన అనంతరము చెలికతెలామెనిటు పరిహసించిరి —

1. అభినయవిషయమున శైలీశబ్దమును నాట్యశాస్త్రములో భరతుడు పేర్కొనెను.
2. డా॥ జి.వి. సుబ్రహ్మణ్యం-ప్రథమాంధ్ర మహాపురాణము: పుట: 382

"ఆపీతం మధురాధరామృత మహో వక్షోజగంధో గతః
అతామ్రం నయనం కపోలయుగళం నిర్ధూతపత్రచ్ఛవి।
స్రస్తం ఫాలతలాంచితం సులలితం లోలం హి ముక్తాసరం
తే కంఠం సఖి! కేన కుత్ర విధినా నిర్లజ్జ మిద్యృక్కృతమ్॥"
—(ఉల్లా: 4 శ్లో: 49)

(సఖీ! మధురమగు అధరామృతము ఆస్వాదింపబడినది. వక్షోజములకు పూసికొన్న గంధము మాసిపోయినది. నేత్రములు ఎఱ్ఱబారినవి. కపోలద్వయము మకరిపత్రకాంతి వీడినది. ఫాలతలమునగల తిలకము కరగినది, కంఠమునందలి ముత్తెపుసరము జారినది. ఇట్లు నీపట్ల నిర్లజ్జగ ప్రవర్తించినదెవరు?)

వివిధ వర్ణనములందు కూడ ఆచార్యులవారిచే స్వభావోక్తి, ఉపమ మున్నగు సరళములగు అలంకారములను కూర్చిన సందర్భములు, ఇట్టి అన్వయక్లేశములేని సులభశైలిలోనే రచింపబడినవి.

గోదాదేవి బాల్యమును ఆచార్యులవారిట్లు వర్ణించిరి—

"అర్ధోత్థాయ భ్రమతి శయనే దోలికాదారుబంధం
గృహ్ణానేయం వికసితముఖీ చారుహాసం హసన్తీ।
అంహో! మాతః! జనకః ఇతి సా ఉవ్యక్తవాచం వదన్తీ
అవ్యక్తార్థస్ఫురణమగురుప్రాప్తిరూపం చకార॥"
—(ఉల్లా: 1 శ్లో: 29)

(నగము వరకు పైకిలేచి పరిభ్రమించును. ఊయల నూతగా పట్టుకొని హసన్ముఖియై అందముగ నవ్వులు రువ్వును. మాతః జనకః అను అవ్యక్తధ్వనులు చేయుచు, తన స్వరూపమును అవ్యక్తార్థస్ఫురణ మొనర్చుచున్నది.)

ఈ వర్ణనమున స్వభావోక్త్యలంకారము సరళసుందరమగు శైలిలో కూర్పబడినది.

గోదాదేవి యౌవనారంభమిట్లు వర్ణింపబడినది—

"కౌటిల్యం చికురాన్తలోఽధరమణిర్మౌనం దృశౌ శోణతాం
నమ్రత్వం వదనం సమున్నతమురో హానం కపోలౌ గతౌ।
నిమ్నో నాభిరసౌ చ మధ్యమిదం సూక్ష్మం పరిద్యోతతే
సంవాసో మమ కిం ను తైరితి రుషా యాతా దశా శైశవీ॥"
—(ఉల్లా: 1 శ్లో: 35)

(గోదాదేవి యౌవనమున అడుగిడగనే శిరోజములు కౌటిల్యమును పొందినవి. పెదవులు లజ్జచే మౌనము వహించినవి. చూపులు ఎఱ్ఱబారినవి. ముఖము లజ్జాభారముచే వాలినది. ఉరము సమున్నత మైనది. చెక్కిళ్లు తెలియబడినవగుచున్నవి. నాభి లోతైనది. నడుము సన్నబడినది. ఇక వీనితో సహవాసమేలయని కోపించి బాల్యదశ వెళ్లిపోయినది.

నిసర్గమధురమగు గోదాయౌవనారంభమిందు సుమనోహరమగు ఉత్ప్రేక్షతో కూర్పబడినది.

కొంత క్లిష్టమగు ఊహయు, అలంకార సాంకర్యమును గలచోట్ల శైలికూడ కొంత క్లిష్టముగనే కనిపించును—

"కమలమితి తద్వక్త్రం కృత్వానిపీయచ తద్రసం
సురభితమివ స్వాంగోల్లాసం నిరీక్ష్య మధువ్రతాః।
బహుతరతపస్తప్త్వా జాతా తదాలకతామితి
ప్రవిమలధియాం ప్రాచాం వాణీ కథం సమతాం నయేత్॥"
—(ఉల్లా: 1 శ్లో: 37)

(గోదాదేవి ముఖమును కమలమనుకొనిన తుమ్మెదలు, ఆమె ముఖముపైవ్రాలి అందలిరసమును పానముచేసి, తమ దేహములు సురభితములుకాగా అదిచూచి, తీవ్రముగ తపస్సుచేసి ఆ గోదాదేవి ముంగురులుగా అయినవి—(అనగా తుమ్మెదలు గోదాదేవి ముంగురులతో సమానములు కాలేకపోయినవి) అను విమల బుద్ధులైన ప్రాచీనుల వాక్కు సమానత్వమునెట్లు చెప్పును?)

గోదా యౌవనవర్ణనములోని ఈ శ్లోకమున ప్రతీపము-ఉత్ప్రేక్షల అన్యోన్య సాంకర్యముతోబాటు, శైలియందును పూర్వోదాహరణములకన్న కొంత క్లిష్టత స్పష్టముగ గోచరించుచున్నది.

తాత్త్వికములగు శ్లోకములలో అన్వయ క్లేశముకూడ తరచుగ కనిపించును.

గోదాదేవి విష్ణువున కర్పింపబోవు మాలికనుద్దేశించి తన విరహమును తెలుపు సందర్భమున నారాయణుని సగుణత్వమిట్లు సమర్థింపబడినది—

"తదాధారాధేయప్రమితి జనకజ్ఞాన మపి తే
గుణాధారం బ్రూతే త్వమపి సగుణాశ్లేషరసికా।
విశిష్టాకారేస్మిన్ చిదయన సమానాధికరణే
నిరాకారాప్రాప్తిః కథముదయతేఽద్వైత విధినా॥"
—(ఆశ్వా: 3 శ్లో: 7)

(ఆధారాధేయ ప్రమాణము వలన కలిగెడు జ్ఞానము నీ గుణాధారమును తెలుపుచున్నది. (దారమే మాలకు ఆధారమనుటను తెలుపుచున్నదని భావము) నీవును సగుణుని ఆశ్లేషించుటచే రసికవు. (దారముతో కూడియుండుదానవు లేదా సగుణుడగు ఆ శ్రీహరితో కూడియుండుదానవు.) ఇట్లు చిన్మార్గముతో సమానాధికరణమును పొందిన విశిష్టమగు ఆకృతి కనబడుచుండగా అద్వైతమార్గముచే నిరాకార ప్రాప్తి కలుగుట ఎట్లు?)

ఇచట ఆధారాధేయ సంబంధము, ఈశ్వరుని చిదచిద్విశిష్టతవంటి తాత్త్వికాంశములను అన్వయించుకొనగలిగిన పాఠకునకే ఈ శ్లోక భావము బోధపడును. అప్పుడుకూడ శ్లోకములోని పదముల అన్వయమును నిశ్చయించుకొనుట కొంత క్లిష్టమే.

తాత్త్విక సంబంధములైన శ్లోకములలో ఇట్టి అన్వయక్లేశమున్నను భగవద్వర్ణన ఘట్టములందు ఆచార్యులవారి శ్లోకములు పరమ సుకుమారములై సరళమగు శైలిలో భక్తి లాలిత్యమును ప్రస్ఫుటము చేయుచుండును—

గోదాదేవి విరహావస్థయందు తనయందు గోపికా భావమును ఆరోపించుకొని తన నాయకుడగు శ్రీకృష్ణుడెచట ఉన్నాడని చెలులనడుగగా వారు— బృందావనమున నున్నాడని బదులుపలుకుట 'నాచ్చియార్ తిరుమొళి' లోని గాథాదశకమునకు

అనువాదములగు పది శ్లోకములలో వర్ణింపబడినది. వీని యనంతరము ఒక ఆర్యా వృత్తమున ఆచార్యులవారు స్వామినిట్లు స్తుతించిరి—

"బృందావన సంచారి
బృందావనమాలి మాలికాశాలీ
గో బృందావనచారి
గో బృందానంద మందిర విహారీ।"

—(ఉల్లా: 4 శ్లో: 26)

(బృందావనమున సంచరించువాడును, బృందావన విష్ణువును, మాలికలుధరించి యున్నవాడును, గోవులతో కూడిన బృందావనమున చరించువాడును, గో బృందావనములతో కూడిన ఆనందమందిరమున విహరించువాడును అగు విష్ణువునకు నమస్కారము.)

శ్లోకములలో ఆచార్యులవారి శైలి వివిధ సందర్భములలో ఎట్లు భిన్నభిన్నముగ నుండియు, ధారాశుద్ధి శోభితమైనదో, వచనములలోగూడ నంతే ధారాశుద్ధియు, రచనా వైవిధ్యమును గోచరించును.

ప్రభాత వర్ణనమున ఆచార్యులవారు దీర్ఘసమాస బంధురమగు శైలినిట్లు ప్రకటించిరి—

"అంబరతలమిదం-ఉదయగిరి ధరణీధర కటకతట సముదితపటుల విహరమాణకలభయూన కుంభోపమ కుంభస్థల స్థగితగ్రావోపలవ్యూహాణ రక్తసిందూర సిందురితబింబ ఇవ కి మరుణితః" —(ఉల్లా: 5 వచ: 1)

విశిష్టాద్వైతతత్త్వవాసనావాసితములగు వచనములలో ఇట్టి సమాసకల్పనము కన్పింపదు.

గోదాదేవి శ్రీరంగనాథుని వరించుట యుక్తమే అని విష్ణుచిత్తుడు తలచిన ఘట్టమున—

"అత్రాయం స్వాపదేశాను సంధానుక్రమః తథాహి - స్థానే గోదాయాః పురుషోత్తమకామనావ్యాపారః, యశ్చ జనయతి ప్రజ్ఞావిస్తారయ జనం, యేన సముదితో వితాంతి ప్రణవాత్మకే శరీరే సంబంధోపాయ పురుషార్థాత్మకాని యదను గచ్ఛంతి జ్ఞానాధ్యవసాయతత్పరాః-తతః ప్రాదుర్భవతి సఖ్యవస్థా."

—(ఉల్లా: 8 వచ: 41)

ఈ వచనమున విషయగౌరవమే కాని, అన్వయక్లేశము కనవడదు. రూప వర్ణనాదులలో ఈ మాత్రము క్లేశము కూడ ఉండదు.

పూదోటలో విష్ణువు తన్ను లాలించినపుడు తన స్థితిని గోదాదేవి చెలికత్తెల కిట్లు వర్ణించి చెప్పను—

"నేత్రేషు రక్తతా స్తబ్ధతా-నిష్పక్షపాతతా- భ్రువోః కుటిలతా దీర్ఘానుమేయతా-తనుతా-శ్రవణయోః ఆకర్ణమాస్తృతయోః చంచలతా-అరుణతా"

—(ఉల్లా: 4 వచ: 62)

ఈ వచనమిట్లు వ్యస్తపదములలోను, అలతి సమాసములలోను కూర్పబడినది.

ఈ విధముగ ఆచార్యులవారి కావ్యమున శ్లోకములయందును, వచనముల యందును కూడ సందర్భానుగుణముగ శైలీ విన్యాసభేదమును ప్రకటించి, తమ రచనా సామర్థ్యమును ప్రదర్శించిరి.



# సుభాషితములు

కావ్యమును రచించునప్పుడు కవి ఎన్నియో అవతారములను ధరించును. ఒకచోట సృష్టికర్తయై నవ్యభావములను, కల్పనలను, పాత్రలను సృష్టించును. ఒకచోట గురువై విద్యనుపదేశించును. ఒకచోట ప్రభువై ధర్మమును శాసించును. ఒకచోట సన్మిత్రమై హితమును చెప్పును. ఒకచోట కాంతయై అనునయవాక్యములచే లాలించును. ఒకచోట జ్ఞానధన్వంతరియై విజ్ఞానరసాయనములనందించును. ఇట్లెన్ని విధములగు రూపములెత్తినను అవియన్నియు పాఠకుని చీకటినుండి వేకువకు నడిపించుటకే— అధర్మమార్గమునుండి తప్పించి ధర్మమార్గమున నడిపించుటకే. అట్టి ఆనందమయమగు రాచబాటలో పయనింపజేయుటకు కవి సయుక్తికముగ చక్కని సుభాషితామృతములను కూడ అందించును. ఈ కావ్యమునగల ఆ అమృతమాధురులెట్టివో చూతము —

1. సారూప్యమాపహతి సద్గతిరాశ్రితానామ్ (1-14)
2. స్త్రీణాం కోపాశమయతి రుషోద్భూత మంతర్విపాదమ్ (1-45)
3. దినమణి కరోత్ఫుల్లం పద్మం న చాన్యముపేక్షతే (2-5)
4. జ్వలతి శశికళా కిం ప్రోద్యమానే దినేశే (2-10)
5. ద్రవతి శిలకరే కిం ప్రోద్యతే పంకజశ్రీః (2-10)
6. అతర్కితోపస్థితకార్యసంగమే భవంతి ప్రాచాం విధయః ప్రమాణమ్ (2-18)
7. పాదాఘాతః ప్రణయిని జనే వాంఛితార్థం ప్రసూతే (2-26)
8. కాంతాధరప్రణయినో హి చరాచరాస్తే (2-31)
9. కే వా దుర్వ్యర్థగతి పతితం కర్మభిః ప్రాప్తదోషమ్ (2-41)
10. రంధ్రాన్విసు చింతనపరాః ఖలు నీచభావాః (2-53)
11. ఫలానుమేయా హి సతాం విభూతిః (2-84)
12. పరోపకారప్రవణా హి సంతః (3-4)
13. కామీ ప్రేయస్యభినవకచోన్ముక్తమాలాప్రియో హి (3-6)

14. పిబతి ఖలు మరందం భృంగయోగేన కీటః (3-17)

15. పరమరసికో భక్త్యుద్రేకః విరాన్యతి రాసతామ్ (3-35)

16. ప్రభూతః శృంగారః విదయనరసం సంజనయతి (3-34)

17. దుర్లభవిషయే వాంఛా న వాంఛనీయేతినమ్యగారోక్తిః (4-14)

18. స్వపరకీయఫలో హి విధానః (5-71)

19. దహ్యన్తే కతమాత్మజాపరిగ్రహప్రాప్తౌ గృహస్థా జనాః (5-96)

20. కిం కిం న కారయతి దుర్విషయానుభూతిః (5-99)

21. మోహే విమోహయతి వాంఛితవస్తు వాంఛా (5-99)

ఇట్టి సుభాషితముల నాయా ప్రసక్తములగు సందర్భములందు ప్రయోగించి, ఆచార్యులవారు సహృదయుల మనస్సుల నాకట్టుకొనిరి.

# తెలుగుదనము

ఈ కావ్యకర్త తెలుగువాడగుటచే ఈ రచనలో తెలుగుపదములను దృష్టిలో నుంచుకొని చేసిన శబ్దార్థచమత్కారములు, తెలుగులోని పూర్వకృతుల ప్రభావము; తెలుగులోనే ప్రచురముగా వాడబడుచున్న సంస్కృత పదములను ప్రయోగించుట మున్నగు "తెలుగుదనము"లు ఈ కావ్యమునందు కనబడును.

గోదా శ్రీరంగనాథుల వివాహఘట్టమున వివాహ మంటపము నధివసించిన శ్రీరంగనాథుని వర్ణించు సందర్భములో ఆచార్యులవారు— "అనుమిత నీరూపోఽపి; అంతర్యామ్యపి; ప్రకటిత దివ్యనారూపః" అనిరి. ఇందలి 'నీరూప', 'నారూప' శబ్దములు తెలుగు యుష్మదస్మదర్థక పదములను బోలియుండుట శాబ్దిక చమత్కారము. ఇచట సంస్కృత శబ్దములుగా ప్రయోగింపబడినవి. నిర్ + రూపః = నీరూపః అని వ్యాకరణసిద్ధమగు రూపము. అట్లే నృ + రూపః = నారూపః అగునని ఆచార్యులవారు భ్రమపడిరి. నరరూపుడను అర్థమున 'నృరూపః' అనునదియే సాధురూపమగునుగాని; 'నారూపః' అనునది ఏవిధముగను సాధురూపము గాదు. ఈ శబ్దములో 'ఉంద్రాప భాస శబ్దద్వయ విన్యాసముచే చమత్కారమున్న'దని ఆచార్యులవారు పాదదీపికలో సూచించుట 'నారూపః' అను మాటకు చెల్లదు.

నాయికా విరహవర్ణనమున విరహమును కుద్దీపకముగా రాత్రివర్ణనముచేయుట, విరహిణియగు నాయికచే చంద్రమన్మథ మలయానిలాద్యుపాలంభనము చేయించుట తెలుగు ప్రబంధముల సంప్రదాయము. ఆచార్యులవారు గోదాదేవి విరహవర్ణనమున రాత్రి వర్ణన, చంద్రమన్మథ వాయుదూషణలు గావించుట ఈ తెలుగు ప్రబంధముల ప్రభావమునే సూచించును. పురవర్ణనలో పురసుందరీమణుల సంగీత ప్రావీణ్యమును వర్ణించుటయు తెలుగు ప్రబంధములలో కన్పించునదే.

గోదా బాల్యవర్ణనమునగల—

"విహరతి సఖీయుక్తా సంస్థాప్యకృత్రిమ పుత్రికాః
వితరతి మధుక్షీరాపూపాన్నశాక ఫలాని సా॥"

—(ఉల్లా: 1 శ్లో: 33)

అను శ్లోకపాదములు పోతన భాగవతములోని రుక్మిణి బాల్యక్రీడా వర్ణన సందర్భములో—

"పేర్వేర బొమ్మల పెండ్లిండ్లు సేయుచు
నబలలతోడ వియ్యంబులందు
గుజ్జన గూళ్లను కొమరొప్ప వండించి
చెలులకు బెట్టించు చెలువుమెరయ"[1]

అను పద్యపాదములను స్మరింపజేయును.

ఆచార్యులవారు గోదాదేవి ముంగురులను ఇట్లు వర్ణించిరి—

"కమలమితి తద్వక్త్రం కృత్వాపిపీయచ తద్రసం
సురభితమివ స్వాంగోల్లాసం నిరీక్ష్య మధువ్రతాః॥
బహుతిర తపస్తప్త్వా జాతా తదాలకతామితి
ప్రవిమలధియాం ప్రాచాంవాణీకథం సమతాంవదేత్?"

—(ఉల్లా: 1 శ్లో: 87)

(గోదాదేవి ముఖమును కమలమనుకొనిన తుమ్మెదలు, ఆమె ముఖముపైవాలి, అందలి రసమును పానముచేసి, తమదేహములు సురభితములుకాగా, అదిచూచి, తీవ్రముగ తపస్సుచేసి ఆ గోదాదేవి ముంగురులుగా అయినవి అను విమల బుద్ధులైన ప్రాచీనుల వాక్కు సమానత్వమునెట్లు చెప్పును?— అనగా తుమ్మెదలు గోదాదేవి ముంగురులతో సమానములు కాలేకపోయినవనుట)

వసు చరిత్రమున రామరాజభూషణుడు నాయికయగు గిరిక నాసికనిట్లు వర్ణించెను—

"నానా సూన వితాన వాసనల నానందించు సారంగమే
లానన్నొల్లదటంచు గంధఫలిబల్కాకందపం బంది యో
షానాసాకృతిదాల్చి సర్వసుమన స్సౌరభ్య సంవాసియై
బూనెన్ ప్రేక్షణ మాలికా మధుకరీ పుంజంబు లిర్వంకలన్॥"[2]

---

1. పోతన-శ్రీమహాభాగవతము: దశమస్కంధము: పద్య: 1687 పుట: 521
2. రామరాజభూషణుడు-వసుచరిత్ర: ఆశ్వా: 2 పద్య: 47 పుట: 54

ఈ పద్యములోని కల్పన ఆచార్యులవారి పై కల్పనకు ప్రేరణయై యుండవచ్చును.

గోదాదేవితో విష్ణుచిత్తుడు ఆమె వివాహమును గూర్చి ప్రస్తావింపగా - ఆమె; 'తన మనస్సు విష్ణువునే కోరుచుగాని అన్యునొల్లద'ని ఇట్లు పలికెను—

"పరమపురుషాయత్తం చిత్తం తదన్యదపేక్షితుం
ప్రభవతి కథం భృంగస్త్యక్త్వాంబుజం మదనం వ్రజేత్ ॥"
—(ఉల్లా: 2 శ్లో: 5)

ఈ భావము పోతన భాగవతములోని ప్రహ్లాద చరిత్రమునగల—

"మందార మకరంద మాధుర్యమునదేలు
మధుపంబు బోవునే మదనములకు"[1]

అను భావమును అనుసరించుచున్నది.

తెలుగు కావ్యములలో బహుళముగా వాడబడుచున్న సంస్కృత వృత్తము చంపకమాల. ఇది ప్రకృతి ఛందమున 'ధృతశ్రీ' అను పేరుతో సంస్కృతమున ప్రసిద్ధమైయున్నది.[2] సంస్కృత కావ్యములలో దీని ప్రయోగము మృగ్యము.[3] సంస్కృతమున 'చంపకమాల' యను పేర ఒక వృత్తమున్నది గాని దానికి గణములు వేరు.[4]

ఆచార్యులవారి కావ్యారంభమునకుముందే గోదాదేవిని స్తుతించుచు రచించిన ఒక పుష్పమాలికా బంధమున 'చంపకమాల'ను నిబంధించిరి.

సంస్కృతమున లేని ప్రాసనియమమీ చంపకమాలలో కన్పించును. ఇది యంతయు కవి తెలుగువాడగుటచే సంభవించినదే.

ఇట్లీ కవి సంస్కృత కావ్యరచనలో సైతము నైసర్గికమగు తన 'తెలుగు దనము'ను ప్రకటించెను.

---

1. పోతన-శ్రీమహాభాగవతము: సప్తమస్కంధము: పద్య: 150 పుట: 23
2. 'నజభజజజరైర్ధృతశ్రీః' - వృత్తరత్నాకరః : అధ్యా-5 గాథాప్రకరణమ్: పుట: 143
3. మాఘుని 'శిశుపాలవధ' కావ్యములోని 'తురగశతాకులస్య........' (3-82) ఇత్యాది శ్లోకము 'ధృతశ్రీ' వృత్తము (అనగా తెలుగు చంపకమాల) వృత్తరత్నాకరము: అధ్యా: 5 పుట: 143
4. 'చంపకమాలాచేద్భమసాగః'-వృత్తరత్నాకరః- అధ్యా: 3 శ్లో: 9 పుట: 47

# శాబ్దిక చమత్కృతులు

అలంకారమనగా చమత్కారమని భామహాచార్యుల నిర్వచనము.[1] అలంకారము చమత్కారయుక్తమే కాని చమత్కారములన్నియు అలంకారములుకావు. అలంకారములన్నియు రసోపస్కారకములు. రసపరిపంథిత్వమను కారణముచేతనే 'ప్రహేళిక' అలంకారముకాదని సాహిత్యదర్పణకారుడనెను.[2] ఈ దృష్టితో కావ్యములోని శాబ్దిక చమత్కారములలో రసోపస్కారకములు కానివన్నియు కేవల చమత్కారములే. ఇవి కావ్యాత్మగా విశ్వేశ్వరదేశికుడు ప్రతిపాదించిన చమత్కార పరిధిలోనివికూడ కావు. అట్టి శాబ్దిక చమత్కార విన్యాసములను కవులు తమ కావ్యములలో ప్రదర్శించుచునే యుందురు. ఆయా విషయములపై కవికిగల అభిమానము వంటిదేదో దీనికి కారణము కావచ్చును.

శ్రీమాన్ అమరవాది వేంకటనరసింహాచార్యులవారి 'ఆముక్తమాల్యదమ్' కావ్యములోను అనేక శాబ్దిక చమత్కారములు కలవు. అలంకారశాస్త్ర పారిభాషిక పదములు, రూపకభేద సంజ్ఞలు, కవి-గ్రంథ-వృత్తి నామములు ప్రకృతార్థమున ఉపయోగించునట్లు ప్రయోగించుట ఒక చమత్కారము.

ద్వితీయోల్లాసమున గోదాదేవి తన స్వప్నవివాహమును చెలులకు వర్ణించు సందర్భమున రూపక, భాణ, ప్రకరణ, ప్రహసనములు (వచ: 79) వాని లక్షణైక దేశముచే పరమానందమునకు ఉపమానములుగ కూర్చబడినవి. తరుపరి వచనమున డిమమను రూపకభేదము ప్రమోదమున కుపమానముగ చెప్పబడినది. అట్లే ప్రసన్నరాఘవ, ఉన్మత్తరాఘవ, అనర్ఘరాఘవ, మాలతీమాధవ, ప్రబోధచంద్రోదయములు ఉపమానములుగ పేర్కొనబడినవి (వచ: 80). పంచమోల్లాసమున ప్రభాతవర్ణనములో ప్రబోధచంద్రోదయము, సంకల్ప సూర్యోదయము, చైతన్యచంద్రోదయము, యతిరాజ విజయము, వకుళభూషణము, భాస్కరోదయము అను గ్రంథములు పేర్కొనబడినవి. (ఉల్లా. 5 పద. 10)

---

1. 'అలంకారశ్చమత్కారః'—భామహుడు: కావ్యాలంకారము.
2. 'రసస్య పరిపంథిత్వాన్నాలంకారః ప్రహేళికా'
—విశ్వనాథుడు—సాహిత్యదర్పణము పరి. 10; శ్లో: 13

తృతీయోల్లాసమున—గోదాదేవికి విష్ణువుపట్ల కలిగిన అనురాగము యుక్తమైనదని తలచిన విష్ణుచిత్తుని మనోభావమును వర్ణించుటకు 'అవల్మీకోద్భూతులు, అనమితభవభూతిప్రణయులు, అవేదవ్యాసాద్యులు, అకఠిన మురారీతివచస్కులు, అబాణోక్తిప్రీతులు, అనభినవవేదాంతగురువులగు కవులే తగినవారని' పలికిన సందర్భమున—

"అవల్మీకోద్భూతా హ్యనమితభవభూతిప్రణయినః
అవేదవ్యాసాద్యాస్త్వ కఠిన మురారీతివచసః॥
అబాణోక్తి ప్రీతాస్త్వనభినవవేదాంత గురవః
తదా స్యుర్యద్భావం కవయతు మలం తే హి కవయః॥"

—(ఉల్లా: 3 శ్లో: 58)

అను శ్లోకము కలదు. ఈ శ్లోకమున వాల్మీకి, భవభూతి, వేదవ్యాసుడు, మురారి, బాణుడు, వేదాంతదేశికుడు పేర్కొనబడిరి.

చతుర్థోల్లాసమున—పూదోటలో గోదాదేవిని విష్ణువు పరిరంభణముచే ఆదరించు సందర్భమున విష్ణువు పలికిన పలుకులలో-ద్రుత విలంబితము, రథోద్ధత, స్రగ్విణీ, మాల, స్రగ్ధర, శార్దూలవిక్రీడితము, మత్తేభము, పంచచామరము అను ఛందోనామములు పేర్కొనబడినవి (వచ: 30). ఇదే ఉల్లాసమున స్వప్నపరిణయ వృత్తాంతమును గోదాదేవి చెలులకు వివరించు సందర్భమున అలంకారశాస్త్ర సంబంధులగు పదములు, అలంకారనామములిట్లు ప్రయోగింపబడినవి—

"వ్యంజనాధ్వసు శబ్దార్థశక్తిమూలాః సార్థాలంకారేషు సంకరతా మూపాదయన్తః, సోత్ప్రేక్షా హేతూపమాసదీపక ప్రతియోగితాను భావనామూలాః శబ్దార్థోభయ శక్తిమూలా ఇవ ప్రాతిభాసికీ మవస్థాం ఉద్భావయన్తః కావ్యబంధా ఇవ ప్రాసయమక పద్మనాగ చతురంగ పరికలిత బంధాఇవ.. ....." (ఉల్లా: 4 వచ: 63)

ఒక శ్లోకమున లేక వచనమున క్రియాపదములను వరుసగా కూర్చుటయొక చమత్కారము.

ప్రథమోల్లాసమున విష్ణుచిత్తుని దినచర్యను కవి ఇట్లు వర్ణించెను—

"స్నాతి ధ్యాయతి సించతి ప్రవదతి ప్రస్తౌతి దీవ్యత్యసౌ
ప్రీత్యోత్తిష్ఠతి గాయతి ప్రణమతి వ్యాముహ్యతి స్నిహ్యతి"

—(ఉల్లా. 1 శ్లో. 18)

'ప్రతినిత్యము విష్ణుచిత్తుడు స్నానమాచరించును, భగవంతుని ధ్యానించును, పూదోటలలో చెట్లపాదులను త్రవ్వును, భగవత్తత్త్వమును ప్రవచించును, భగవంతుని స్తుతించును, భగవంతునితో క్రీడించును, ఆనందముచే లేచినిలుచును, భగవంతుని కీర్తనలు గానము చేయును, భగవంతుని నమస్కరించును, భగవద్విషయమున వ్యామోహమును చూపును, సంతోషాతిశయముచే నవ్వుకొనును' అను విధముగ విష్ణుచిత్తుని దినచర్య ఈ శ్లోకమున పేర్కొనబడినది.

ఈ శ్లోక పాదములందు అనేక క్రియలున్నవి. అవి— ష్ణా (శుచౌ); ధ్యై (చింతాయామ్); ఖన (ఖననే); వద (వ్యక్తాయాం వాచి); ష్టుఞ్ (స్తుతౌ); దివు (క్రీడావిజిగీషావ్యవహారద్యుతిస్తుతిమోదమదస్వప్నకాంతిగతిషు); ష్ఠా (గతినివృత్తౌ) గై (శబ్దే); ణమ (ప్రహ్వత్వే శబ్దే చ); ముహ (వైచిత్త్యే); ష్మిఙ (ప్రీతౌ) అను ధాతువుల 'లట్' రూపములు. ఇందు అనేక క్రియా పదములను ఒకచోట వరుసగా కూర్చుట చమత్కారము.

సంస్కృత క్రియారూపములలో కొన్ని సార్వధాతుకములు, కొన్ని ఆర్ధ ధాతుకములు. తృతీయోల్లాసమున ఆచార్యులవారు—"అభిలాషస్మృతిచ్ఛావర........" వచ: 45) ఇత్యాది వచనమున భవన్తిస్మ, ఆశ్రయన్తి, చేతయంతి, మదయంతి, ప్రలాపయంతి, శోషయంతి, భ్రామయంతి, పరివేదయంతి, విలాపయన్తి, ధ్యాపయన్తి మూర్ఛయంతి, పాతయంతి, ప్రకాశయంతి, ధావయంతి, అనుగమయంతి, నయన్తి, అను క్రియాపదములను ప్రయోగించిరి. ఇవన్నియు ఆయాధాతువుల 'లట్' రూపములు – సార్వధాతుకములు.

ఇట్లే చతుర్థోల్లాసమున— 'న జీవేయం, న త్యజేయం, నయామి, దదామి, మోక్షయిష్యామి' (వచ: 42) అను సార్వధాతుక క్రియలనుపయోగించిరి.

ఈ రెండు వచనములలోను, సార్వధాతుక క్రియలను కూర్చినట్లు ఆచార్యుల వారు ఆయా వచనములందే పేర్కొనిరి.

తృతీయోల్లాసమున— గోదాదేవి శ్రీరంగనాథుని వరించుట వైష్ణవ సంప్రదాయానుగుణమైనదే అని విష్ణుచిత్తుడు తలచిన సందర్భమున సార్వవిభక్తికమగు వచనమిట్లు కూర్చబడినది—

"యా విపశ్చిదపశ్చిమావరేణ్యా ...................
యాం అవిద్వాం సో నోపానతే...................
యయా నిరవచ్ఛిన్నతా తాదాత్మ్య..................
యస్యై చేతయంతి సంతః......................
యస్యాః చిదచిదయనవరః పరానుభవః ..........
యస్యాః ప్రభావః సూరిజనోపయోగ్యః..............
యస్యాం ఆశాసానాః భోగ్యోపకరణ భోగ్యోపస్థానీయం........
—సార్వవిభక్తికోయం విద్యావిలాసః" —(ఉల్లా: 3 వచ: 42)

ఈ వచనమున యచ్ఛబ్దము యొక్క సప్తవిభక్తుల ఏకవచనరూపములు కూర్చబడినవి. ఇట్లన్ని విభక్తులలోను వేర్వేరుగా పద్యములు, కళికోత్కళికలు వ్రాయుట తెలుగులో ఉదాహరణ ప్రక్రియగా ప్రసిద్ధమైనది. ఇట్టి సార్వవిభక్తి కరచనకు బీజము ఋగ్వేదములోని 'కుంతాపసూక్తము'లో నున్నదని పెద్దలు చెప్పుదురు. సర్వవిభక్తులలో భగవంతుడు పేర్కొనబడుటచే భగవంతుడు సర్వక్రియాస్థాన భూతుడని వ్యంగ్యము.[1] "శ్రీ కులశేఖరాళ్వార్" మున్నగు ప్రాచీనులు సంస్కృతమున ఇట్టి సార్వవిభక్తి కరచన చేసిరి.[2]

గోదాదేవి శ్రీరంగనాథుని వరించుట యుక్తమేనని తలచిన విష్ణుచిత్తుని భావనలో విశిష్టాద్వైత తత్త్వము వెల్లివిరిసినది. (ఉల్లా: 3 వచ: 42, 43) ఈ సందర్భములోగల రెండు వచనభాగములలో కవి ఆధ్యాత్మిక పదప్రయోగ చమత్కారమును

---

1. "జగత్తంతయు క్రియారూపము........వ్యంగ్యము"
నిడుదవోలు వేంకటరావుగారి 'ఉదాహరణ వాఙ్మయచరిత్ర'పై
విశ్వనాథ సత్యనారాయణగారి 'అభిప్రాయము.'

2. "కృష్ణో రక్షతు నో జగత్త్రయగురుః కృష్ణం నమస్యామ్యహమ్
కృష్ణేనామరశత్రవో వినిహతాః కృష్ణాయ తస్మై నమః।
కృష్ణాదేవ సముత్థితం జగదిదం కృష్ణస్య దాసోఽస్మ్యహమ్
కృష్ణేతిష్ఠతి సర్వమేతదఖిలం హే కృష్ణ! రక్షస్వ మామ్॥"
—(ముకుందమాల-శ్లో: 33 పుట: 62)

చూపెను. ఇతర వచనములలో గూడ ఇట్టి పదప్రయోగమున్నను ఈ సందర్భమున మాత్రము కవి— "ఆధ్యాత్మికః ప్రయోగపద చమత్కారరచన ఇతి వైదికీ ప్రక్రియాం వ్యాకుర్వాణా ప్రతిభాతి" అని పేర్కొనబడుటచే ఈ వచనములను మాత్రమే ఈ వ్యాసభాగమున గ్రహించుట జరిగినది. తక్కిన సందర్భములలో కూడ ఉన్న ఆధ్యాత్మికవిశేషములు తాత్త్విక ప్రకరణములో నిరూపింపబడినవి. ఈ వచనములలో—

"అనన్యాకారేణ పారతంత్ర్యేణ— ఆత్మేశ్వరే శేషితాం— తదేకశేషతాం— నవ సంబంధేన బంధురయతి అష్టాక్షరసూత్రవేష్టితేన త్రిరావృత్త పదత్రయాకారరంజితేన— కుమారీదశా — స్వాత్మవత్సర్వపదార్థసంశ్లేషాద్యనుభవః — నాయికామాతృసఖ్యవస్థాత్రి యోన్మేషః— ఆచతుస్సహస్ర్యాపద్యమాలికయా" మున్నగు ఆధ్యాత్మిక పదములు కూర్పబడినవి.

ఆచార్యులవారు విష్ణుచిత్తుని వర్ణించు సందర్భములోని వచనమున (ఉల్లా: 1 వచ: 17) మేషాది రాశినామముల నుపయోగించిరి. ఇందు కొన్ని అర్థాంతరమున వచ్చినవి, కొన్ని సంధికూడిన పదములలో చేరియున్నవి. ఇవి అర్థములో ప్రమేయము లేక కేవలము ఆ అక్షరముల కూర్పు మాత్రమే వచ్చునవి—

'తస్యా మేష పుర్యాం' అనుచోట 'తస్యాం+ఏష' అను పదముల సంధిలో 'మేష' అను అక్షరద్వయము సిద్ధించినది. 'ఋషభ' శబ్దము 'ధరణీసురర్షభః' అనుచోట శ్రేష్ఠవాచకముగ ప్రయోగింపబడినది. 'మకర' శబ్దము 'ఉత్తమకరః' అను పదద్వయముచే కూర్చబడినది. ఇట్లే 'మీన' రాశినామము 'అమీ న మయా' అనుచోట నిబంధింపబడినది. తక్కిన మిథున, కర్కాటక, సింహ, కన్యా, తులా, వృశ్చిక, ధనుః, కుంభ రాశి నామములు సమస్తములుగనో, వ్యస్తములుగనో ప్రత్యేకముగనే ఉన్నవి. ఇట్లు ద్వాదశ రాశినామముల నీ వచనమున కవి వరుసగా ప్రయోగించి చమత్కారమును చూపెను.

విరహావస్థయందున్న గోదాదేవికి మనోహరమగు ప్రకృతి సౌందర్యముకూడ దుస్సహమైనది. ఈ అవస్థను వర్ణించు సందర్భమున చతుర్థోల్లాసమునగల ఒక వచనమునందు (వచ: 4) ఈమ్మెదలిట్లు వర్ణింపబడినవి—

"భీషయంతి శిలీముఖాః దుందుభిస్వరాః వికారిస్వరూపిణః రక్తాక్షిణః"

ఇచట దుందుభి, వికారి, రక్తాక్షి అను సంవత్సర నామములు పేర్కొనబడినవి.

ఇట్లే గోదా శ్రీరంగనాథుల వివాహ ఘట్టమున కల్యాణవేదికను వర్ణించుచు ఆచార్యులవారు —

"యత్ర చ సంవత్సరేష్వేవ విరోధితా, వికారితా, రక్తాక్షితా, క్రోధితా, భవ, పరాభవతా" అని వర్ణించిరి.

ఇచట విరోధి, వికారి, రక్తాక్షి, క్రోధి, భవ, పరాభవ అను సంవత్సర నామములు పేర్కొనబడినవి. (ఉల్లా: 5 వచ: 84)

ఇట్లు ఆచార్యులవారి రచనలో శాబ్దిక చమత్కారములు అనేక విధములుగ గోచరించుచు, ఆయన చమత్కారప్రియత్వమును వెల్లడించుచున్నవి.



# వ్యుత్పన్నత

కవికి ఉండవలసిన కవితా సామగ్రిలో ప్రతిభ తరువాత ఆలంకారికులు పేర్కొనినది వ్యుత్పన్నత లేక వ్యుత్పత్తి. దీనినే "నిపుణతా లోకశాస్త్ర కావ్యాద్య వేక్షణాత్" అని మమ్మటుడు పేర్కొనెను. ఆచార్యులవారు తమ ఈ కావ్యమున తమకు వివిధ శాస్త్రములయందును, కావ్యాదులయందును గల పరిజ్ఞానమును పెక్కు చోట్ల ప్రదర్శించిరి. వేదోపనిషత్తులయందును, ప్రాచీనద్రావిడ గ్రంథముల యందును ఆయనకుగల వ్యుత్పన్నత తాత్త్విక ప్రకరణములోని "తత్త్వవివేచన"మను వ్యాస మున పరామర్శింపబడినది. ప్రాచీనకవుల కావ్యములపై, ఆయనకుగల గౌరవాదరములు, వానిని ఆయన ఆత్మీయములు చేసికొన్నతీరులు "పూర్వ కవితానుసరణ"మను వ్యాస మున నిరూపింపబడినవి. ఈ వ్యాసభాగములో ఆచార్యులవారు ఆయాశాస్త్రములలో తమకుగల వ్యుత్పత్తిని ఆయా సందర్భములలో నెట్లు ప్రదర్శించిరో పరిశీలింప బడుచున్నది—

స్మృతిపరిజ్ఞానము: ద్వితీయోల్లాసమున— గోదాదేవి తన స్వప్నపరిణయ మును చెలులకు వర్ణించుసందర్భమున— "పురోహితైః వివాహోచితాగ్నికరణ, పుణ్యాహకర్మ పాలికాస్థాపనపూర్వకాంకురారోపణ కంకణబంధ మంగళవస్త్రాలం కరణ మాంగల్యధారణ లాజాహోమ సాప్తపదీనప్రముఖం నిఖిలం వైదికం కర్మ కుర్వాణైః శ్వశుర ప్రేషణ పర్యన్తం మామకీన వివాహోచితం సర్వం స్వప్నేఽహ మద్రాక్షమ్........" (ఉల్లా: 2 వచ: 78) అని చెప్పును. ఇచట వివాహసమయో చితములైన అగ్నికరణము, పుణ్యాహవాచనము, పాలికాస్థాపనము, అంకురారోపణము కంకణబంధము, మంగళవస్త్రాలంకరణము, మాంగల్యధారణము, లాజాహోమము, సాప్తపదీనము మొదలగు క్రియలు వర్ణింపబడినవి.

ఇట్లే పంచమోల్లాసమున గోదా శ్రీరంగనాథుల వివాహపట్టమునను—

"ఆసిందాశ్రి ఫలకీకృతః విష్ణుచిత్తః పటాంతరితేన మార్గేణ రత్నపీఠికా ముపస్థాప్య ప్రవర ప్రవచన పూర్వకం కన్యావరయోః కంకణబంధం కల్పయన్ సర్వలోక వశ్యశస్తే కన్యాహస్తం విన్యస్య...."(ఉల్లా: 5 వచ: 88) అని కన్యాదానము మొదలగు వైవాహిక ప్రక్రియ వర్ణింపబడినది. ఇదంతయు స్మృతి విషయకము.

పూర్వమీమాంస: విష్ణువునకు తప్ప తాను అన్యులకు భోగ్యను కానని వలుకుచు తండ్రితో గోదాదేవి— "యథా నాగ్నేయమష్టాకపాలం శునాశీరం" (ఉల్లా: 1 వచ: 7) అనును. పురోడాశమనగా యజ్ఞహవిర్ద్రవ్యము.[1] దానిని భుజించుటకు కుక్కకు అర్హతలేదను ఉపమానము పలువురు కవులు వాడినదే. కాని ఆచార్యులవారిచట పురోడాశమునకు విశేషణముగా 'అగ్నేయమష్టాకపాలం' అని పేర్కొనిరి. ఎనిమిది పాత్రలలో సంస్కరింపబడిన హవిర్ద్రవ్యమగు పురోడాశమును ఆయా ఉద్దిష్టదేవతలకు మంత్రపూర్వకముగ సమర్పించుచు, అగ్నిలో వ్రేల్తురు. ఆయా యజ్ఞముల ననుసరించి హవిర్ద్రవ్యములుంచు పాత్రల సంఖ్య నిర్దేశింపబడును. యజన విధిలో పరిచయమున్న కవి మాత్రమే ఇట్లు ప్రయోగింపగలరు.

న్యాయము: గోదాదేవి బాల్యలీలలను వర్ణించుచు ఆచార్యులవారు— "జిఘ్రత్యసౌ గంధవతీతి పృథ్వీం" (ఉల్లా: 1 శ్లో: 31) అని గోదాదేవి మట్టినిచేతబట్టుకొని ఆఘ్రాణించుటను వర్ణించిరి. న్యాయశాస్త్రగ్రంథమున పృథివ్యాది ద్రవ్యములను, తల్లక్షణములను చెప్పునపుడు- పృథివీ లక్షణమున- 'గంధవతీ పృథివీ'[2] అని గంధవత్వము పృథివికి లక్షణముగ చెప్పబడినది. దానిని ఆచార్యులవారిచట చక్కగా ఉపయోగించిరి.

గోదాదేవి ధరించి విడిచిన మాలతే తనకు ప్రియములని విష్ణువు అర్చకముఖమున విష్ణుచిత్తునకు తెలుపగా అతడట్లే అర్పించుచు తనకుమార్తె ఓన్యురాలనియు 'మానవ భూమికను ధరించిన అమానుషియనియు తలచుచు, అట్లు కానిచో భగవంతుడిట్లెల కృపసేయు'నని—"అనుదిత ధూమోద్గమే పక్షే వా కథమివ సాధ్యానుమానః సునంపాద్యః"అని తలచును. (ఉల్లా: 3 వచ: 27)

తర్కశాస్త్రమున పేర్కొనబడిన ప్రమాణములలో 'అనుమాన' మొకటి. దీనికి లక్ష్యముగా చూపబడు వాక్యమిది— 'పర్వతో వహ్నిమాన్ ధూమాత్'.— 'యత్ర యత్ర ధూమస్తత్ర తత్రాగ్నిః' అనునది సిద్ధము. కనుక పర్వతమున పొగ కనిపించుటచే అచట అగ్నియున్నదనుట సాధ్యము. దీనినే 'ధూమాగ్న్యనుమాన'మని అందురు. నారాయణుడు గోదాదేవి ధరించి విడిచిన మాలను ఇష్టపడెను. ప్రేయసి ధరించిన

---

1. 'యజ్ఞీయ హవిర్ద్రవ్యే'—'యవచూర్ణ మిశ్రిత రోటికా భేదే'
—వాచస్పత్యమ్: భాగః 5 పుట: 4380)

2. 'గంధవతీ పృథివీ'—తర్కసంగ్రహః- ప్రత్యక్షపరిచ్ఛేదః పుట: 5

మాలను ప్రియుడు ధరింపగోరుట సిద్ధవిషయము. కావున ఈ వృత్తాంతముచే గోదాదేవి స్వామికి ప్రియురాలనియు, అట్లగుటచే మానవాకృతిలోనున్న అమానుషి యనియు సాధ్యము.

జ్యోతిషము: శ్రీహరియందు బద్ధానురాగిణియైన గోదాదేవిని గూర్చి విష్ణుచిత్తు డిట్లు తలచును—

"దశాముపేతా హరి భోగభోగ్యాం
అనన్యరూపైర్విదశా ముపేతా।
అన్తర్దశాయాం ద్విజరాజపుత్రీ
జ్యోతిర్విదేవాస హరి ప్రవీణా॥"
—(ఉల్లా: 3 శ్లో: 30)

ఈ శ్లోకము జ్యోతిశ్శాస్త్ర సంబంధులైన దశ, అంతర్దశ, విదశలను పేర్కొన్నది. ఇది జాతక భాగమునకు సంబంధించినది. మనుష్యజాతకమున ప్రతి గ్రహమునకు కొన్ని సంవత్సరములు నిర్దిష్ట దశ యుండును. ఒక గ్రహము దశలో మరల నవగ్రహములకును అంతర్దశలుండును. ఆయా దశాంతర్దశాభుక్తులలో దశానాథ, అంతర్దశానాథులు జాతకమున తామున్న స్థానమునుబట్టి శుభాశుభఫలములనిత్తురు. అంతర్దశయందు కూడ మరల నవగ్రహములకును భుక్తులుండును. ఇవి విదశాభుక్తులు. ఫలితము విషయమున అంతర్దశకంటె ఇది మరికొంత సూక్ష్మ విచారము. ఆచార్యుల వారీ శ్లోకమున దశ, అంతర్దశ, విదశలనుగూర్చి చెప్పిరి.

వ్యాకరణము: ఆచార్యులవారు వైయాకరణైకవేద్యములగు పెక్కు అరుదైన ప్రయోగములను చేసి తమ వ్యాకరణశాస్త్రాభిజ్ఞతను ఈ కావ్యమున పెక్కు సందర్భములలో ప్రకటించిరి.—

1. "నీలాంజనతి" (ఉల్లా 2 శ్లో: 36)
2. "కుబేరతి" (ఉల్లా: 3 వచ. 102)
3. "హిరణ్యప్రాకారీయతి" (ఉల్లా: 5 వచ: 49)

పై మూడు ప్రయోగములును ఆచారార్థమున నామములపై సిద్ధించిన క్విబంత రూపములు. 'నీలాంజనమివ ఆచరతి', 'కుబేర ఇవ ఆచరతి', 'హిరణ్యప్రాకారమివ

అవరతి' అను అర్థములందు 'సర్వప్రాతిపదికేభ్యః క్విబ్వా వక్తవ్యః'[1] అను వార్తికముచే క్విప్ ప్రత్యయము. ఇచట నీలాంజన, కుబేర, హిరణ్యప్రాకార అను ప్రాతిపదికలపై వచ్చినది.

4. "కరసాత్కురు" (ఉల్లా: 5-89)

ఇచట 'కర' శబ్దముపై సాకల్యార్థమున 'సాతి' ప్రత్యయము వచ్చినది. 'విభాషాసాతికార్త్స్న్యే.[2] అను సూత్రముచే కరశబ్దముపై సాతి ప్రత్యయము వికల్పముగ సిద్ధించును.

5. త్రిస్సప్తకృత్వః (ఉల్లా: 5 పద: 101)

ఇది కృత్వసుచ్ ప్రత్యయముచే సిద్ధించిన రూపము. 'సంఖ్యాయాః క్రియాభ్యావృత్తిగణనే కృత్వసుచ్'[3] అను సూత్రముచే క్రియ యొక్క అభ్యావృత్తిని గణించునప్పుడు సంఖ్యాశబ్దముపై స్వార్థమున కృత్వసుచ్ ప్రత్యయము వచ్చును. ఇచట 'మూడింతలైన ఏడు'అను అర్థమున'త్రిఃసప్త'అను సంఖ్యావాచకశబ్దముపై కృత్వసుచ్ ప్రత్యయము ప్రవర్తించి 'త్రిస్సప్తకృత్వః' అను రూపము ఏర్పడును.

6. శుభంయుః (ఉల్లా: 1 శ్లో: 16)
7. అహంయుః (ఉల్లా: 2 శ్లో: 10)

శుభముగలవాడు, అహంకారముగలవాడు అను అర్థములందు 'శుభమ్', 'అహమ్' అనువానిపై 'అహంశుభమోర్యుస్'[4] అను సూత్రముచే 'యుస్' అను ప్రత్యయమురాగా శుభంయుః, అహంయుః అను రూపములేర్పడును.

ఇట్టింకను పలుచోట్ల అదుదైన వ్యాకరణ ప్రయోగములు కనబడును. ఈ ప్రయోగములన్నియు ఆచార్యులవారి వివిధశాస్త్రవైదుష్యమునకు ప్రతీకలై నిలిచి యున్నవి.



1. వైయాకరణ సిద్ధాంతకౌముదీ: నామధాతుప్రకరణమ్: పుట: 515 వా: 1722
2. —Ibid— స్వార్థిక ప్రకరణమ్: పుట: 925 సూ. 5-4-52
3. —Ibid— —Ibid— పుట: 915 సూ. 5-4-140
4. —Ibid— మత్వర్థీయప్రకరణమ్: పుట: 879 సూ. 5-2-140

# పూర్వకవితానుసరణము

కవియొక్క వ్యుత్పన్నతలో పూర్వకవుల కావ్యములను అధ్యయనము చేయుట కూడ ఒక అంశముగా ఆలంకారికులు పేర్కొనిరి.[1] కవి ఇట్లు ప్రాచీన కావ్యములను చక్కగా పఠించుటచే వానియందలి ఉదాత్తములగు పదబంధములు, మనోహరములగు భావములు, లోకోత్తరములగు ఉపమానములు, హృదయంగమములగు శైలి, హృదయ రూఢములై అనక్షృన్మననముచేత సన్నిహితములై యుండును. అట్టి కవి స్వీయ కావ్యనిర్మాణావసరమున అట్టి భావమునో, పదబంధమునో, ఉపమానమునో, శైలినో తన రచనా భాగమున సందర్భోచితముగ ప్రతిఫలింపజేయును. ఒక్కొక్కప్పుడు ప్రాచీనకవి ఒక లోకోత్తరమగు ఉపమానమును ఉపయోగించ వచ్చును. ఆ సందర్భమున అంతకన్న రమ్యమును, సమీచీనమును అగు పోలికను చెప్పుటకు అవకాశముండదు. అట్టిదానిని కూడ ఈ కవి ఉపయోగించుకొనును. ఇది యంతయు పూర్వకవితానుసరణ మనవచ్చును. అనుసరణమనినంత మాత్రమున ఇది ఈ కవి ప్రతిభా దారిద్ర్యమునకు సంకేతము కాదు. అతని బహుకావ్యానుసంధానపరిశ్రమకు ఆ ప్రాచీనులపైగల గౌరవాదరములకు మాత్రమే ఇది చిహ్నమగును.

సమానమగు ఇతివృత్తమున ప్రాచీనులు చెప్పినదానిని కవి అనువదించుట ఈ పూర్వకవితానుసరణమున చేర్పబడుటలేదు. అట్టివి 'అనువాదవివేచన'మను వ్యాసములో చర్చింపబడుచున్నవి.

విష్ణుచిత్తుడు గోదాదేవితో ఆమె వివాహమునుగూర్చి ప్రస్తావించుచు పలికిన మాటలలో—

"అర్థోహి కన్యా పరకీయ ఏవ, ఇత్యస్వర్థివప"
—(ఉల్లా: 2 వచ: 8)

అనును. ఇది ఈ కాళిదాసశ్లోకములోని ఒక భాగము—

1. "శక్తిర్నిపుణతా లోకశాస్త్ర కావ్యాద్యవేక్షణాత్"
—మమ్మటుడు: కావ్యప్రకాశము-ఉల్లా. 1 శ్లో. 8

"అర్థోహి కన్యా పరకీయఏవ
తామద్య సం(ప్రేష్య పరి(గ్రహీతుః।
జాతోస్మి సద్యో విశదాంతరాత్మా
చిరన్య నిక్షేప మివార్పయిత్వా॥"
—(అభిజ్ఞాన. అంక: 4 శ్లో: 24)

వాల్మీకి రామాయణమున— సీతను లంకలోచూచి, తిరిగి అంగదాదుల కడకు వచ్చిన హనుమంతుడు సీత ఎట్లున్నదని అడిగిన జాంబవంతునకిట్లు పలికెను—

"సా(ప్రకృత్యైవ తన్వంగీ తద్వియోగాచ్చ కర్శితా।
(ప్రతిపత్పాఠశీలస్య విద్యేవ తనుతాం గతా॥"
—(వాల్మీకి రామాయణమ్-సుందరకాండః సర్గ. 59 శ్లో. 35)

ఇందలి ఉపమాన పదబంధమును ఆచార్యులవారు యథాతథముగ వాడుకొనిరి. గోదాదేవి తన వివాహ(ప్రస్తావన మొనరించిన తం(డితో-తాను విష్ణువునే వరింతునని పలుకుచు, పు(త్రికాస్నేహముచే నీవు ప్రాచీన సం(ప్రదాయమును[1] మరచితివనుచు; ఆ విస్మృతికి ఉపమానములనిట్లు పలుకును—

"వర్ణాంతరగతేవ ద్విజ జాతిరసంస్కృతా"
"(ప్రతిపత్పాఠశీలస్యతనుతాం గతేవ విద్యా"
—(ఉల్లా. 2 వచ. 7)

ఇందలి రెండవ ఉపమానము పై వాల్మీకి శ్లోకమునకు అనుసరణ మనుట స్పష్టము. ఇట్లే మొదటి ఉపమానముకూడ వాల్మీకి (ప్రయోగించిన పదముల కూర్పే. అశోకవనమున సీతనుచూచి, ఆమెకు రామ వృత్తాంతమును తెలిపి, వియోగ దుఃఖము నుండి ఓదార్పదలచుచు తాను వానరుడు కనుక ద్విజాతివలె సంస్కృత వాక్కులు పలికినచో సీతాదేవి తన్ను కామరూపుడగు రావణుడని భావించి, భీతిల్లునేమో అని ఇట్లు సందేహించును—

"యది వాచం (ప్రదాస్యామి ద్విజాతిరివ సంస్కృతామ్।
రావణం మన్యమానా మాం సీతా భీతా భవిష్యతి॥"
—(వాల్మీకి రామాయణమ్-సుందరకాండః సర్గ: 30 శ్లో: 18)

---

1. ఇచట (ప్రాచీన సం(ప్రదాయమనగా 'పారార్థ్యము'. భక్తుడు తనను, తన సర్వస్వమును భగవదధీనము చేయుట.

ఇచట వాల్మీకి పదప్రయోగమే ఆచార్యులవారి ఉపమానమునకు మూలమనుట స్పష్టము.

రావణుడు అశోకవనమున సీతతో తన్ను వరింపుమని అడుగగా సీతాదేవి తనకును, రామునకును గల సంబంధము సూర్యునకును, సూర్యకాంతికినిగల సంబంధమువలె విడదీయరానిదని ఇట్లు పలుకును—

"అనన్యా రాఘవేణాహం భాస్కరేణ ప్రభా యథా"

—(వాల్మీకి రామాయణమ్-సుందరకాండః సర్గ: 21 శ్లో. 16)

తన మనస్సు శ్రీహరియందే లగ్నమైనదని తండ్రితో గోదాదేవి పలుకు సందర్భమున ఆచార్యులవారు ఇదే ఉపమానమును స్వీకరించిరి—

"యథానన్యా భానునా తత్ప్రభైవ
తథాఽహం స్యాం నాయకేన ప్రతీతా॥"

—(ఉల్లా: 2 శ్లో: 6)

ఆళ్వారుల చరిత్రను తెలుపు 'ప్రపన్నామృత'మునకూడ గోదా శ్రీరంగనాథుల సంబంధమునుగూర్చి వల్లభరాజుతో విష్ణుచిత్తుడు పలికిన మాటలలో పై వాల్మీకి ఉపమానము యథాతథముగ ఇట్లు గ్రహింపబడినది

"రంగేశ్వరం వినా నాన్యమకామయత మే సుతా।
అనన్యా రాఘవేణాహం భాస్కరేణ ప్రభా యథా॥"

—(ప్రపన్న. అధ్యా. 92 శ్లో. 20)

స్వామికిని, అమ్మవారికిని గల సంబంధమునకు ఇంతకన్న చక్కని ఉపమానముండదు.

అభిజ్ఞానశాకుంతలములో దుష్యంతుడు మృగయార్థమై అరణ్యమున సంచరించుచు, కణ్వాశ్రమమును చూచి, తన పరివారమును దూరముననిలిపి ఒంటరిగా ఆశ్రమమున ప్రవేశించెను. అచట శకుంతలనుచూచి, ఆమె సౌందర్యముచే ఆకర్షింపబడెను. తిరిగి తన పరివారముకడకు మరలి వచ్చునపుడు అతని శరీరము ముందుకు

సాగుచున్న దేహాని, మనస్సు ఆశ్రమమువైపునకే పరుగులు దీయుచుండెను. ఈ స్థితిని 'ముందుకుపోవుచున్న రథముపైనున్న చీనాంశుకము ఎదురుగాలికి వెనుకకు లాగబడు ట'తో కాళిదాసు ఇట్లు ఉపమించెను—

"గచ్ఛతి పురః శరీరం ధావతి పశ్చాదసంస్థితం చేతః।
చీనాంశుకమివ కేతోః ప్రతివాతం నీయమానస్య॥"

—(అభిజ్ఞాన. అంక. 1 శ్లో: 36)

తన కుమార్తె 'విష్ణువును వరించితి' నని చెప్పగనే, విష్ణుచిత్తుడు ఆమె కోరికకు సంతసించియు, అది సాధ్యమగునా? అని సందేహము కలుగుచున్నదని— ఈ స్థితి యందు తన హృదయము ఎదురుగాలిచే కొట్టబడిన చీనాంశుకమువలె ఉన్నదనియు తలచును—

"విష్ణావనన్యే హృదయేతి భవామ్యహం యః
తద్వాంఛితార్థవిషయే న శశాక బోద్ధుమ్।
కార్పణ్యచంచలమివాభివదస్వరంగం
చీనాంశుకం ప్రతిసమీరహతం బభూవ॥"

—(ఉల్లా. 2 శ్లో: 10)

ఈ సందర్భమునందును, ఇంతకుముందు పేర్కొనబడిన "ప్రతిపత్సార శీలస్య........" అను ఉపమానము విషయమునను ఆచార్యులవారి ప్రయోగములు మూలములలోవలె చక్కగా అతికినట్లు కానరావు.

గోదాదేవి విష్ణువును భర్తగా కోరుట అసమంజసమని విష్ణుచిత్తుడామెను మందలింపగా— ఆమె తన అభిప్రాయమును సమర్థించుకొనుచు తండ్రికి చెప్పిన సమాధానములో—

"అసంశయం విష్ణు కరగ్రహోచితం
హ్యనన్యగం భక్తిమయం మనోఽభవత్।
అతర్కితోపస్థిత కార్యసంగమే
భవన్తి ప్రాచాం విధయః ప్రమాణమ్॥"

—(ఉల్లా: 2 శ్లో: 18)

అనగా. ఈ శ్లోకము అభిజ్ఞానశాకుంతలములోని ఈ క్రింది శ్లోకభావమును; శైలినికూడ అనుకరించుచున్నది—

"అసంశయం క్షత్ర పరిగ్రహక్షమా
యదార్యమస్యామభిలాషి మే మనః।
సతాం హి సందేహపదేషు వస్తుషు
ప్రమాణ మంతఃకరణ ప్రవృత్తయః॥"
—(అభిజ్ఞాన. అంక: 1 శ్లో 23)

పై రెండు శ్లోకముల ఎత్తుగడలు సమానముగ నుండి వీని సాదృశ్యమును వెంటనే స్ఫురింపజేయుచున్నవి.

గోదా శ్రీరంగనాథుల వివాహానంతరము విష్ణుచిత్తుడు శ్రీరంగనాథునికి పాదాభివందనముచేసి, గోదాదేవిపైనగల సుతాస్నేహాతిశయముచే గలిగిన అనురాగములో ఇట్లు పలికెను—

"పుత్రీ మే పతిగేహమేష్యతి సుతేత్యార్త్యా విలోలం మనః
స్తబ్ధం శోకరవాకులం హి హృదయం దోలాయితం సర్వదా।
చిత్తం హృత్తి హతం విభాతి వికలం జ్ఞానం క్వ యాతం హరే
దహ్యన్తే కథమాత్మజాపతిగృహప్రాప్తౌ గృహస్థాజనాః॥"
—(ఉల్లా: 5 శ్లో: 96)

అభిజ్ఞానశాకుంతలములోని చతుర్థాంకమున శకుంతలను అత్తవారింటికిపంపునపుడు కణ్వుడిట్లు చింతించును—

"యాస్యత్యద్య శకుంతలేతి హృదయం సంస్పృష్టముత్కంఠయా
కంఠః స్తంభిత బాష్పవృత్తి కలుషశ్చింతాజడం దర్శనమ్।
వైక్లబ్యం మమ తావదీదృశమహో స్నేహాదరణ్యౌకసః
పీడ్యన్తే గృహిణః కథం ను తనయావిశ్లేషదుఃఖైర్నవైః॥"
—(అభిజ్ఞా. అంక: 4 శ్లో: 8)

పై శ్లోకభావము ఆచార్యులవారిచే అనుకరింప బడినదనుట స్పష్టము. విష్ణుచిత్తుడును, కణ్వుడును బ్రహ్మచర్యనిష్ఠులే. అలౌకికజీవనులే. ఇరువురి కుమార్తె

లను పెంపుడు బిడ్డలే. దుహితృస్నేహము ఇర్వురి హృదయములను ఒకేవిధముగ కలచినది. ఈ ఘట్టమును కాళిదాసువలె చిత్రించుట అనన్యసాధ్యము. కావున ఈ ఘట్టమున కాళిదాస శ్లోకమునననుసరించుట కవి ఉచితజ్ఞతను సూచించును. నాటకవాఙ్మయముననే పరమరమ్యమగు అభిజ్ఞానశాకుంతలమున రమ్యతరమగు చతుర్థాంకము నందలి రమ్యతమగు శ్లోకచతుష్టయమున[1] శిఖరాయమాణమైనదిగదా ఈ శ్లోకము।

కావ్యనాటకములనేగాక ఆలంకారికగ్రంథములలోని భావములను సైతము ఆచార్యులవారు పరామర్శించిరి. చంద్రాలోకమున వస్తూత్ప్రేక్షాలంకారమునకు లక్ష్యముగా-

"ధూమస్తోమం తమశ్శంకే కోకీ విరహశుష్మణామ్" —(చంద్రా. శ్లో: 28)

అని— చీకటి, విరహాగ్నినుండి పుట్టిన ధూమముగా ఉత్ప్రేక్షింపబడినది. అట్లే ఆచార్యులవారు రాత్రి వర్ణన సందర్భమున చీకటిని గుడ్లగూబల తపోగ్ని ధూమమని ఇట్లు వర్ణించిరి—

"దినకరకిరణ ప్రభా తిరస్కృత దివాభీత తపః ప్రభావ ప్రభూతాగ్ని ధూమ రేఖా విధూమితం కిము" —(ఉల్లా: 2 పద: 34)

ఆచార్యులవారు తమకు చిరపరిచితమైన పోతన భాగవతములోని భావములను కూడ ఒకటిరెండుచోట్ల స్పృశించిరి.

గోదాదేవి బాల్యమును వర్ణించుచు ఆచార్యులవారు—

"విహరతి సఖీయుక్తా సంస్థాప్య కృత్రిమ పుత్రికాః।
వితరతి మదుషీరాహూపాన్నశాక ఫలాని సా"
—(ఉల్లా: 1 శ్లో. 33)

పోతన తన భాగవతమునందు రుక్మిణీదేవి బాల్యక్రీడలను వర్ణించుచు—

"పేర్వేర బొమ్మల పెండ్లిండ్లు సేయుచు
నబలలతోడ వియ్యంబులందు
గుజ్జన గూళ్లను గొమరొప్ప వండించి
చెలులకు బెట్టించు చెలువు మెరయ"
—(పోతన-ఆంధ్రమహాభాగవతము: దశమస్కంధము: పద్య: 1687)

1. 'కావ్యేషు నాటకం రమ్యం తత్ర రమ్యా శకుంతలా।
తత్రాపి చ చతుర్థోంకః తత్ర శ్లోకచతుష్టయమ్॥" —(అభియుక్తోక్తి)

అని పలికెను. ఈ భావమునే ఆచార్యులవారు తమ శ్లోకమున గ్రహించిరని భావింపవచ్చును.

గోదాదేవి, శ్రీరంగనాథుని వరించిన తన హృదయము అన్యమును కోరదని విష్ణుచిత్తునకిట్లు తెలిపెను—

"పరమపురుషాయత్తం చిత్తం తదన్యమపేక్షితుం
ప్రభవతు కథం భృంగస్త్యక్త్వాంబుజం మదనం వ్రజేత్"
—(ఉల్లా. 2 శ్లో: 5)

పోతన భాగవతములోని ప్రహ్లాద చరిత్రమునందు— 'ఎంతవారించినను ఆ శ్రీహరినే ఏల భజించెద'వని ప్రశ్నించిన గురువునకు సమాధానముగా ప్రహ్లాదుడు—

"మందార మకరంద మాధుర్యమునదేలు
మధుపంబు పోవునే మదనములకు
.................................
.................................

అంబుజోదర దివ్య పాదారవింద
చింతనామృత పాన విశేషమత్త
చిత్తమేరీతి నితరంబు జేరనేర్చు?
వినుతగుణశీల! మాటలు వేయునేల?"

—(పోతన—ఆంధ్రమహాభాగవతము: సప్తమస్కంధము: పద్య: 150)

పై పద్యములోని ఉదాహృతపాదములను ఆచార్యులవారి శ్లోకపాదములు సంగ్రహానుసరణములు.

ఇటు భావానుసరణములేగాక, కొన్ని చోట్ల శ్లోకము ఉపక్రమించుటలోను; దాని నడకలోను ప్రాచీనకవుల శ్లోకమొకటి పాఠకునకు స్ఫురించును. వీనిని తత్కావ్యాల శైలికి అనుసరణములుగా భావింపవచ్చును. వచనమునగూడ ఇట్టి అనుసరణ మున్నది

విష్ణుచిత్తుని నివాసస్థానమగు శ్రీవిల్లిబుత్తూరును (చాపనగిరి) వర్ణించుటకు ఆచార్యులవారు ఇట్లు ఉపక్రమించిరి—

"యా హి సమస్తనగరీ తిలకాయమానా- నిజమణిమయమందిరాగ్ర జయధ్వజ విచాలిత మహేంద్రపుర వైభవా................" —(ఉల్లా: 1 వచ: 7)

ఈ ఎత్తుగడ మహాకవి దండి దశకుమార చరిత్రమునందలి—

"అస్తి సమస్తనగరీ నికషాయమాణా. . ........"

(దశకుమార చరితమ్: ప్రథమోచ్ఛ్వాసః)

అను ఎత్తుగడను స్ఫురింపజేయును.

భోజుని చంపూరామాయణములో దేవతలు విష్ణువును స్తుతించిన ఘట్టమును—

"నారాయణాయ నలినాయతలోచనాయ
నామావశేషిత మహాబలివైభవాయ।
నానాచరాచర విధాయక జన్మదేశ
నాభీపుటాయ పురుషాయ నమః పరస్మై॥"
— (చంపూరామాయణమ్: బాలకాండః శ్లో : 16)

అను శ్లోకమున్నది.

తులసీవనమున పసిపాప లభింపగా- విష్ణుచిత్తుడు విష్ణువునిటు నుతించును.

లక్ష్మీనమ్యుల్లసిత పంచదురస్థలాయ।
జ్యోతి ప్రభాపరీత త్రిదశాసు తుల్యం
నిత్యం నమోஉస్తు పరమప్రకయాయ పుంసే॥"
(ఉల్లా. 1 శ్లో. 20)

ఇచట రెండును విష్ణుస్తుతులే అగుటయు; ప్రథమపాదములో రెండు చతుర్థ్యంతములు; ద్వితీయ పాదములో ఒకే చతుర్థ్యంత ముండుటయు ఈ రెండు శైలీ సామ్యము రెండుశ్లోకములలోను ప్రథమపాదము 'లోచనాయ' అను పదముతో ముగియుటయు సామ్యమును సూచించును

గోదాదేవి శ్రీరంగనాథుని పరిణయమాడుటకై శ్రీరంగమునకు బయలుదేరు చున్నది. 'పరమైకాంతి' యగు విష్ణుచిత్తునకు సైతము పుత్రికా వాత్సల్యముచే మనో ధైర్యము సడలినది. ఆ సందర్భమున విష్ణుచిత్తుడు—

"యాస్యత్యత్ర మతా కచోద్ధృతసుమప్రీతప్రియానందినీ
గోదామేఽత్ర కృతినప్తశీర్యశతసంఖ్యాకేన పద్యాత్మనా।
ద్రావిడ్యాకృతినా సమర్పితవతీ గ్రంథద్వయంశార్ఙ్గిణే
సేయం మద్దుహితాకథంపతిగృహం నిర్యాతబంధాకృతిః॥"
—(ఉల్లా: 5 శ్లో: 79) అని పలుకును.

ఈ శ్లోకములోని ఎత్తుగడ అభిజ్ఞానశాకుంతలములోని "యాస్యత్యద్య శకుంతలేతి........" ఇత్యాది శ్లోకముయొక్క ఆరంభమును; చివరిపాదము "పాతుం న ప్రథమం........" ఇత్యాది శ్లోకములోని చివరిపాదమగు "సేయంయాతి శకుంతలా పతి గృహంసర్వైరనుజ్ఞాయతామ్" (అంక: 4 శ్లో: 11) అనుదానిని స్ఫురింపజేయును.

అభిజ్ఞాన శాకుంతలములో దుష్యంతుడు కణ్వాశ్రమమున గాంధర్వ వివాహానంతరము శకుంతలను ఇట్లు అనునయించును—

"కిం శీతలైః క్లమ వినోదిభిరార్ద్రవాతాన్
సంచారయామి నలినీదల తాలవృంతైః॥
అంకే నిధాయ కరభోరు! యథాసుఖంతే
సంవాహయామి చరణావుత పద్మతామ్రౌ॥"
—(అభిజ్ఞాన. అంక: 3 శ్లో: 18)

ఉద్యానవనమున ఏకాంతమున క్రీడార్థమై కట్టుకొన్న గోదాదేవి నేత్రపటమును తొలగించి, స్వామి గోదాదేవితో సానురాగముగ ఇట్లు పలుకును—

"హస్తేనివేశ్యమమహస్తమిదం ప్రశస్తం
రంభోరు! కంకణ మహంకిము బంధయామి।
మాంగల్యసూత్రమపితే కలకంఠకంఠి!
కంఠే వికుంఠపతి మండన మాతనోమి॥" —(ఉల్లా: 4 శ్లో: 38)

ఈ రెండు శ్లోకముల సందర్భము ప్రియుడు ప్రియురాలిని అనునయించుటయే. కాళిదాసశ్లోకమునందలి ఉత్తరార్థమునగల శైలిని ఆచార్యులవారి శ్లోకము స్ఫురింపజేయుచున్నది. శ్లోకములోని 'రంభోరు!' అను సంబోధనము, ఈ శ్లోకమునకు ముందుగల వచనములో 'కరభోరు!' అను సంబోధనమును, ఆచార్యులవారు పై కాళిదాస శ్లోకమును దృష్టియందుంచుకొనియే తమ శ్లోకమును రచించిరనుటకు అవకాశమిచ్చుచున్నది.

ఇట్లు ఈ కావ్యమున పలుతావులలో ఆచార్యులవారు పూర్వకవుల భావాదులను స్ఫురింపజేసి, తమ బహుకావ్య పరిచయమును ప్రకటించిరి.

# తాత్త్విక ప్రకరణము

## తత్త్వవివేచనము

అతి ప్రాచీనము, వివిధ శాఖోపశాఖాశోభితమునగు భారతీయ తాత్త్విక మహా వృక్షమునందు వైష్ణవ తత్త్వశాఖ యొకటి. వైష్ణవ ధర్మమునకు బీజములు వేదములోనే అంకురించినవి.[1] ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రములు, భగవద్గీతలలో అవి పుష్పించినవి. పన్నిద్దరాళ్వారుల రచనలలోను, నాథయామున రామానుజ వేదాంత దేశికాద్యాచార్యుల కృషిచేతను ఫలించినవి. వైష్ణవధర్మమునగల నాలుగు సంప్రదాయములలో భగవద్రామానుజుల 'విశిష్టాద్వైతము' ఒకటి.[2] ఇది ఆద్యప్రవక్త్రియగు శ్రీదేవి పేర "శ్రీ సంప్రదాయ"మని పిలువబడుచున్నది.

తమిళదేశమున శ్రీ వైష్ణవ సంప్రదాయమునకు విశేష ప్రచారమొనర్చి, విష్ణు పారమ్యమును, భక్తిప్రపత్తులను ప్రచారమొనర్చినవారు పన్నిద్దరు ఆళ్వారులు.[3] వీరి రచనలను అన్నింటిని "నాలాయిర దివ్యప్రబంధము" అను పేర సంకలనమొనర్చినవారు శ్రీ నాథముని. ఇది "ద్రవిడవేదము"గా ప్రసిద్ధిచెందినది. ద్రవిడవేదమునందు ప్రతిపాదింపబడిన తత్త్వములకు వేదోపనిషత్తులలో సమన్వయమును కల్పించినవారు భగవద్రామానుజులు. ఆళ్వారులు ప్రతిపాదించిన వైష్ణవతత్త్వమును, వేదోపనిషదాదులలోని వైష్ణవతత్త్వమును కలిసి "ఉభయవేదాంత" మైనది. బ్రహ్మసూత్రములకు శ్రీభాష్యమనబడు 'శారీరక మీమాంసా' భాష్యమును రచించిన మనీషి భగవద్రామానుజులు

---

1. 'ఇదం విష్ణుర్విచక్రమే త్రేధా నిదధే పదమ్। సమూఢమస్యపాగ్ం సురే'॥
—ఋగ్వేదము: 1-22-17
2. శ్రీ, బ్రహ్మ, రుద్ర, సనక సంప్రదాయములు నాలుగు. ఇవి క్రమముగా భగవద్రామానుజుల విశిష్టాద్వైతము, మధ్వాచార్యుల ద్వైతము, వల్లభాచార్యుల శుద్ధాద్వైతము, నింబార్కుల ద్వైతములుగా వ్యాప్తి చెందినవి.
3. ఆళ్వారులను గూర్చిన పరిచయము 'అనుబంధము-1'లో ఈయబడుచున్నది.

భగవద్రామానుజులు ప్రతిపాదించిన "విశిష్టాద్వైతము"లోని సారాంశమును స్థూలముగా ఇట్లు చెప్పవచ్చును.

"తత్త్వములు మూడు. అవి- చిత్తు, అచిత్తు, ఈశ్వరుడు చిత్తుఅనగా జీవుడు. అచిత్తు అనగా ప్రకృతి లేక జడము. ఈశ్వరుడు సర్వాంతర్యామి. ఈశ్వరుడు చిత్తు, అచిత్తులచే కూడియుండును. ఈశ్వరుడు సత్తు. మిగిలినదంతయు అసత్తు. జీవుడు, జగత్తు ఇవి రెండును నిత్యములు, స్వతంత్రములు అయినను అవి ఈశ్వరాధీనములైయుండును. జీవ జగత్తులలో ఈశ్వరుడు అంతర్యామియై ప్రకాశించును. కనుక చిదచిత్తులు ఈశ్వరుని శరీరములుగను, మార్గములుగను పేర్కొనబడును. ఈశ్వరుడు పర, వ్యూహ, విభవ, అంతర్యామి, అర్చారూపములచే విరాజిల్లును. వీనిలో పర, అంతర్యామి రూపములు చిదచిత్తునకు స్పష్టముగ అందవు. వీనిలో పరరూపము పరమపదమందుండునది. వ్యూహములు నాలుగు- అవి— ప్రద్యుమ్న, అనిరుద్ధ, సంకర్షణ, వాసుదేవములు. రామకృష్ణాద్యవతారములు విభవములు. చరాచరములందు స్వామి అంతర్యామియై యుండును లీలా విభూతి యందు భక్తులకు సృష్టిగోచరమై అర్చనకు యోగ్యమై యున్న రూపము అర్చావతారము

ఈశ్వరునకు నిత్యవిభూతియు, లీలా విభూతియునను విభూతి ద్వయముండును. శ్రీ విశిష్టుడై శేషపర్యంకమున నిత్యసూరులచే పరివేష్టితుడై యుండు స్థితి ఈశ్వరుని నిత్యవిభూతి. ఇది పరమపదస్థానమనియు, అప్రాకృత దివ్యలోకమనియు చెప్పబడును. అనంత, గరుడ, విష్వక్సేనాదులు నిత్యసూరులు. నిత్యవిభూతి నుండి లీలావిభూతి జనించును. సృష్టి స్థితి లయాదులు ఈశ్వరుని లీలావిభూతిలోనివి. లీలావిభూతికే ప్రాకృతలోక మనియు, పాంచభౌతికలోకమనియు పేర్లు

ఈశ్వరుడు అష్టగుణాన్వితుడు "అపహతపాప్మా, విజరో, విమృత్యు, ర్విశోకో, విజిఘత్సోఽపిపాసు, సత్యకామ, స్సత్యసంకల్పః" అని ఈశ్వరుని అష్టగుణములు పేర్కొనబడినవి. ఈశ్వరుడు విశేష్యము. చిదచిత్తులాతని విశేషణములు. కావున అతడు చిదచిద్విశిష్టుడు అని పేర్కొనబడుటచే రామానుజ సంప్రదాయమునకు "విశిష్టాద్వైత" మను పేరు వచ్చినది.

జీవేశ్వరులకు నడుమ నవవిధ సంబంధములుండును—

1. జన్యజనక సంబంధము: దీనికే 'కార్యకారణ సంబంధ' మనియు; 'పితాపుత్ర సంబంధ' మనియు పేరు. భగవంతుడు చిదచిత్తులకు సృష్టిస్థితి కారకుడు. కావున ఇతడు జనకుడు, చిదచిత్తులు జన్యములు.

2. రక్ష్యరక్షక సంబంధము: భగవంతుడు సర్వతంత్ర స్వతంత్రుడు. జీవుడు పరతంత్రుడు. ఈ స్వాతంత్ర్యపారతంత్ర్యములు జీవాత్మ, పరమాత్మలకు సహజ స్వరూపములు. కనుక ఈశ్వరుడు రక్షకుడు, జీవాత్మ రక్ష్యము.

3. శేషశేషిభావ సంబంధము: యథేచ్ఛగా చేతనాచేతనములను వాడుకొన గలవాడు శేషి. శేషిచే వాడుకొనబడునవి శేషములు. 'యథేష్టవినియోగార్హత్వం శేషత్వమ్'[1] అని నిర్వచనము. శేషశేషిత్వమునే సేవ్యసేవక భావమనియు అందురు. పరమాత్మ సేవ్యుడు. జీవాత్మ సేవకుడు.

4. భార్యాభర్తృ సంబంధము: అన్ని సంబంధములలోను ఇది ప్రధాన మైనది. భరించువాడు భర్త. భరింపబడునది భార్య. అట్లే అస్వతంత్రుడగు జీవుడు తన ధారణ పోషణాదులకై పరమాత్మపై ఆధారపడి, అతనిని అవ్యభిచరితభక్తితో సేవించును. భగవంతుడు తద్రక్షణ కారణమునందు నిమగ్నుడై జీవులకు ఐహిక, ఆముష్మిక సౌఖ్యములను కలిగించును.

5. జ్ఞాతృజ్ఞేయ సంబంధము: జీవాత్మ జ్ఞాత. అనగా ఎరుగువాడు. ఈశ్వరుడు జ్ఞేయము. అనగా ఎరుగదగినవాడు.

6. స్వ-స్వామిభావసంబంధము: "స్వమ్"అనగా సొత్తు. అదికలవాడు స్వామి. చేతనా చేతనాత్మకమగు జగత్తంతయు భగవంతుని సొత్తు.

7. ఆధారాధేయ సంబంధము: దీనికే "ధార్యధారక సంబంధ" మనియు పేరు. చేతనాచేతన పదార్థములు అధేయములు. వీనిని తనయందుంచుకొనుటచే ఈశ్వరుడు ఆధారము.

1. తాత్పర్యదీపిక: పుట: 134 (రం.వా.రా.తు.ప. నుండి ఉద్ధృతము) పుట: 149

8. శరీర శరీరిభావ సంబంధము: జీవునకు జడమగు పాంచభౌతిక ప్రకృతి శరీరమైనట్లే, పరమాత్మకు అష్టవిధ ప్రకృతియు, జీవభూత ప్రకృతియు శరీరములు. కనుక అతడు వీనిచే 'శరీరి' యగుచున్నాడు.

9. భోగ్యభోక్తృత్వభావ సంబంధము: పరమాత్మ భోక్త. అనగా అనుభవించువాడు. జీవాత్మ భోగ్యము. అనగా అనుభవింపబడునది. జీవాత్మయే భోక్త యనియు, పరమాత్మ భోగ్యమనియు మరియొక వ్యవహారమున్నది.

లీలావిభూతియందలి ఎనుబదినాలుగు లక్షల జీవరాసులలో మానవుడు ఉత్తమోత్తముడు. దేహము నశ్వరమని గ్రహించి, మోక్షమునందిచ్ఛగలిగి, ఆ పరమార్థ జ్ఞాన ప్రాప్తికి ప్రయత్నించువారు ముముక్షువులు. సాయుజ్య, సాలోక్య, సారూప్య, సామీప్యములుగా ముక్తి చతుర్విధము. జీవుడు ఈశ్వరునితో కలిసియుండుట సాయుజ్యమనియు, ఒకేలోకమున నుండుట సాలోక్యమనియు, ఒకేరూపముననుండుట సారూప్యమనియు, సన్నిధిలోనుండుట సామీప్యమనియు చెప్పబడును. ముముక్షువైన వానికి జ్ఞానత్రయము ఉపాదేయము.[1] స్వజ్ఞానము (ఆత్మస్వరూపము నెరుగుట); ప్రాపకజ్ఞానము (ఈశ్వరుని చేరదగు మార్గము నెరుగుట); ప్రాప్యజ్ఞానము (చేరదగిన ఈశ్వరుని గూర్చి తెలిసికొనుట). ఇట్లే ముముక్షువునకు అర్థపంచక జ్ఞానమావశ్యకము. స్వస్వరూప (ఆత్మతత్త్వము); పరస్వరూప (ఈశ్వరతత్త్వము); ఉపాయస్వరూప (ఈశ్వరప్రాప్తిమార్గము), విరోధిస్వరూప (ఫలప్రాప్తికి విరోధి తత్త్వము); ఫలస్వరూప (పురుషార్థములు) ములు ఐదును అర్థపంచక మనబడును. పరమాత్మవలెనే జీవుడును నిత్యుడు, చేతనుడు, సనాతనుడు, అణుస్వరూపుడనై పరమాత్మకు పరతంత్రుడుగా నుండునని ఎరుగుట స్వస్వరూపజ్ఞానము. పర, వ్యూహ, విభవ, అంతర్యామి, అర్చారూపములనెరుగుట పర స్వరూపజ్ఞానము. కర్మ, జ్ఞాన, భక్తి, ప్రపత్తి, ఆచార్యాభిమానములు ఉపాయపంచకము- వేద ప్రతిపాదితములగు కర్మలను ఆచరించి, అష్టాంగయోగముచే పరమాత్మను సేవించి, సంసారనివృత్తి పొందుట కర్మయోగము. నిష్కామ కర్మలచే చిత్తైకాగ్రత కలిగి జ్ఞానముదయించును. కర్మజ్ఞానాదులకన్న విశిష్టమైనది భక్తి. "భక్తియు జ్ఞానవిశేషమే"అని భగవద్రామానుజులు పేర్కొనిరి.[2] భక్తి యనగా అష్టాంగయోగములోకూడి తైలధారవలె అవిచ్ఛిన్న

---

1. స్వజ్ఞానం ప్రాపక జ్ఞానం ప్రాప్యజ్ఞానం ముముక్షుభిః॥
జ్ఞానత్రయ ముపాదేయం ఏతదన్యన్న కించన॥
2. 'భక్తిశ్చ జ్ఞానవిశేషః'—వేదార్థ సంగ్రహము: పుట: 45

మగు స్మృతి సంతానరూపము.[1] పరభక్తి, పరజ్ఞానము, పరమభక్తి అని భక్తి త్రివిధము. వీనిలో చివరి దశ 'పరమభక్తి', భగవదనుభవము తొలఁగునను భీతిచే నిరంతరమారాధించుట పరమభక్తి.[2] భక్తియందు స్వామికి కైంకర్యమొనర్చుట ప్రధానము. ఇది గృహసమ్మార్జన జలాహరణ మాలాకరణాది రూపమున నుండును. సర్వమును భగవదధీనముచేసి, స్వతంత్ర ప్రవృత్తి లేకయుండుట పారతంత్ర్యము. ఇది భక్తునకావశ్యకము. ఈ భక్తియోగమునకు అనంతర సోపానము ప్రపత్తిమార్గము. కర్మ జ్ఞాన భక్తియోగములందు అశక్తులైనవారికి సుకరమును శీఘ్రఫలప్రదమును అగు ఉపాయము ప్రపత్తి. దీనినే "శరణాగతి" యనియు; ప్రణిపతన మనియు అందురు. "ప్రపత్తి"యనగా—

"అనన్యసాధ్యే స్వాభీష్టే మహావిశ్వాసపూర్వకమ్।
తదేకోపాయతా యాంచ ప్రపత్తిరితి గద్యతే॥"[3]

ఈ ప్రపత్తికి అకించనత్వము, అనన్యగతిత్వములు ప్రధానములు. అనగా తాను అకించనుడనియు, నారాయణునిన్న వేరొకరక్షకుడు లేడనియు పరిపూర్ణముగ విశ్వసించుట. ఈ ప్రవృత్తి ఆరువిధములు—[4] అవి— ఆనుకూల్య సంకల్పము (భగవంతునికి అభిముఖులగుట); ప్రాతికూల్య వర్జనము (భగవంతునికి విముఖుడు కాకుండుట); రక్షించునను విశ్వాసము (భగవంతుడు తనను తప్పక రక్షించునని

---

1. 'భక్తియోగో నామ యమనియమాసన ప్రాణాయామ ప్రత్యాహారధారణ ధ్యానసమాధిరూపాష్టాంగవత్తైలధారావదవిచ్ఛిన్న స్మృతి సంతానరూపః'
—(యతీంద్రమతదీపిక: పుట: 20)
-Sravana, Manana & Nidhidhyasana పుట. 40 నుండి ఉద్ధృతము)
2. పునర్విశ్లేషభీరుత్వం పరమాభక్తిరుచ్యతే.
3. తమిళ్ ఔర్ హిందీకా భక్తి సాహిత్య- పుట. 287 నుండి ఉద్ధృతము.
4. "ఆనుకూల్యస్య సంకల్పః ప్రాతికూల్యస్య వర్జనమ్।
రక్షిష్యతీతి విశ్వాసః గోప్తృత్వవరణం తథా॥
ఆత్మనిక్షేపకార్పణ్యే షడ్విధాశరణాగతిః॥"
—బ్రహ్మాండ పురాణము-ఉత్తరభాగము.
లలితోపాఖ్యానము: అధ్యా: 41 శ్లో: 76, 77
—రం.వా.తు.ప. పుట: 406 నుండి ఉద్ధృతము.

విశ్వసించుట); గోప్తృత్వవరణము (భగవంతుడే తనకు రక్షకుడను అభిప్రాయమును ప్రకటించుట); ఆత్మనిక్షేపము (తాను భగవదధీనుడనియు, తన సమస్తము భగవంతునిదే అనియు తెలుపుట); కార్పణ్యము (రయములో దీనుడై యుండుట).

అనన్య శేషత్వము (శ్రీమన్నారాయణునకు మాత్రమే ఇష్టము వచ్చినట్లు వినియోగించుకొనదగియుండుట); అనన్యభోగ్యత (శ్రీమన్నారాయణుడొకడే ప్రీతితో అనుభవింపదగినవాడుకాని, వేరొకరు కాకుండుట); అనన్య శరణత్వము (శ్రీమన్నారాయణుడు తప్ప ఇతరు లెవ్వరును రక్షకులుకాకుండుట) అనునవి 'అకారత్రయ' మనబడును. ఇవి ప్రపన్నుడగు వానికి ఆవశ్యకములు. భగవంతునకు తాను భార్యగను, మాతగను, సఖిగను భావించుకొని భక్తుడుచేయు ఆరాధనము- 'అవస్థాత్రయ' మనబడును. భక్తుడు పురుషుడైనప్పుడు కూడ తనయందు స్త్రీత్వము నారోపించుకొని భగవంతుని ఇట్లు సేవింపవచ్చును. పెరియాళ్వారులు తానే యశోదయై మాతృభావమును పొంది భగవంతుని ఆరాధించెను.[1] నమ్మాళ్వారు, తిరుమంగై ఆళ్వారు భార్యాత్వము నారోపించుకొని సేవించిరి.[2]

—ఇది అంతయును విశిష్టాద్వైతమునందలి తాత్త్విక సంప్రదాయము.

భగవద్రామానుజుల అనంతరము విశిష్టాద్వైతమున తెంగలై, వడగలై అను రెండు శాఖలు ఏర్పడినవి. తెంగలై శాఖకు ప్రథమాచార్యుడు- పిళ్లలోకాచార్యులు. ఈతని 'శ్రీవచనభూషణ'మను గ్రంథము ఈ శాఖీయులకు పరమ ప్రమాణము. ఈ మార్గము మనవాళ మహాముని చేతిలో అత్యున్నతదశను చేరుకొన్నది. వడగలై శాఖకు ఆద్యులనదగినవారు-వేదాంతదేశికులు. వీరు పిళ్లలోకాచార్యుల సమకాలీనులు.

తెంగలులకు, వడగలులకు ప్రధానభేదములివి-[3]

ఉభయులును ఉభయవేదాంతముల ప్రామాణ్యము నంగీకరించినను, తెంగలులకు ద్రవిడవేదాంతము పరమప్రమాణము. వడగలులకు శ్రుతిమార్గము పరమ ప్రమాణము. తెంగలై శాఖీయులు నారాయణుడు డొక్కడే శేషియనియు, లక్ష్మికూడ

1. పెరియాళ్వార్ తిరుమొళి
2. శిరియతిరుమడల్; పెరియతిరుమడల్
3. ఈ రెండుశాఖల మధ్యగల 18 సిద్ధాంత భేదములు 'అనుబంధము-II' లో పేర్కొనబడుచున్నవి.

జీవకోటిలో చేరినదే కనుక, ఆమె శేషికాదనియు ప్రతిపాదింతురు. వడగలై శాఖీయులు నారాయణునకు వలెనే, లక్ష్మికిని శేషిత్వము నంగీకరింతురు. అంతేగాక తెంగలుల మతమున భగవంతుని కృప నిర్హేతుకజాయమానము. వడగలులకు స్వామికృప సహేతుకము. ఒకటి 'మార్జాలకిశోరన్యాయము'- మరొకటి మర్కటకిశోరన్యాయము.

శ్రీమాన్ అమరవాడి వేంకటనరసింహాచార్యులవారు 'తెంగలై' శాఖీయులు. ఆ కాలములోని సాంప్రదాయిక విశ్వాస విశేషములను తమ రచనలలో విస్తృతముగ ప్రతిబింబింపజేసిరి. ఆ తాత్త్విక విశేషములను నమన్వయించుకొననిచో ఆచార్యులవారి రచనలోని విశిష్టత గోచరింపదు. కేవలము కావ్యలక్షణ దృష్టిలో ఈ రచనను పరిశీలించినచో ఆచార్యులవారి ఈ ప్రయత్నములోని అంతస్తత్త్వమవగతము కాదు. ఆచార్యులవారి రచనలో విశిష్టాద్వైత సంప్రదాయములు, అందునను-'తెంగలై' శాఖా సంప్రదాయములు ఎట్లు ప్రతిఫలించినవో ప్రతిపాదించుటయే ఈ వ్యాసభాగము యొక్క ఉద్దేశ్యము.

విశిష్టాద్వైతమున పరమాదరణీయమగు ఈ వృత్తాంతమును స్వీకరించుటయందే ఆచార్యులవారి ఆశయము వ్యక్తమగును. విష్ణుచిత్తుని వృత్తాంతములో కలిపియే ఈ కథను ఇతర ద్రావిడ గ్రంథకర్తలు గాని, తెలుగులో శ్రీకృష్ణదేవరాయలుగాని వర్ణించిరి. ఈ గ్రంథమున కేవలము గోదాదేవి కథ మాత్రమే కూర్పబడినది. విష్ణుచిత్తుని పాండ్యరాజసభావిజయము మున్నగు ఘట్టములు విష్ణుపారమ్యస్థాపకములే అయినను ఆయా ఘట్టములలోని నారాయణుని కృప సహేతుకమని ప్రతిపాదించుటకే అవకాశము లెక్కువ. తెంగలులకిది సమ్మతముకాదు. కావున ఆచార్యులవారు విష్ణుచిత్తుని వృత్తాంతమును గోదాదేవికి సంబంధింపనిదానిని స్వీకరింపలేదు.

గ్రంథారంభమున ఆచార్యులవారు గోదాదేవినిట్లు స్తుతించిరి—

"స్వకేశోన్ముక్త సన్మాలా పాశబోధిత కేశవామ్,
వేదాపాదిత సద్గాథాం గోదాదేవీముపాస్మహే॥"
—(ఉల్లా: 1 ప్రార్థనాశ్లోకము)

ఇచట వేదమనగా ద్రావిడవేదమే. ఈ ద్రవిడవేద ప్రాధాన్యమును ప్రతిపాదించుటయే ఆచార్యులవారి 'తెంగలై' శాఖీయాభిమానమును సూచించును. గోదాదేవిని తమిళమున 'కోదై' అని పిలుతురు. ఆ భాషలో పదాదియందు సరళవర్ణోచ్చారణ

ముందరు. ఈ తమిళ శబ్దమునకు 'మాల' యని అర్థము. స్వామిని గోదాదేవి అర్పించినది. 'స్వకేశోమ్మక్తసన్మాలిక' తోడనే. కావుననే ఆమె "ఆముక్తమాల్యద"-"శూడి కొడుత్తమ్మాళ్" అని ప్రసిద్ధి కెక్కినది. ఈ 'మాల'[1] ఆ సుమమాలను స్వామి మెడలో వేసినది. ఆ మాల ఈ మాలా సౌందర్యమునకు ప్రతిబింబము. అనగా గోదాదేవి తన దివ్యసౌందర్యముచే స్వామిని నిగళీకృతునిజేసి, తనకు వశుని గావించుకొన్నది. 'తెంగలై' సంప్రదాయమును అనుసరించి వైషిత్యములేని జగన్మాత[2] తన సౌందర్యముచే స్వామిని వశవర్తిగా జేసికొని ఆయనచే జగద్రక్షణము చేయించును. ఈ విషయమునే ప్రాచీనాచార్యులు—

"స్వోచ్ఛిష్టమాలికాబంధ గంధబంధుర జిష్ణవే।
విష్ణుచిత్తతనూజాయై గోదాయై నిత్యమంగళమ్॥"
—(ప్రాచీనాచార్యపరంపరాగతము)

"నీళాతుంగస్తనగిరితటీ సుప్తముద్బోధ్య కృష్ణం
పారార్థ్యం స్వం శ్రుతిశతశిరస్సిద్ధమధ్యాపయన్తీ।
స్వోచ్ఛిష్టాయాం స్రజి నిగళితం యాబలాత్కృత్య భుంక్తే
తస్మై గోదా నమ ఇదమిదం భూయఏవాస్తు భూయః"
—(శ్రీ పరాశరభట్టరు) అని ప్రస్తుతించిరి.

ధన్విపుర నివాసియగు విష్ణుచిత్తుని గూర్చి ఆచార్యులవారిట్లు వర్ణించిరి—

"తదీయవైభవ ప్రకాశనపరగజ ఘంటా నివేదిత ఉదీయ పారమ్య దివ్య మంగళ విగ్రహ మాంగలిక పద్య రచనానివేదిత స్వాత్మీయ శేషశేషి భావ సంబంధ స్వరూపః" —(ఉల్లా 1 పే: 17)

ఈ వాక్యమున- ఆళ్వారుల చరిత్రములలో వర్ణింపబడిన విష్ణుచిత్తుని పాండ్య సభాజయవిశేషము స్మరింపబడినది. విష్ణుపారమ్య స్థాపనానంతరము పాండ్యరాజు

---

1. గోదాదేవి విష్ణుచిత్తుల పుణ్యనివాసము 'వైగై' నదీతీరము.
వైగైనదికి 'కృతమాలా' అని సంస్కృతనామము.
2. శ్రీ భూనీళలకు ద్రావిడ ప్రబంధములు సమానప్రతిపత్తి నంగీకరించినవి.
—(నమ్మాళ్వార్-'తిరువిరుత్తం'-'కుళన్ కోనలర్' అనుపాశురము)
అ.సౌ. పుట: 308 నుండి ఉద్ధృతము.

విష్ణుచిత్తునికి 'గజారోహణోత్సవము' జరుపగా, ఆ వైభవమును స్వయముగ తిలకించుటకు శ్రీమన్నారాయణుడు విచ్చేసెను. ఆ దివ్యమంగళ విగ్రహమునకు జనుల దృష్టిదోషము తగలకుండగా విష్ణుచిత్తుడు మాంగల్యరక్షను పలికెను. ఇది 'తిరుప్పల్లాండు'[1] అను పేర శ్రీ వైష్ణవులకు నిత్యపారాయణమునందున్నది. దాని ఆరంభ మిట్లుండును.—

"పల్లాణ్డుపల్లాణ్డు పల్లాయిరత్తాణ్డు పలకోడి నూఱాయిరమ్
మల్లాణ్డ తిణ్డోళ్ మణివణ్ణా ఉన్ శేవడి శెవ్వి తిరుక్కాప్పు"[2]
—(తిరుప్పల్లాండు. పెరియాళ్వార్)

(బాణూర ముష్టికాది బలశాలులనువధించి పేరుపడసియుండు భుజబలములతో నుండువాడా! ఇంద్ర నీలమణిలో సమానముగ నుండు తిరుమేను కాంతి గలవాడా! అనేక సంవత్సరములు జయముతో నుండగలవు. నీయొక్క శ్రీపాద సౌందర్యమునకు రక్షకలుగుగాక)[3]

ఈ 'తిరుప్పల్లాండు' ఆచార్యులవారిచే ఇచట ప్రస్తావింపబడినది. ఈ వర్ణనలోని పూర్వవాక్యములందుగూడ విశిష్టాద్వైత ప్రతిపాదితమగు నారాయణ పారమ్యము పేర్కొనబడినది.

విష్ణుచిత్తుని 'నిత్యార్చనాపద్ధతి' ఇట్లు ఆచార్యులవారిచే వర్ణింపబడినది—

---

1. 'శ్రియః పతి పేసాతిశయమును ప్రార్థించు విషయమున తక్కిన తొమ్మండుగు రాళ్వారులకంటె విష్ణుచిత్తులు గొప్పవారు. ఇందుచే వారికి పెరియాళ్వారని పేరు కలిగినది.' (ఆంధ్రానువాదము)
—(మూలము. మణవాళమహాముని ఉపదేశరత్నమాల)
ఆ సౌ. పుట: 315 ఉద్ధృతము.

2. "సంస్కృతవేదమునకు ఓంకారము ప్రథమమునున్నట్లు దివ్యప్రబంధము లన్నిటికిని మంగళకరమైనదగుటచే 'తిరుప్పల్లాండు' మొదటి ప్రబంధము" (ఆంధ్రానువాదము)—మూలము: మణవాళ మహాముని-'ఉపదేశరత్నమాల'
—ఆ.సౌ. పుట: 315 ఉద్ధృతము

3. ఆంధ్రటీక— శ్రీ నేలటూరు భక్తవత్సలమయ్యంగారు.
—('తిరుప్పల్లాండు-పెరియాళ్వార్ తిరుమొళి' పుట: 7)

"స్నాతిధ్యాయతి నిందతి ప్రవదతి ప్రస్తౌతి దీవ్యత్యసౌ
ప్రీత్యోత్తిష్ఠతి గాయతి ప్రణమతి వ్యాముహ్యతిస్నిహ్యతి।
ప్రేమాంధేన కుటుంయునా స్వ మనసా కైంకర్యనిష్ఠాజుషా
పుష్పాలంకరణేఽనహంయు రకరోన్నిత్యార్చనా పద్ధతిమ్॥"
—(ఉల్లా: 1 శ్లో: 18)

(భగవంతుని కైంకర్యమునందు నిష్ఠగలవారైన విష్ణుచిత్తుడు ప్రేమాంధము, కుటుంయుతమునగు మనస్సుచే అహంకార విరహితుడై పుష్పాలంకరణరూపములగు కైంకర్యములచే తన నిత్యార్చనాపద్ధతి నొనరించెను. అతని నిత్యార్చనా పద్ధతి ఎట్టి దనగా-ప్రతినిత్యము స్నానమాచరించుట, భగవంతుని ధ్యానించుట, పూదోటలో చెట్ల పాదులను త్రవ్వుట, భగవత్తత్త్వమును ప్రవచించుట, భగవంతుని చూచుటకు ఆసనంములో లేచి నిలుచుట, భగవంతుని కీర్తనలు గానముచేయుట, భగవంతునికి నమస్కరించుట, భగవద్విషయమున వ్యామోహముపొందుట, భగవంతుని చూచిన ఆనందాతిశయముచే స్నేహపొందుట' మొదలగు క్రియలతో కూడినది.)

ఈ శ్లోకమున పేర్కొనబడిన దంతయు శ్రీ వైష్ణవ సంప్రదాయములో 'నిత్యార్చనాపద్ధతి'ని అనుసరించునదే.

విష్ణుచిత్తునకు బాలిక లభించినది. చదువునేర్వని తనకు శాస్త్రవాదమున విజయము లభించుటయు, భార్యలేని తనకు ఈ బాలిక లభించుటయు వటపత్రశాయి అనుగ్రహమే అని విష్ణుచిత్తుడు స్వామిదయను కొనియాడెను—

"అనాచార్యప్రాప్త్యా సమధిగత శాస్త్రార్థవిజయః
అయత్నోపస్థా స్యాత్ప్రియతర ధనలక్ష్మీ సముదయః।
అపత్నీకే దాసేఽప్యసదృశసుతాయా ఉపగమః
తదేతత్సర్వం శ్రీ వటశయః తవానుగ్రహఫలమ్॥"
—(ఉల్లా: 1 శ్లో: 21)

ఈ యనుగ్రహము ఆ భక్తునిపైననే స్వామి కేల కలుగవలెను? కుటుంబియగు మరియొక భక్తునకా బాలికను ప్రసాదించియుండరాదా?- ఇట్లు చేయుటకు హేతువు కన్పించదు. అనగా- నారాయణుని కృప ఇచట నిర్హేతుకము. ఇదియే 'తెంగలై' శాఖా సంప్రదాయము.

గోదాదేవికి యౌవన మంకురించినది. ఆమె సీమంత సిందూరరేఖను ఆచార్యుల వారిట్లు వర్ణించిరి—

"హస్తేన భూతి ద్వయ భాగ్యరేఖా
కృతాఽద్వితీయా చతురాననేన।
ఇతిస్మ గోదా శిరసి వ్యరాజత్
సీమంత సిందూర మనోజ్ఞరేఖా॥"
—(ఉల్లా: 1 శ్లో: 36)

శేషియగు నారాయణునకు నిత్య విభూతియు, లీలావిభూతియు ఉన్నవి. ఇది విభూతిద్వయము. స్వామి విభూతిద్వయనాయకుడు.[1] అమ్మవారికి విభూతిద్వయము లేదు. స్వామిని తన సౌందర్యముచే వశీకృతునిజేసికొని, ఆయన లీలావిభూతిని ప్రవర్తింపజేయును. 'తెంగలై' సంప్రదాయము అమ్మవారికి శేషిత్వమును, విభూతి ద్వయమును అంగీకరింపదు గనుక ఇది హరియొక్క విభూతి ద్వయము మాత్రమే యగును.

గోదాదేవి పవిత్రయమును, కాంచీరశనమును కవి ఇట్లు వర్ణించెను—

"అనన్య శేషత్వ మనన్య భోగ్యతాం
అనన్య కైంకర్య మనన్య యోగ్యమ్।
పవిత్రయీహార తయోపనీసుతా
బభౌ కాంచీరశనా మివాన్యామ్॥"
—(ఉల్లా: 1 శ్లో. 49)

ఆచార్యులవారు ఈ శ్లోకమున 'ఆకారత్రయము'ను గోదాదేవికి అనుసంధానము చేసిరి.

గోదాదేవి సౌందర్యమునకు వటపత్రశాయి ముగ్ధుడైనట్లు నిలిచెనట—

---

1. 'భగవానపతిర్ద్వ్యేవం సాధు సంరక్షణాయచ।
మాణిక్య వర్ణో దేవేశో విభూతిద్వయనాయకః॥'
—(ప్రపన్న. అధ్యా: 17 శ్లో: 33 పుట: 251)

"యదీయ సౌందర్య రసావగాహి
వశేశయః ముగ్ధ ఇవావతస్థౌ॥"
—(ఉల్లా: 1 శ్లో: 55)

జగన్మాత—నారాయణుని తన సౌందర్యముచే కట్టివేసి, ఆయన న్యాయపాలనమును సైతము మరల్చి అవ్యాజముగ భక్తులను అనుగ్రహింపచేయునని 'తెంగల' సంప్రదాయము పేర్కొనును.

విష్ణువునే తాను వరించితినని తండ్రితో గోదాదేవి పలుకగా ఆమెను తండ్రి ఇట్లు మందలించెను—

"పారతంత్ర్యే స్వరూపస్య స్వప్రవృత్తిరూపదోషావిర్భూతిః, ముముక్షాయాః స్వకామనానక్తిః వికృతిః— అనన్యా కాంస్య విరోధినీ ప్రవృత్తిః— ఆధారాధేయ సంబంధస్య స్వాధారానుభావనా విరుద్ధాసు ఘాతిః— పరాయత్త శేష భావనాయాః స్వ శేషత్వ ప్రవత్తావృత్తిః— స్వరూపవిరోధినీ" —(ఉల్లా. 2 పద. 12)

ఈ పలుకులన్నియు గోదాదేవి కోరిక శ్రీ వైష్ణవ సంప్రదాయమగు 'పారతంత్ర్యము'నకు విరుద్ధమని నిరూపించునవే. దీనికి గోదాదేవి చెప్పిన సమాధానమునూ ఇట్టే తాత్త్వికచర్చతో కూడినది. విష్ణుచిత్తుని వాక్యములలో ఉభయవేదాంతప్రతిపాదితమైన 'తత్త్వ' మిమిడియుండగా గోదాదేవి సమాధానము ద్రవిడవేదాంత సంప్రదాయమునుపదేశింపుచున్నట్లున్నది. దీనినే ఆచార్యులవారు—

"సాంప్రదాయికం పరమ రహస్యం అహూచాన పరమాచార్యానుగ్రహీతం సదస్యయన్నీవ" —(ఉల్లా: 2 పద: 13) అని పేర్కొనిరి.

తరువాత ఆమె మాటలలో కలిప్పరినాయిక, శరారి నాయికల ప్రస్తావనమిట్లు కలదు—

"శ్రీ భావనానుభావః....... ...తాళదారుసమారోహణ, వీథీపరిక్రమణ, పరీవాదోపదరూపేణ కలిప్పైరి నాయికేవ, శరారి నాయికేవ"
—(ఉల్లా: 2 పద. 15)

ఇది తిరుమంగై ఆళ్వారు, నమ్మాళ్వార్ల వృత్తాంతము. వీరు నాయికాభావమును ఆరోపించుకొని స్వామి నారాధించిరి. వీరి రచనలలో ఇది పర్యాప్తమైనది.

అంతేగాక తిరుమంగై ఆళ్వార్ అనుగ్రహించిన 'శిరియతిరుమడల్' చివరగల 'కారార్ తిరుమేని' అను పాశురమున స్వామి తన్ను అనుగ్రహింపనిచో 'పాశినమారోహణము' చేయుదునని స్వామిని హెచ్చరించును. 'పెరియతిరుమడల్' చివరి పాశురమునకూడ ఈ 'పాశినమారోహణ వ్రతము' చేయుదునని స్వామిని హెచ్చరించుట కలదు.[1]

వ్యాఖ్యానంతరములోనున్న ఈ గాధలను ప్రస్తావించి ఆచార్యులవారిచట 'విశిష్టాద్వైతసిద్ధాంతానురక్తి'ని ప్రకటించిరి. ఈ దివ్యప్రబంధప్రామాణ్యము 'తెంగలై' శాఖాసంప్రదాయము. అంతేగాక విష్ణుచిత్తుడు స్వయముగా తనయందు యశోదా భావమును ఆరోపించుకొని శ్రీకృష్ణుని ఆరాధించుటయు గోదాదేవి ప్రస్తావించినది. ఈ విశేషములు 'పెరియాళ్వార్లు' అనుగ్రహించిన తిరుమొళియందలి 'వణ్ణమాడంగళ్' ఇత్యాది గాధలన్నింటను పర్యాప్తమైనది. దీనినిచట ఆచార్యులవారు ప్రస్తావించుటయు తత్త్వాభినివేశమే.

ఈ రెండు ద్వివిధ ప్రమాణ స్వీకార వచనముల నడుమ ఆచార్యులవారు గోదాదేవిచే ఈ శ్లోకమును పలికించిరి—

"ఉపనయతి పదార్థాన్ స్వాప్యయః కోపి హేతుః
విఘటతి తమపోహన్ శక్తిరధ్యాత్మనిష్ఠా"
—(ఆశ్వా. 2 శ్లో. 16)

1. 'పాశినమారోహణము' (మడలెరుదల్) అనగా— "నాయకుని ఒకపటమున వ్రాసి, దానిపైనుంచిన కన్నుమరల్పక చూచుచు, గంధపుష్పాదిభోగ వస్తువులను విషముగానెంచి, వర్జించి, నిద్రాహారములులేక, తాటిమట్టను చేతగొని దానితో ఒడలిపై ప్రహరించుకొనుచు, శోణితముల విరియబోసికొని, 'ఈ మహాపాపి నన్ను కాపాడజాలక విడిచిపెట్టినాడు. ఇతనికి కన్నున్నదా? ఇతనికంటె క్రూరుడులేడు. పెక్కుస్థలాలలో సన్నిధిచేసి, భక్తులనితడు కాపాడుననుటయు, రామకృష్ణాద్యవతారములచే పెక్కండ్రకాపాడెననుటయు కేవలము అసత్యములు'అని వీధిలో ఆక్రందించుచు ప్రేక్షకులకు భయమును, జాలియు గల్గునట్లు సంచరించుటే—ఈ క్రమము"
—'శిరియతిరుమడల్' (దివ్యప్రబంధత్రయము)
ఆంధ్రటీక శ్రీ నేలటూరు భక్తవత్సల మయ్యంగారు పుట. 18

ఇచట 'స్వాప్యయాత్'[1] అను బ్రహ్మసూత్రము నందలి విషయమనుసంధానింప బడినది.

గోదాదేవి విరహబాధననుభవించి, సుషుప్తిని పొందగా విష్ణువామెను పాణిగ్రహణముచేసినట్లు స్వప్నమును గాంచెను. ఈ సందర్భమున ఆచార్యులవారు—

"ప్రాజ్ఞేనేయం సంపరిష్వక్త దేహా
బ్రహ్మానందం బృంహయంతి బృహత్యా।
సాయుజ్యానాం స్వాప్యయాం ప్రాప్యనిద్రాం
రేమే రామా విష్ణుచిత్తాత్మజాతా॥"
—(ఉల్లా: 2 శ్లో 60)

ఈ శ్లోకమునకు ముందుగల వచనమున "స్వాప్యమానాం....ప్రాజ్ఞేనాత్మనా సంపరిష్వక్త ఇతి శ్రౌత వాణీ యోగానుభావాం నిద్రాం" అని పేర్కొనిరి. (ఉల్లా: 2 వచ: 59)

తరువాతగల వచనములో "సా హ్యయిగతి సామాన్య....సంధ్యేసృష్టిరాహ హి" అను శ్రుతి వాక్యములు పేర్కొనబడినవి.

ఇందలి "ప్రాజ్ఞేనాత్మనా సంపరిష్వక్తః........." బృహదారణ్యకోపనిష ద్వాక్యము.[2] తద్విషయకములైన బ్రహ్మసూత్రములు[3] స్వప్నసృష్టిపాద ఈశ్వర నిర్మితమే అని భగవద్రామానుజులు "సంధ్యే సృష్టిరాహహి" అను బ్రహ్మసూత్ర వ్యాఖ్యానసర మున సిద్ధాంతీకరించిరి.[4] స్వప్నపతిణయానుభూతి సత్యమే అని ప్రతిపాదించుట ఇందలి పరమార్థము.

ఇదే సందర్భమున గోదాదేవి—"నిరంతర హృదంతర తైలధారావదవిచ్ఛిన్న స్మృతి సంతానభక్తి పరవశే స్వాత్మని' (ఉల్లా: 2 వచ: 61) అనియు పలుకును. ఈ మాట "యతీంద్ర మతదీపిక"లో ఇట్లు చెప్పబడినది—

---

1. బ్ర.సూ. 1-1-10
2. బృ. ఉ. 4-3-21
3. బ్ర.సూ. 1-1-10; 3-2-1
4. బ్ర.సూ. 3-2-6

"భక్తియోగో నామ యమనియమాసన ప్రాణాయామ ప్రత్యాహారధారణ ధ్యాన సమాధి రూపాష్టాంగవత్తైల ధారావదవిచ్ఛిన్న స్మృతి సంతాన రూపః"1

స్వప్న వృత్తాంతమును వర్ణించు ఆచార్యులవారు రచించిన పదకొండు శ్లోకములు శ్రీ ఆండాళ్ అనుగ్రహించిన 'నాచ్చియార్ తిరుమొళి'లోని 'వారణమాయిరమ్' ఇత్యాది దశకమునకు అనువాదము. స్వప్నమును తనకు తోచినరీతిలో వర్ణింపక పై గాథలను అనుసరించుట ఆచార్యులవారికి వారిపట్లగల ప్రామాణ్యమును నిరూపించుచున్నది.

గోదాదేవి తండ్రి ఆదేశముపై రమాకాంతుని మాలతో పూజించుటను కవి ఇట్లు వర్ణించెను—

"అష్టాక్షరీం కామయంతీ త్రిపద్యా
ద్విపద్యాసా షట్పదీకృత్యవాచా।
చతుర్వింశతి త్వయా పంచపద్యా
రమాకాంతం మాలయాऽరాధయంతమ్॥"
—(ఉల్లా: 3 శ్లో: 2)

"ఓం నమోనారాయణాయ" అను వాక్యము "అష్టాక్షరి" (ఎనిమిది అక్షరములు); 'త్రిపది' (మూడు పదములు) కలిగి ఉన్నది. ఈ రెండు కలిసినచో పదకొండగును.

'ద్విపది' (ద్వయమంత్రమని ప్రసిద్ధము.) 'శ్రీమన్నారాయణ చరణౌ శరణం ప్రపద్యే', 'శ్రీమతే నారాయణాయ నమః' అను రెండు వాక్యములు కలిసి ద్వయ మంత్రమగును. దీనిలో ఆరు పదములున్నవి. ఈ రెండు వాక్యములు; ఆరు పదములు కలిసినచో ఎనిమిదగును.

'పంచపది' (అర్థపంచకము) అనగా స్వ స్వరూప, పరస్వరూప, ఉపాయ స్వరూప, విరోధిస్వరూప, ఫల స్వరూపములు. ఇవి అయిదు.

పైన పేర్కొనబడినవిధముగా త్రిపదితో అష్టాక్షరి కలిసినప్పుడు (3+8 = 11) పదకొండును, ద్వయ మంత్రములోని రెండు వాక్యములతో, ఆరు పదములు

---

1 Dr. K. Pratap – 'Sravana-Manana and Nididhyasana' పుట 40 నుండి ఉద్ధృతము

కలిసినప్పుడు (2+6 = 8) ఎనిమిదియును; పంచపది (5) యును వెరసి (11+8+5 = 24) 'చతుర్వింశతితత్త్వ' మేర్పడును. ఇదియే పై శ్లోకమున పేర్కొనబడిన శ్రీ వైష్ణవ తత్త్వము. దీనిని ఆచార్యులవారు పాదదీపికలో పేర్కొనిరి.

గోదాదేవి శ్రీరంగనాథునకు అర్పింపవలసిన మాలికనుద్దేశించి ఇట్లు పలుకును—

"తదాధారాధేయప్రమితి జనకజ్ఞానమపి తే
గుణాధారం బ్రూతే త్వమపి సగుణాశ్లేషరసికా।
విశిష్టాకారేస్మిన్ చిదియనసమానాది కరణే
నిరాకారాప్రాప్తిః కథముదయతేఽద్వైత విధినా॥"

—(ఉల్లా. 3 శ్లో: 7)

(ఓ మాలికా! ఆధారాధేయ సంబంధమును తెలిసికొనుటచే కలుగు జ్ఞానము నీ గుణాధారమును చెప్పుచున్నది. నీవు సగుణవు ఆ ఈశ్వరునియందాశ్లేషించిన రసికవు. ఇట్లు విశిష్టమగు ఆకారము కలిగియుండగా అద్వైత మార్గముచే నిరాకార ప్రాప్తి ఎట్లు కలుగును?)

ఈ శ్లోకమున భగవంతుని 'సగుణత్వము' ప్రతిపాదింపబడినది.

గోదాదేవి ధరించి ఇచ్చిన పుష్పమాలికయే తనకు సమ్మతమని శ్రీహరి యాదేశింపగా, పిమ్మట విష్ణుచిత్తుడు కుమార్తెకు స్వామిపైనగల అనురాగమును గూర్చి భావించుచు—ఇది శిష్టాచార సమ్మతమనియు, అనూచాన సంప్రదాయమనియు తలచుటను వర్ణించిన శ్లోకములు, వచనములున్నియు (ఉల్లా. 3 శ్లో 34-60) తాత్త్వికములైనవే. ఈ ఘట్టమున త్రివిధ భక్తులు, నవవిధ సంబంధములు, భార్యామాతృసఖ్యవస్థలు మున్నగు శ్రీ వైష్ణవ సంప్రదాయ విశేషములు వర్ణింపబడినవి.

గోదాదేవి— శ్రీరంగనాథుడు తన్ను వివాహమాడినచో, ఆయనకు నూర్గులది పాయసాన్నఘటములను సమర్పింతునని మొక్కుకొనిదును. ఇది 'నాచ్చియార్ తిరుమొళి'యందలి వనగిరి శ్లోకమునవాదము. అటుపిమ్మట గోదాదేవి తన్ను గోపికగా భావించుకొని తన నాథుడెచట నున్నాడని సఖులను ప్రశ్నించుటయు, వారు బృందావన పరిసరములందున్నాడని బదులుపలుకుటయు ప్రతి శ్లోకములోను ప్రశ్నోత్తరరూపమున పది శ్లోకములందు వర్ణింపబడినది. ఇవి 'నాచ్చియార్ తిరుమొళి' లోని

14వ తిరుమొళియందుగల గాథాదశకమునకనువాదము. ఈ యనువాదములనుగూర్చి 'అనువాద వివేచనము'న వివరింపబడినది. వీనినిట్లు ఆచార్యులవారు ఈ సందర్భమున అనువదించుట ఆయనకు శ్రీ వైష్ణవసంప్రదాయముపట్లగల గాఢానురక్తిని సూచించును.

శ్రీ రంగనాథుడు పూదోటలో తన్ను పరిరంభణాదులచే ఆదరించిన విషయమును చెలులతో చెప్పుచు తన దివ్యానుభూతిని వర్ణించు మాటలలో "నిత్యసూరి మౌళిరేఖ సదా పశ్యన్తి" (ఉల్లా: 4 పద: 53) అని పలుకును. అట్లే పంచమోల్లాసమున శ్రీరంగనాథుని ఆదేశమున వివాహ నిశ్చయమునకై విష్ణుచిత్తుని కడకు వచ్చిన శతమఖచతుర్ముఖాదిపారిషదులు పలికిన మాటలలో విష్ణువును వర్ణించుచు— "సామగానవిపశ్చిత సదా పశ్యన్తి సూరిజన విపన్యవజేగీయమాన........" (ఉల్లా: 5 పద: 58) అని పలుకుదురు. ఈ రెండు సందర్భములును శ్రుతివాక్యములను అనుసరించినవి.[1]

ఈ సందర్భమునందే పారిషదులు విష్ణువును వర్ణించు మాటలలో—

"భీషోదస్మాత్ సూర్యః తపతి, వరుణః ప్రసరతి, అగ్నిర్జ్వలతి, వహతి వాతః,. .....భీతో మృత్యుర్ధావతి.... ......." (ఉల్లా: 5 పద: 50) అని యున్నది. ఇదియు శ్రుతి వాక్యమున కనుసరణము.[2]

ఈ ఘట్టములోని పూర్వోత్తర వాక్యములలో 'ససురాసురగంధర్వ యక్షోరగ రాక్షసమ్'[3] — 'యస్మింశ్చ ప్రళయం యాన్తి యుగక్షయే భూతాని'[4] ఇత్యాది వాక్యములు విష్ణు సహస్రనామావళిలోని భావములను అనుసరించినవి.

విశిష్టాద్వైత సంప్రదాయమున ప్రచురములైయున్న పారిభాషిక పదములను ఈ గ్రంథమునందు ఆచార్యులవారు విస్తృతముగ ఉపయోగించిరి. ఇట్టివానిలో—

1. "తద్విష్ణోః పరమం పదమ్ । సదా పశ్యంతి సూరయః। దివీవ చక్షురాతతమ్॥"
—(నారాయణ సూక్తము: 12)
2. "భీషాస్మాద్వాతః పవతే। భీషోదేతి సూర్యః। భీషాస్మాదగ్నిశ్చేంద్రశ్చ। మృత్యుర్ధావతి పంచమ ఇతి"
—(తైత్తిరీయోపనిషత్తు) ఈశాదిదశోపనిషదః పుట: 376
3. "ససురాసుర గంధర్వం సయక్షోరగ రాక్షసమ్"
—(శ్రీ విష్ణు సహస్రనామస్తోత్రము ఫలశ్రుతిలో శ్లో: 15 పుట: 50)
4. "యస్మింశ్చ ప్రళయంయాన్తి పునరేవ యుగక్షయే"
—(శ్రీ విష్ణు సహస్రనామస్తోత్రము ఫలశ్రుతిలో శ్లో: 15 పుట: 12)

నవవిధ సంబంధములు, కైంకర్యము, చిదయనము, అత్యప్రాప్యతము, పారతంత్ర్యము, మున్నగునవి పేర్కొనబడగినవి.

సాంప్రదాయికములగు ఇట్టి పదములు ఏయే ఉల్లాసములలోని ఏయే గద్య పద్యములలో ఎన్ని పర్యాయములు ప్రయోగింపబడినవో సూచించు పట్టిక ఈ వ్యాసము చివర చేర్చబడుచున్నది.

తనను, తన సర్వస్వమును విష్ణువు అధీనముగావించుట పారతంత్ర్యము. తన యూహలుగాని, చర్యలుగాని తనవిగావు. ఇవన్నియు నారాయణాధీనములే యని విశ్వసించి, స్వతంత్రప్రవృత్తిని విడియుండుట పరతంత్రస్వరూపము. విష్ణుచిత్తుడిట్టి పరతంత్రుడగు భాగవతుడు గోదా శ్రీరంగనాథుల పరిణయానంతరము వారి వియోగములో తానెట్లు బ్రతుకగలనని విష్ణుచిత్తుడు శోకింపగా స్వామి ఇట్లు ఆదేశించును —

"మద్వియోగ సహకృత సుతావియోగం యద్యసహమానః, తర్హి మదుపయోగితయా మత్కైంకర్యాయ మద్గతకరణకళేబరః మదాజ్ఞయా మచ్ఛేష[illegible]యే మదీయ శాసనానుశాసిత స్వానురూపాశేష కైంకర్య [illegible], ఆ [illegible] ఆత్మానంద స్వరూపానురూప సేవా[illegible] [illegible] శేష పరమప్రీతి విషయాత్యంతానురక్తి భక్తి ముక్తి [illegible] శక్తిం మామారాధయ. యావచ్ఛరీరపాతమత్రైవ [illegible] [illegible] [illegible] శేష కైంకర్య [illegible] [illegible] స్వరూప [illegible] ప్రీతి [illegible] [illegible] నాస్యత్ఫలం [illegible] [illegible] [illegible] [illegible] [illegible] [illegible] [illegible] [illegible] [illegible] [illegible] [illegible] మమ [illegible] .." ([illegible] 108)

ఇది అంతయు పారతంత్ర్య [illegible]మే.

ఇట్టి గ్రంథమునందంతటను ఆచార్యులవారి విశిష్టాద్వైత తత్త్వ[illegible]యు, 'తెంగలై' సంప్రదాయ [illegible]యు [illegible]ములై యున్నవి *

* ఈ తాత్త్విక ప్రకరణమునందును, అనుబంధము-I లోను పేర్కొనబడిన వివిధ విశిష్టాద్వైత తత్త్వములనుగూర్చిన విషయముల సేకరణలో డా॥ ఎస్. [illegible] గారి 'తమిళ్ ఔర్ హిందీకా భక్తి సాహిత్య', డా॥ బలదేవ ఉపాధ్యాయగారి 'భారతీయదర్శన్', డా॥ తుమ్మపూడి కోటీశ్వరరావుగారి 'ఆముక్తమాల్యదా సౌందర్యము'; డా॥ గుండి వేంకటాచార్యులవారి 'రంగనాథ-వాల్మీకి రామాయణ ముల తులనాత్మక పరిశీలన' అను గ్రంథములు తోడ్పడినవి.

## కావ్యమునందు ఏ శాస్త్రీయాంశము ఏ ఉల్లాసములో-ఎన్ని పర్యాయములు ప్రయుక్తమైనదో తెలుపు పట్టిక

| క్ర. సం. | శాస్త్రీయాంశము | ఉల్లాసములు | | | | | మొత్తము |
|---|---|---|---|---|---|---|---|
| | | i | ii | iii | iv | v | |
| 1 | ఆహారశుద్ధము | 1 | – | 1 | – | – | 2 |
| 2 | అకించనత్వము | – | – | – | – | 1 | 1 |
| 3 | అచిత్తు | 1 | – | – | – | – | 1 |
| 4 | అత్మప్రాప్యత్వము | 2 | – | – | 2 | 1 | 5 |
| 5 | అర్థపంచకము | – | – | – | – | 1 | 1 |
| 6 | ఈశ్వరుడు | 1 | 1 | 1 | – | – | 3 |
| 7 | ఉపాయములు | – | – | 1 | – | – | 1 |
| 8 | ఉభయవేదాంతములు | 1 | – | – | – | 1 | 2 |
| 9 | కైంకర్యము | 1 | 1 | 11 | 1 | 8 | 22 |
| 10 | జ్ఞానము | – | – | – | – | 1 | 1 |
| 11 | జ్ఞానత్రయము | – | – | 1 | – | – | 1 |
| 12 | చతుర్విధముక్తులు | 1 | 1 | – | – | – | 2 |
| 13 | చిత్తు | 1 | – | 1 | – | – | 2 |
| 14 | త్రయీవిద్య | – | – | 1 | – | – | 1 |
| 15 | దహరవిద్య | – | 1 | – | – | 1 | 2 |
| 16 | నవవిధ సంబంధములు | 1 | 5 | 9 | 1 | 5 | 21 |
| 17 | న్యాసవిద్య | – | 1 | 5 | – | 2 | 8 |
| 18 | ప్రపత్తి | 1 | – | – | 1 | – | 2 |
| 19 | పారమ్యము | 1 | – | 2 | – | 3 | 6 |
| 20 | పారతంత్ర్యము | 1 | 3 | 3 | 1 | 2 | 10 |
| 21 | భక్తి | – | – | 2 | – | – | 2 |
| 22 | భార్యామాతృసఖ్యవస్థలు | – | 1 | 10 | – | – | 11 |
| 23 | రహస్యత్రయము | – | – | 4 | – | – | 4 |
| 24 | విభూతిద్వయము | 1 | – | – | – | – | 1 |

| క్ర. సం. | తాత్త్వికాంశము | ఉల్లాసములు | | | | | మొత్తము |
|---|---|---|---|---|---|---|---|
| | | i | ii | iii | iv | v | |
| 25 | శరణాగతి | – | 1 | – | – | 2 | 3 |
| 26 | శ్రవణమననిదిధ్యాసనములు | – | – | 1 | – | – | 1 |
| 27 | నగుణాష్టకము | – | – | 2 | – | – | 2 |
| 28 | సత్పుత్రము | 1 | – | – | – | – | 1 |
| 29 | సంకర్షణప్రద్యుమ్నానిరుద్ధాలు | – | – | 1 | – | – | 1 |
| 30 | హేయగుణబంధుర దేహము | – | 1 | 1 | – | – | 2 |
| | మొత్తము | 15 | 16 | 56 | 7 | 28 | 122 |

## తాత్త్వికాంశ ప్రతిపాదక గద్య పద్య సంఖ్య

| | | |
|---|---|---|
| ప్రథమోల్లాసము: | 1, 6, 11, 17, 18, 19, 20, 21, 36, 46, 49, 53, 55 | మొత్తము : 13 |
| ద్వితీయోల్లాసము: | 7, 11, 12, 13, 14, 15, 16, 17, 18, 20, 59, 60, 61, 62, 74 | మొత్తము : 15 |
| తృతీయోల్లాసము: | 2, 7, 9, 12, 13, 15, 17, 18, 19, 22, 27, 28, 31, 32, 33, 34, 35, 36, 37, 38, 39, 40, 41, 42, 43, 44, 45, 46, 47, 48, 52, 58 | మొత్తము . 32 |
| చతుర్థోల్లాసము : | 2, 28 | మొత్తము : 2 |
| పంచమోల్లాసము: | 10, 25, 30, 49, 50, 51, 53, 58, 62, 63, 65, 77, 81, 82, 83, 86, 104, 108 | మొత్తము · 18 |
| | మొత్తము .... .... | 80 |

కావ్యములోని గద్య, పద్యముల మొత్తము సంఖ్య 382

తత్త్వప్రతిపాదకములగు గద్య, పద్యముల మొత్తము సంఖ్య

# శ్రీ వైష్ణవ సంప్రదాయములో గోదాదేవి స్థానము

గోదాదేవి, శ్రీ ఆండాళ్, శూడి కొడుత్తాళ్ అను పేర్లలో ప్రసిద్ధికెక్కిన ఈ కావ్యనాయికకు శ్రీ వైష్ణవ సంప్రదాయమున విశిష్టమగు స్థానము కలదు. తమిళము నందలి భక్తి సాహిత్యములోను ఆళ్వారుల పరంపరలోను, ఈమెకు గల స్థానము విశిష్టమైనది. శ్రీ వైష్ణవ సమాజమున కూడ ఈమెకు అనన్య ప్రాధాన్యము కలదు.

తమిళ వాఙ్మయమున పన్నిద్దరాళ్వారులు రచించిన మధుర భక్తి భరితమగు సాహిత్యమును 'ద్రవిడ వేద'మని శ్రీ వైష్ణవ సంప్రదాయమున భక్తితో అనుసంధానము చేయుట కలదు. ఈ రచనలన్నియు సుమారు నాలుగువేల గాథలతో కూడియుండుటచే వీనికి 'నాలాయిర దివ్య ప్రబంధ' మని పేరు. దీనినే 'భగవద్విషయ' మని కూడ అందురు.

ఆళ్వారులలో పలువురు తమయందు నాయికాత్వము నారోపించుకొని, శ్రీమన్నారాయణుని భర్తగా భావించి ఆరాధించుట ఈ పాశురములలో కన్పించును. పన్నిద్దరాళ్వారులలో గోదాదేవి యొక్కతెయే స్త్రీ. తక్కిన వారందరును పురుషులు. పురుషులు తమయందు నాయికాత్వము నారోపించుకొని చెప్పిన పాశురములలోకన్న, సహజముగ స్త్రీయగు గోదాదేవి స్వామిని భర్తృభావముతో ఆరాధించుచు చెప్పిన గీతములలో సహజ మాధుర్యము అధికముగా నుండును. గోదాదేవి స్వామినిగూర్చి మొత్తము 173 పాశురములను రచించినది. అవి 'తిరుప్పావై' అను పేర 30 పాశురములతో ఒక గ్రంథముగను, 'నాచ్చియార్ తిరుమొళి' యను 143 పాశురములతో మరియొక గ్రంథముగను ఉన్నవి.

'తిరుప్పావై' పాశురములలో గోపికలు ధనుర్మాస వ్రతము నాచరించుట ఒక్కొక్క దినమున కొక్కొక్క పాశురము చొప్పున వర్ణింపబడినది. గోదాదేవి ఈ ధనుర్మాస వ్రతము నాచరించి స్వామి అనుగ్రహమును పొందెనని సంప్రదాయము.

'నాచ్చియార్ తిరుమొళి' యందు గోదాదేవి తాను నాయికయై శ్రీకృష్ణునిపట్ల తనకుగల అనురాగమును వ్యక్తముచేయుట వర్ణింపబడినది. గోదాదేవి శ్రీరంగనాథుని వరించి తరించినను ఆమె రచనలు మాత్రము శ్రీకృష్ణుని నాయకునిగా నిర్దేశించునవే. ఈ గాథలు రమణీయములగు భావములతో, పదలాలిత్యములతో కూడియుండును.

మతపరముగ కూడ నీ పాశురములకును, గోదాదేవికిని విశిష్టమగు స్థానము కలదు. పన్నిద్దరాళ్వారులలో పెరియాళ్వారులుగా (పెద్ద ఆళ్వార్) పేరొందిన విష్ణుచిత్తుడు గోదాదేవిని పెంచిన తండ్రి. గోదాదేవి స్వయముగ అయోనిజ. స్వామిని తాను ధరించిన పూమాలలో బంధించి ఆయనకు ప్రేయసియైన జగన్మాతృ స్వరూపము. ఈమె భూదేవ్యవతారమని చెప్పుట ప్రసిద్ధము. శ్రీ వైష్ణవమున శ్రీ భూ నీళలు ముగ్గురకును సమానమగు ప్రతిపత్తియున్నది. ఇట్టిమె శ్రీమన్నారాయణునకు పరమ భక్తురాలైన అర్ధాంగియైనది

ఈమె వృత్తాంతము శ్రీరంగనాథునిపట్ల గల భక్తి శృంగారముల మేలు కలయిక. కనుకనే శ్రీ వైష్ణవమునగల మధురభక్తి సంప్రదాయములో భక్తులకీమె శ్రీదేవికన్నను, నీళాదేవికన్నను ప్రేమాస్పదురాలై ఆరాధ్య అయినది. పెక్కు వైష్ణవ దేవాలయములలో గోదాదేవి అర్చామూర్తులున్నవి. ఈమెను ఎంత భక్తిశ్రద్ధలతో కొలుతురో, అంతే భక్తి శ్రద్ధలతో శ్రీ వైష్ణవులీమె సాహిత్యమును కూడ అనుసంధానము చేయుదురు. ముఖ్యముగ ధనుర్మాసమున వైష్ణవాలయములలో 'తిరుప్పావై' ప్రవచనములు సాగుచుండును. కన్యలు ఈ తిరుప్పావై పాశురములను అనుసంధానము చేయుటచే వారికి శీఘ్రముగ వివాహమగుననియు, అనురూపుడగు వరుడు లభించు ననియు శ్రీ వైష్ణవుల విశ్వాసము.

ఉత్తర భారతమున ఇట్లే శ్రీకృష్ణుని నాయకునిగా భావించి, మధురభక్తి భరిత గీతములను గానముచేసి తరించిన పరమభక్తురాలు మీరాబాయి. మీరాబాయికి పరమ భక్తురాలుగనే భక్తహృదయములలో స్థానమున్నది. ఆమె వివాహిత. భర్తను, సంసారమును పరిత్యజించి, శ్రీకృష్ణుని గుణములను, గానముచేసిన పూజ్యురాలు. ఆ భక్తురాలిని స్వామి పెక్కు కష్టములనుండి ఆదుకొన్నట్లు గాథలు వ్యాప్తిలో నున్నవి. కాని స్వామి ఆమెను పరిణయమాడినట్లు కన్పింపదు. గోదాదేవి అట్లుగాక, స్వామిని తన మధుర భక్తి భావనచే ఆరాధించి పతిగా పొందినది. కావున ఈమెకు శ్రీమన్నారాయణుని చెంత శ్రీదేవితో సమానమగు స్థానము కలదు. మీరాబాయి మానవజన్మమెత్తి తన అసమాన భక్తి భావముచే దివ్యత్వమును సంతరించుకొన్నది. గోదాదేవి భూదేవ్యవతారమై తన పవిత్ర చరిత్రముచే మానవుల నుద్ధరించుటకు భూలోకమునకు వచ్చినది. ఈమె 'అయోనిజ' అనియే వైష్ణవ సంప్రదాయము పేర్కొనుచున్నది.

శ్రీ వైష్ణవ సామాజిక సంప్రదాయములలో కూడ ఈమె ప్రభావము విశేషముగ కన్పించును. మకర సంక్రమణమునకు ముందు రోజును 'భోగి' యందురు. ఇది ధనుర్మాసమునకు చివరి రోజు. గోదా శ్రీరంగనాథుల కల్యాణము ఈ దినముననే జరిగెననియు, గోదకు అట్టి భోగమాదినమున లభించుటచే అది 'భోగి' యైనదనియు చెప్పుదురు. శ్రీ వైష్ణవుల గృహములలో వివాహ సందర్భములందు వధువును గోదాదేవిగ భావించుట ఆచారము. శ్రీ వైష్ణవ గృహములలో ఆడుబిడ్డలకు ఈమె పేరు పెట్టుకొనుటయు విస్తృతముగ నున్నది.

శ్రీ వైష్ణవ సంప్రదాయమున అట్టి విశిష్టస్థానము గలిగిన గోదాదేవిగాథ, వారి వాఙ్మయములో బహుధా వర్ణింపబడినది. పలువురు కవులు ఈ పుణ్యగాథను తమ కావ్యేతి వృత్తముగా స్వీకరించి ధన్యులైరి. వీరిలో తక్కిన ఆళ్వారుల వృత్తాంతములతోబాటు గోదాదేవి వృత్తాంతమును వర్ణించినవారును, గోదాదేవి యొక్కయు ఆమెను పెంచిన తండ్రియగు శ్రీ విష్ణుచిత్తుని యొక్కయు వృత్తాంతములు మాత్రము వర్ణించినవారును, కేవలము గోదా వృత్తాంతమునే వర్ణించినవారును గలరు.

ప్రాచీనములగు సాంప్రదాయిక గ్రంథములైన గురుపరంపరా ప్రభావము (తమిళము), దివ్యసూరి చరిత్ర (సంస్కృతము); ప్రపన్నామృతము (సంస్కృతము) లోనే గాక; ప్రాచీన వాఙ్మయమున వేదాదినాథ భట్టాచార్యుడు రచించిన 'గోదా పరిణయః' (సంస్కృతము) అను చంపూ కావ్యము నందును, శ్రీకృష్ణదేవరాయలు రచించిన తెలుగు ప్రబంధమగు "ఆముక్తమాల్యద"లోను; సంబారు కేశవాచార్యుని "ఆచార్యసూక్తిముక్తావళి" (తెలుగు)లోను గోదాదేవి కథ వర్ణింపబడి యున్నది. ఆధునికులలో కీ.శే. దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు తెలుగులో 'శ్రీ ఆండాళ్ళ తిరుప్పావు' అను పేర తిరుప్పావై పాశురములను చక్కని కీర్తనలుగ వ్రాసి, "శ్రీ ఆండాళ్ళ"అను నాటికను రచించిరి. ఇట్లాధునిక కవులెందరో గోదాదేవిని భక్తితో స్తుతించి వాఙ్మయ సేవ చేసిరి.

మధుర భక్తి శృంగారాంచితమైన ఈ పుణ్యగాథను ఎందరు కవులు ఎన్ని భాషలలో ఎన్ని ప్రక్రియలలో వర్ణించినను శ్రీమద్రామాయణ గాథ వలెనే గోదాదేవి ఇతివృత్తము కూడ నిత్య నూతనమై సహృదయుల నలరించుచున్నది. శ్రీమన్నారాయణుని అనుగ్రహము వలెనే గోదాదేవి పుణ్యచరిత్రము కూడ "అతృప్తామృత స్వరూపము." దానికిగల జనాదరణము నిరవధికమైనది.

—oOo—

# ఉపసంహారము

శ్రీమాన్ అమరవాది వేంకటనరసింహాచార్యులవారు రచించిన ఈ "ఆముక్తమాల్యదమ్" అను చంపూకావ్యమును సాహిత్యశాస్త్రప్రమాణముల దృష్టిలోను తాత్త్విక దృక్పథములోనుకూడ పరిశీలించినపుడు ఆచార్యులవారీ ఇతివృత్తమును నిమిత్తమాత్రముగ గ్రహించి, విశిష్టాద్వైత తత్త్వప్రవచనమునకే ప్రాధాన్యమునిచ్చినట్లు భావించుట కవకాశమున్నది. అట్లని ఈ కావ్యము సాహిత్యప్రమాణములు కొరవడిన దని భావింపరాదు. ఈ కారణముచేతనే ఈ కావ్యము కేవలము సాహిత్యరసికులకన్న విశిష్టాద్వైత తత్త్వమున అభినివేశముగల రసజ్ఞులకు అధికముగా అలరింపగలదని చెప్పవచ్చును.

తాత్త్విక ప్రధానముగ రచింపబడినను ఈ కావ్యమున రమ్యములగు అలంకారములు, భావచమత్కృతులు, ధారాశుద్ధి శోభితములగు శ్లోకరచన, వివిధ శాస్త్రములలో వ్యుత్పన్నత ప్రకటింపబడియే యున్నవి. ఆచార్యులవారు పలు తావులలో పూర్వకవుల భావములను, శైలిని చర్వణము చేయుచు పరిశీలించినచో, వారు ప్రాచీన సాహిత్యమును ఎంతగా హృదయగతము చేసికొనిరో స్పష్టమగును. ఈ కావ్యమున ఆచార్యులవారు ప్రాచీన సంస్కృత సాహిత్యపద్ధతిని, ద్రావిడ వేదాంత సంప్రదాయపోకడను కూడ చక్కగా సమన్వయము చేసిరి. ఇది చాల క్లిష్టమగు కార్యము. దీనిని సాధించుటలో ఆచార్యులవారికి సాహిత్యమునందును, ఉభయవేదాంతములందును గల అవగాహనము స్పష్టమగుచున్నది.

ఆచార్యులవారు ఆబాల్యముగ సంస్కృతాధ్యయనము చేసినవారు. అయిన ఈ కావ్యమునేగాక, సంస్కృతమున ఇంకను పెక్కు రచనలు చేసిరి. సంస్కృతమునందే కాదు- తమిళమునను, మాతృభాషయగు తెలుగులోనుకూడ కవితారచన చేసిరి. ఈ రచనలన్నియు పారమార్థికములే యగుట ఆచార్యులవారి హృదయ నైర్మల్యమును వెల్లడించును. వారి జీవితమంతయు శ్రీ వైష్ణవ సంప్రదాయమును, సంస్కృత వాఙ్మయమును ఆరాధించుటలోనే గడచినది. ఈ నాటి లౌకిక దృష్టిలో ఆర్థికముగ నిరుపయోగమగు ఇట్టి మహత్కార్యమునకు జీవితమును అంకితముచేయుట ఆచార్యులవారి వ్యక్తిత్వ విశేషమును నిరూపించును.

సంస్కృత భాషావ్యాప్తి వెనుకబడి, ఆ భాషలో గ్రంథరచన సాగించువారు అరుదైన ఈ కాలమున ఆచార్యులవారీ కావ్యమును రచించుటయు, వ్యయ ప్రయాసల కోర్చి ముద్రించుటయు సంస్కృత భాషాభిమానులెల్లరు ఆమోదించి అభినందింప దగినది.

ఆచార్యులవారు లోకమున కందించిన ఈ కావ్యము సాహిత్యదృష్టిలోను, శాస్త్రీకదృష్టిలోనుకూడ గణనీయమైనది. కనుక ఈ కావ్యము కేవలము సాహిత్య ప్రియులకేగాక, శ్రీ వైష్ణవతత్త్వ జిజ్ఞాసువులకును, ముముక్షువులకును కూడ పరమోపాదేయమైయున్నది.

సంస్కృత భాషాభిజ్ఞులెల్లరు ఆచార్యులవారి సంస్కృతభాషాప్రియత్వమును ఆదర్శముగా గ్రహించి, తద్భాషాప్రచారమునకు పూనుకొనుట అభిలషణీయము.



# అనుబంధము-I

## పన్నిద్దరు ఆళ్వార్లు

'ఆళ్వార్' అనునది తమిళభాషాపదము. ఈ పదమునకు 'అధ్యాత్మజ్ఞాని' అని యర్థము. శ్రీ వైష్ణవ సంప్రదాయమున పన్నిద్దరు ఆళ్వార్లు కలరు. వీరందరును శ్రీమన్నారాయణుని ఉత్తమభక్తులు. పరమభాగవతోత్తములు. ఈ పన్నిద్దరు ఆళ్వార్లను స్తుతించుచు శ్రీ పరాశరభట్టరు అనుగ్రహించిన ఈ క్రింది శ్లోకమిచట స్మర్తవ్యము—

"భూతం సరస్య మహదాహ్వయ భట్టనాథ
శ్రీభక్తిసార కులశేఖరయోగివాహాన్।
భక్తాంఘ్రిరేణు పరకాలయతీంద్ర మిశ్రాన్
శ్రీమత్పరాంకుశమునిం ప్రణతోఽస్మి నిత్యమ్॥"

ఈ పన్నిద్దరు ఆళ్వార్ల క్రమమిది—

### 1. పొయిగై ఆళ్వార్ :

'సరోయోగి' అను నామాంతరముగల ఈయన ఆళ్వార్లలో ప్రథముడు. సుప్రసిద్ధ పుణ్యక్షేత్రమగు కాంచీపురమునందలి ఒక సరోవరము నందలి కమలమున ఇతడు జన్మించెననియు ఈయన మహావిష్ణువుయొక్క శంఖమగు 'పాంచజన్యము' యొక్క అవతారమనియు విశ్వసింతురు. ఇతని రచన 'ముదల్ తిరువందాది'.

### 2. పూదత్తాళ్వార్ :

'భూతయోగి' అను నామాంతరముగల ఈయన ఆళ్వార్లలో రెండవవాడు. ఈయన 'మామల్లపురము' (మహాబలిపురము)లో ఒక మాధవీపుష్పమున జన్మించెననియు, ఈయన మహావిష్ణువుయొక్క గదయగు 'కౌమోదకి' అవతారమనియు విశ్వసింతురు. ఈతని రచన 'ఇరెండాన్ తిరువందాది'.

## 3. పేయాళ్వార్ :

'మహద్యోగి' అను నామాంతరముగల ఈయన ఆళ్వార్లలో మూడవవాడు. ఈయన నేటి మదరాసు నగరమునందలి 'మైలాపూరు' అనబడు ప్రాంతమున ఒక కలువపువ్వునందు జన్మించెననియు, ఈయన మహావిష్ణువుయొక్క ఖడ్గమగు 'నందకము' అవతారమనియు తలతురు. ఇతని రచన 'మూన్ఱామ్ తిరువందాది.'

## 4. తిరుమడిశై ఆళ్వార్ :

'భక్తిసారుడ'ను మారుపేరుగల ఈయన ఆళ్వార్లలో నాలుగవవాడు. నేటి మదరాసు నగరమునకు 16 మైళ్ల దూరములోనున్న 'తిరుమడిశై'అను ఊరు ఈతని జన్మస్థానమగుటచే ఇతనికీ పేరు వచ్చినది. ఇతని రచనలు 'నాన్ముగన్ తిరువందాది' 'తిరుచ్చందవిరుత్తమ్'.

## 5. నమ్మాళ్వార్ :

"పరాంకుశముని" అనియు, "శఠగోపాచార్యు" డనియు నామాంతరములుగల ఈయన ఆళ్వార్లలో ఐదవవాడు. తామ్రపర్ణి నదీతీరమునందలి 'తిరుక్కురుకూరు' ఈతని జన్మస్థానము. ఇది నేడు తమిళనాడులోని "తిరునల్వేలి" జిల్లాలో కలదు. ఈయన నిత్యసూరులలో ఒకరైన 'విష్వక్సేను'ని అవతారమని నమ్ముదురు. 'తిరువిరుత్తం', 'తిరువాశిరియం', 'పెరియతిరువందాది', 'తిరువాయిమొళి' ఈతని రచనలు. 'తిరువాయిమొళి' ద్రవిడోపనిషత్తుగా ప్రసిద్ధిచెందినది. ఈతని గ్రంథములను శ్రీవైష్ణవ సంప్రదాయానుసారులు సర్వశ్రేష్ఠములుగా భావింతురు.

## 6. మధురకవి ఆళ్వార్ :

'యతీంద్రమిశ్ర"రను నామాంతరముగల ఈయన ఆళ్వార్లలో ఆరవవాడు. 'తిరుక్కోవలూరు'లో ఇతడు జన్మించెను. గరుడుని అంశచే జన్మించినవారని విశ్వసింతురు. ఇతడు శఠగోపాచార్యుని శిష్యుడు. "కణ్ణినుణ్ శిరుత్తాంబు" ఈతని రచన. ఈతని రచనలు మాధుర్యగుణ భూయిష్ఠములై యుండుటచే ఇతనికి 'మధుర [illegible] ప్పినది.

## 7. కులశేఖర ఆళ్వార్ :

ఆళ్వార్లలో ఏడవవారైన ఇతడు కేరళలోని 'మలబారు' ప్రాంతమునందలి ఒక రాజ్యమును పాలించిన ప్రజారంజకుడును, ధర్మాత్ముడును అయిన రాజు. ఈతని తండ్రిపేరు 'దృఢవ్రతుడు.' తండ్రి శిక్షణలో భక్తిమయవాతావరణమున పెరిగిన ఇతడు రాజ్యవైభవమును సైతము పరిత్యజించి శ్రీరంగమునకేగి, సాధారణ భక్తుడై జీవనమును గడిపిన మహానుభావుడు. 'పెరుమాళ్ తిరుమొళి' 'ముకుందమాల' ఈతని రచనలు. "ముకుందమాల" సంస్కృతమున రచింపబడిన గొప్పస్తోత్రము. దీనికి వైష్ణవ సమాజమునందేగాక, భక్తకోటియందును, సాహిత్యలోకమునందును అద్వితీయమగు స్థానమున్నది. ఈతని రచన అతికోమలమై అలరారును. ఈతడు మహావిష్ణువుయొక్క వక్షఃస్థలమున వెలిగెడి "కౌస్తుభమణి" అవతారమని నమ్ముదురు.

## 8. పెరియ ఆళ్వార్ :

ఇతడే "విష్ణుచిత్తు"డనియు, "భట్టనాథు"డనియు పిలువబడు ఎనిమిదవ ఆళ్వారు. వైగై (కృతమాలా) నదీతీరమునందున్న శ్రీవిల్లిపుత్తూరు ఈతని జన్మస్థానము. ఇది నేటి తమిళనాడు రాష్ట్రమునందున్నది. తల్లిదండ్రులు పద్మ-ముకుందాచార్యులు. ఇతడు గరుడాంశసంభూతుడని తలతురు. శ్రీవైష్ణవ సమాజమున ఆరాధ్యదైవమగు "గోదాదేవి" ఈతని పెంపుడుకూతురు. ఇతడు ప్రతినిత్యము విష్ణువునకు పుష్పమాలల నర్పించెడి పరమ భక్తాగ్రణి. మహావిష్ణువు అనుగ్రహముచే పాండ్యరాజ సభయందు విష్ణుపారమ్యమును స్థాపించి, ఆ రాజును వైష్ణవమతావలంబిగ చేసిన మహనీయుడు. ఈ రాజు ఇతనికి "భట్టనాథు"డను బిరుదమునిచ్చి "గజారోహణోత్సవము"చే ఇతనిని సత్కరించెను. ఇతడు ప్రతినిత్యము విష్ణువునకు మాలికల నర్పించుచుండుటచే "మాలాకారు"డనియు పేరు వచ్చినది. 'తిరుప్పల్లాండు' 'పెరియాళ్వార్ తిరుమొళి' ఈతని రచనలు.

## 9. గోదాదేవి :

పన్నిద్దరాళ్వార్లలో ఈమెయొక్కతెయే స్త్రీ. శ్రీ ఆండాళ్, కోదై, చూడికొడుత్తమ్మాళ్, ఆముక్తమాల్యద మున్నగునవి ఈమె నామాంతరములు. ఈమె శ్రీవిల్లిపుత్తూరులో విష్ణుచిత్తుని ఇంటిలో తులసీవన సమీపమున లభించినదని విశ్వసింతురు.

ఈమె భూదేవ్యంశచేతను, లక్ష్మీదేవ్యంశచేతను జన్మించెనని నమ్మెదరు. పన్నిద్దరాళ్వారులలోను, శ్రీవైష్ణవ సంప్రదాయమునందును ఈమెకుగల స్థానమత్యున్నతమైనది. ఈమె పెంపుడు తండ్రియగు విష్ణుచిత్తుడు ప్రతినిత్యము విష్ణుసమర్పణకై మాలికలనల్లగా, వానిని ముందు తానే ధరించి, పిమ్మట విష్ణువునకర్పించి, విష్ణువునే పరిణయమాడిన దివ్యచరిత్రగల భక్తశిరోమణి. 'తిరుప్పావై', 'నాచ్చియార్ తిరుమొళి' ఈమె రచనలు. "తిరుప్పావై"లోని గీతములు మధురభక్తి భరితములై నేటికిని ధనుర్మాసాది పర్వదినములలో భక్తకోటిచే గానముచేయబడుచున్నవి. ఈమె తన రచనలలో కృష్ణుని ఆరాధించినది.

## 10. తొండరడిప్పొడి ఆళ్వార్ :

"భక్తాంఘ్రిరేణు"వనియు; "విప్రనారాయణు" డనియు పిలువబడు ఈతడు ఆళ్వార్లలో పదియవవాడు. 'తొండర్'అనగా భాగవతోత్తముడు. 'అడి'అనగా పాదము. 'పొడి' అనగా రేణువు. ఈ కారణముననే ఈతనికి "భక్తాంఘ్రిరేణువు' అను నామమేర్పడినది. కావేరీ నదీతీరమునందలి 'మణ్డంగుడి'ఈతని జన్మస్థానము. 'తిరుమాలై' "తిరుప్పళ్ళియెళుచ్చి" ఈతని రచనలు.

## 11. తిరుప్పాణ్ ఆళ్వార్ :

"మునివాహను"డనియు. "యోగివాహను"డనియు మారుపేర్లుగల ఈతడు ఆళ్వార్లలో పదకొండవవాడు. తిరుచ్చిరాపల్లి సమీపములోని "ఉఱైయూరు" ఈతని జన్మస్థానము. "అమలనాదిప్పిరాన్" ఈతని రచన.

## 12. తిరుమంగై ఆళ్వార్ :

"పరకాలు"డనియు "నీలు"డనియు పిలువబడు ఇతడు ఆళ్వార్లలో చివరివాడు. "తిరుమొళి", "తిరుక్కుఱుందాండగం", "తిరునెడున్దాండగం", "తిరువెళుకూత్తిరుక్కై", శిరియతిరుమడల్", "పెరియతిరుమడల్" ఈతని రచనలు. తమిళమున ఈతని రచనలు "వేదాంగము"లుగ భావింపబడుచున్నవి.

ఇది పన్నిద్దరాళ్వార్ల సంగ్రహ పరిచయము.

పన్నిద్దరాళ్వార్ల రచనలను "నాలాయిరదివ్యప్రబంధము"గా సంకలనముచేసిన మహానుభావుడు-శ్రీమన్నాథముని. "నాలాయిర" మనగా నాలుగు వేలు. నాలుగు వేల పాశురములు ఇంచుమించుగా కలిగియున్న ఈ గ్రంథము ఒక్కొక్క 'ఆయిర'మున కొక్కొక్క భాగముగ విభక్తమై నాలుగు భాగములుగ నున్నది. ఆ విభాగమిట్లుండును-

## 1. ముదలాయిరమ్ (ప్రథమ సహస్రము)

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | తిరుప్పల్లాండు | .... | .... | 12 | పాశురములు |
| 2. | పెరియాళ్వార్ తిరుమొళి | .... | .... | 461 | ,, |
| 3. | తిరుప్పావై | .... | .... | 30 | ,, |
| 4. | నాచ్చియార్ తిరుమొళి | .... | .... | 143 | ,, |
| 5. | పెరుమాళ్ తిరుమొళి | .... | .... | 105 | ,, |
| 6. | తిరుచ్చెంద విరుత్తం | .... | .... | 120 | ,, |
| 7. | తిరుమాలై | .... | .... | 45 | ,, |
| 8. | తిరుపల్లియెళుచ్చి | .... | .... | 10 | ,, |
| 9. | అమలనాదిప్పిరాన్ | .... | .... | 10 | ,, |
| 10. | కణ్ణినుణ్ శిరుత్తాంబు | .... | ... | 11 | ,, |
| | | | మొత్తము | 942 | ,, |

## 2. ఇరెండాన్ ఆయిరమ్ (ద్వితీయ సహస్రము)

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | తిరుమొళి | .... | .... | 1084 | పాశురములు |
| 2. | తిరుక్కురున్దాండగమ్ | .... | .... | 20 | ,, |
| 3. | తిరునెరున్దాండగమ్ | | | | |
| | | | మొత్తము | 1134 | |

## 3. మూన్ఱాన్ ఆయిరమ్ (తృతీయ సహస్రము)

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | తిరువాయిమొళి | .... | .... | 1102 | పాశురములు |

## 4. నాన్ముగన్ ఆయిరమ్ (చతుర్థ సహస్రము)

| | | | | |
|---|---|---|---|---|
| 1. | ముదల్ తిరువందాది | .... .... | 100 | పాశురములు |
| 2. | ఇరెండామ్ తిరువందాది | .... .... | 100 | " |
| 3. | మూన్రామ్ తిరువందాది | .... .... | 100 | " |
| 4. | నాన్ముగన్ తిరువందాది | .... .... | 96 | " |
| 5. | తిరువిరుత్తమ్ | .... .... | 100 | " |
| 6. | తిరువాశిరియం | .... .... | 7 | " |
| 7. | పెరియతిరువందాది | .... .... | 87 | " |
| 8. | కణ్ణియను సాజ్ఞ, తిరువెళుకూత్తిరుక్కై, శిరియతిరుమడల్, పెరియ తిరుమడల్ | .... | 227 | " |
| | | మొత్తము | 817 | " |

| | | | | |
|---|---|---|---|---|
| 1. | ప్రథమ సహస్రము | .... .... | 942 | పాశురములు |
| 2. | ద్వితీయ సహస్రము | .... .... | 1134 | " |
| 3. | తృతీయ సహస్రము | ... .... | 1102 | " |
| 4. | చతుర్థ సహస్రము | .... .... | 817 | " |
| | మొత్తము పాశురముల సంఖ్య | .... ... | 3995 | |

ఈ "నాలాయిర దివ్య ప్రబంధ" విషయవిభాగమును, పాశురముల సంఖ్యయును, "టీకా నిత్యానుసంధానము" అను గ్రంథము ఆధారముగ పేర్కొనబడినవి.

# ఆచార్యులు

పన్నిద్దరాళ్వారుల అనంతరము వైష్ణవ సంప్రదాయమును బహుముఖముగ విస్తరింపజేసినవారు ఆచార్యులు. ఈ ఆళ్వారులయొక్కయు, ఆచార్యులయొక్కయు క్రమమును 'గురువరంపర' అనియు, 'ఆచార్యపరంపర' అనియు అందురు. ఇట్టి ఆచార్యవరంపరలోని అతి ముఖ్యులగు కొందఱు ఆచార్యులనుగూర్చి ఇచట ప్రస్తావించుట ఆవశ్యకము. ఇట్టివారిలో పేర్కొనదగినవారు—

## 1. నాథముని :

ఈయన అసలు పేరు 'రంగనాథముని'కాగా వైష్ణవ ప్రపంచము 'నాథముని' యను పేరే ప్రఖ్యాతివహించినది. శ్రీ వైష్ణవ సంప్రదాయమున కితడు ఆద్యాచార్యుడు. లుప్తప్రాయమైన 'తమిళవేదము'ను పునరుద్ధరించి, శ్రీరంగములోని దేవాలయము నందు పారాయణ మొనర్చు వ్యవస్థను కల్పించిన వాడితడు. ఇతని కాలము క్రీ.శ. 824-924. 'వీరనారాయణపురము' ఇతని జన్మస్థానము. యోగరహస్యము, న్యాయతత్త్వము అనునవి ఇతని రచనలు.

## 2. యామునాచార్యులు :

విశిష్టాద్వైతసిద్ధాంత ప్రచారకులలో అగ్రగణ్యుడైన ఇతడు సుమారు క్రీ.శ. 952 ప్రాంతమున 'మధురై'లో జన్మించెను. ఇతడు నాథముని పౌత్రుడు-ఈశ్వరముని పుత్రుడు. 'ఆలవందార్'అనునది ఇతని సుప్రసిద్ధ నామాంతరము. గీతార్థసంగ్రహము, శ్రీ చతుశ్శ్లోకీ, సిద్ధిత్రయము, మహాపురుషనిర్ణయము, ఆగమప్రామాణ్యము, స్తోత్రరత్నము, (ఆళవందార్ స్తోత్రము) ఇతని రచనలు.

## 3. రామానుజాచార్యులు :

శ్రీ వైష్ణవ సంప్రదాయమునకు ప్రతిష్ఠాపకాచార్యుడైన ఇతడు క్రీ.శ. 1017లో శ్రీ పెరుంబుదూరులో జన్మించెను. ఇతడు యామునాచార్యుని పౌత్రుడు. యామునాచార్యుని అనంతరము శ్రీ వైష్ణవ సంప్రదాయమునకు ఇతడే ప్రధానాచార్యుడయ్యెను. వేదార్థ సంగ్రహము, వేదాంతసారము, వేదాంతదీపము, గద్యత్రయము, గీతా భాష్యము, శ్రీ భాష్యము అనునవి ఇతని రచనలు. ఈ గ్రంథములందు విశిష్టాద్వైత సిద్ధాంతములు విస్తృతముగను, ప్రామాణికముగను వివేచింపబడినవి.

## 4. సుదర్శనసూరి :

ఈతని కాలము క్రీ.శ. 1200-1275. ఇతడు శ్రీభాష్యమునకు 'శ్రుతప్రకాశిక' యను వ్యాఖ్యను రచించెను. ఇవియేగాక-శ్రుతదీపిక, ఉపనిషద్వ్యాఖ్య, తాత్పర్యదీపిక శుకపక్షీయవ్యాఖ్య రచించెను.

## 5. వేదాంతదేశికులు :

"వేంకటనాథు"డను నామాంతరముగల ఇతడు క్రీ.శ. 1269-1369 మధ్యన ఉన్నవాడు. కాంచీపుర సమీపమునందలి 'తూప్పిల్' ఈతని జన్మస్థానము. ఇతనికి 'కవితార్కికసింహ' డనియు; 'సర్వతంత్ర స్వతంత్రు' డనియు బిరుదనామము లున్నవి. సంకల్ప సూర్యోదయము, హంసదూతము, రామాభ్యుదయము, యాదవాభ్యుదయము, పాదుకాసహస్రము-అనునవి ఈతని కావ్యములు. తత్త్వటీక, అధికరణ సారావళి, తత్త్వముక్తాకలాపము, న్యాయపరిశుద్ధి, న్యాయసిద్ధాంజనము, గీతార్థ తాత్పర్యచంద్రిక, ఈశావాస్య భాష్యము, ద్రవిడోపనిషత్తాత్పర్యరత్నావళి, శతదూషణి మొదలగు బహుగ్రంథములను రచించిన ధీశాలి ఇతడు.

## 6. పిళ్లలోకాచార్యులు :

ఇతడు క్రీ.శ. 1372 ప్రాంతములోనివాడు. శ్రీ వైష్ణవాచార్యులలో ముఖ్యుడుగా పేర్కొనదగిన ఈతడు, శ్రీవచనభూషణము, తత్త్వత్రయము, తత్త్వశేఖరము మున్నగు గ్రంథములను రచించెను. శ్రీరంగముపై యవనులుదాడిచేసి, దేవాలయములను కొల్లగొట్టిన సమయమున ఈతడు మందిరములను రక్షించుటకై ప్రాణముల నర్పించెను.

## 7. వరవరముని :

ఇతడు 15వ శతాబ్దిలోనివాడు. 'తెంగలై' శాఖకుచెందిన ఆచార్యులలో ఇతడు సర్వశ్రేష్ఠుడు. పిళ్లలోకాచార్యుల గ్రంథములకీతడు టీకలు వ్రాసెను. 'తమిళవేదము' యొక్క భాష్యమును విస్తృతముగ ప్రచారములోనికి తెచ్చెను.

## 8. శ్రీనివాసుడు :

ఇతడు 16వ శతాబ్దిలోని ఆచార్యులలో పేర్కొనదగినవాడు. 'యతీంద్రమత దీపిక' ఈతని రచన.

## 9. రంగరామానుజుడు :

ఇతడు 16వ శతాబ్దిలోని వైష్ణవాచార్యులలో ముఖ్యుడు. బ్రహ్మసూత్రములకును, శ్రీభాష్యమునకును, న్యాయసిద్ధాంజనమునకును ఈతడు టీకలు వ్రాసెను. బృహదారణ్యక, ఛాందోగ్యోపనిషత్తుల కీతడు విశిష్టాద్వైత తత్త్వప్రతిపాదకములగు భాష్యములను వ్రాసెను. రామానుజసిద్ధాంతసారమను గ్రంథమునుకూడ ఇతడురచించెను.

ఇది వైష్ణవాచార్యుల సంగ్రహ పరిచయము.

# అనుబంధము - II

శ్రీ వైష్ణవ సంప్రదాయములోని 'వడగలై' 'తెంగలై' శాఖల నడుమగల 18 సిద్ధాంతభేదములు ఈ క్రింద పేర్కొనబడుచున్నవి—

| వడగలై | తెంగలై |
| --- | --- |
| 1. ఈశ్వరుని కృపాకటాక్షము సకారణమై యుండును. బాలుడు ఏడ్చినప్పుడే తల్లి పాలు త్రావించినట్లు, ఏడవకయున్నప్పుడు త్రావింపనట్లు ఈశ్వరుడు కారణములేక కృపాకటాక్షమును ప్రసరింపజేయదు. | 1. కారణములేకయే సమస్త ప్రాణికోటికి ఈశ్వరుడు తన కృపాకటాక్షముల నందించును. |
| 2. మోక్షలాభము జీవాత్మకే గాని, పరమాత్మకు గాదు. ఇందు అధికారి భేదములేదు. సర్వులును మోక్షమునకు పాత్రులే. | 2. మోక్షము ఈశ్వరుని నిమిత్తముగనే లభించును. జీవనిమిత్తము మోక్షము కాదు. మోక్షలాభము అధికారి పాత్రానుసారము కలుగును. |
| 3. కర్మజ్ఞానములు భక్తికి అంగములు. మోక్షమార్గమున అవి స్వతంత్రములు కావు. | 3. జ్ఞానయోగము, కర్మయోగము, భక్తియోగము, ఆచార్యనిష్ఠ ఇవి మోక్షమార్గమున స్వతంత్రోపాయములు. |
| 4. భగవంతునితో సమానముగ లక్ష్మికిని సర్వవ్యాపకత్వ మున్నది. లక్ష్మిని విడిచిన ఈశ్వరుడు సర్వవ్యాపకుడు కాలేదు. | 4. జీవాత్మవలెనే లక్ష్మియును అణువే. ఆమె సర్వవ్యాపకురాలు కాదు. |

| | |
|---|---|
| 5. మోక్షప్రదాన సామర్థ్యము లక్ష్మీదేవికిని ఉన్నది. అందుచేత భగవంతునితో సమానముగ లక్ష్మీదేవియును సిద్ధోపాయము. | 5. మోక్షప్రదాన సామర్థ్యము లక్ష్మికి లేదు. ఆ శక్తి కేవలము భగవదధీనమే. కాని మోక్షమునిచ్చుటకై లక్ష్మి భగవంతునికోరుటకు మధ్యవర్తినియై యుండును. లక్ష్మికి ప్రభావశక్తియేగాని సిద్ధోపాయత్వము లేదు. |
| 6. భక్తుల దోషములను లెక్కింపక యుండుటయే వాత్సల్యము. | 6. ఆశ్రితుల దోషములను భోగ్యరూపమున పరిగణించు వాత్సల్యగుణ పూర్ణుడు ఈశ్వరుడు |
| 7 భగవంతుడు ఇతరుల దుఃఖములను చూచి, సహింపనివాడగుటచే, వారి దుఃఖమును నివారించుటకు ప్రవర్తించును. అదియే దయ. | 7. భగవంతుడు ఇతరుల దుఃఖములను చూచి, దుఃఖానుభవము పొందు దయాళువు. |
| 8 ప్రపత్తికూడ భక్తితో సమానముగ ఉపాయసాధనము. | 8. ప్రపత్తి అనునది మోక్షమార్గమున భక్తితో సమానము కానేరదు. |
| 9. శక్తిగలిగియున్నవాడు భక్తిలో ఉపుడై భగవంతుని చూచును. ఆకించనుడైన వ్యక్తియును ప్రపత్తికి పాత్రుడే. | 9. స్వరూప యాథాత్మ్యమును తెలుసుకొన్నవాడు ప్రపత్తికి పాత్రుడు. |
| 0. ప్రపన్నుడగు వ్యక్తి అశక్తతా కారణముచేత నైమిత్తికములగు సర్వకర్మలను సహజముగనే పరిత్యజించును. | 10. ప్రపత్తికొరకై సమస్తకర్మ పరిత్యాగమావశ్యకము. |

| | |
|---|---|
| 11. ప్రపత్తి వినా భక్త్యాదులగు నితరోపాయములు అధికారిభేదానుసారము ఉండును. | 11. సమస్త చేతనపదార్థము పరతంత్రమే. కావున భక్త్యాద్యుపాయములు పరతంత్రస్వరూపమునకు విరోధులు. |
| 12. ప్రపన్నుడగు వ్యక్తి శాస్త్రవిహితకర్మల నాచరించుట, భగవదాజ్ఞకు లోబడి భగవంతుని ప్రసన్నమొనర్చుకొనుట కొరకే. | 12. ప్రపన్నుడగు వ్యక్తి శాస్త్రవిహితములగు కర్మల నాచరించుట కేవలము ఇతరులకు కర్మానుష్ఠానమున మార్గదర్శన మొనరించుటకే. |
| 13. ఏయే ఆశ్రమధర్మములు విధివిహితములో-అవి అన్నియును ప్రపత్తికి అంగములే. ప్రపత్తికి పూర్వమును, తర్వాతనుకూడ ఆశ్రమ ధర్మములు నిర్వర్తించుట తప్పనిసరి. | 13. ప్రపత్తికి పూర్వము ఏయే విధులు నిర్వర్తింపబడినవో - అవి ప్రపత్తి అనంతరము చేయవలసిన ఆవశ్యకత లేదు. |
| 14 ప్రపన్నులందరిపై భగవదనుగ్రహము ఉండును. | 14. ప్రపన్నులందరిపై భగవదనుగ్రహము ఉండదు. |
| 15. ప్రపన్నుడగువ్యక్తి పాపములు చేయరాదు ఒకవేళ చేసినచో ప్రాయశ్చిత్తపూర్వకముగ తిరిగి శరణాగతి పొందవలెను. | 15 ప్రపన్నుడగువ్యక్తి పాతకములు చేసినను పూర్వాచార్యుల ననుసరించినంత మాత్రముననే పాపవిముక్తుడగును. |
| 16. నిమ్నజాతీయుడు ప్రపన్నుడైనచో, అతడు వర్ణాశ్రమధర్మమర్యాదలను అతిక్రమింపని రీతిలో గౌరవాన్వితుడగును. | 16 ప్రపన్నుడగువాడు నిమ్నజాతీయుడు అగ్రజుడా అను భేదములేదు. నిమ్నుడైనను అగ్రజుని వాని వలెనే అతడు గౌరవాన్వితుడగును. |

17. ఈశ్వరుడు అణుస్వరూపుడై జీవాత్మలో అంతర్యామి రూపమున ఉండును.

17. **ఈశ్వరుడు అణుస్వరూపుడై జీవాత్మలో అంతర్యామి రూపమున ఉండును.**

18. కైవల్యానుభవమును పొందిన తరువాత పరమపదమును సైతము పొందవీలగును. కైవల్యము పాపవిమోచనావస్థయై యున్నది. కాని, అది భగవదనుభవమార్గమున ప్రతిబంధకమగును. ముక్తి, మోక్ష, వైకుంఠ శబ్దములచే వ్యక్తమగు ఆనందము కైవల్యముకన్న మిన్న. వైకుంఠమున భగవదనుభవమున్నది. కైవల్యముకోరువారు కాలక్రమమున ముక్తాత్ములై భగవదనుభవానందమును పొందుట ఆవశ్యకము. కైవల్యస్థానము బ్రహ్మాండాంతర్గతము. మోక్షస్థానమగు వైకుంఠము బ్రహ్మాండముకంటె ఉన్నతమైనది.

18. కైవల్యమును పొందినవారు తిరిగి పునర్జన్మను కోరరు. వారికి పరమపదము లభింపదు. కైవల్యమనగా కేవలత్వమాత్రము అనగా - ఆత్మకేవలత్వమాత్రముయొక్క అనుభూతియే. వారికి పరమాత్మానుభూతి ప్రాప్తింపదు. కాలక్రమమున వైకుంఠము జేరి భగవదనుభవానందము పొందలేరు. కైవల్యస్థానము బ్రహ్మాండాంతర్గతముకాదు. అది-బ్రహ్మాండముకంటె పరము.

ఈ అనుబంధమున పేర్కొనబడిన "వడగలై"-"తెంగలై" శాఖా సిద్ధాంత భేదములు డా॥ ఎన్. చంద్రకాంత్‌గారి "తమిళ్ ఔర్ హిందీకా భక్తి సాహిత్య" అను గ్రంథము నుండి సేకరింపబడినవి. ఈ గ్రంథము హిందీలోనున్నది.



# ఉపయుక్త గ్రంథసూచిక

## సంస్కృతము


1. అభిజ్ఞాన శాకున్తలమ్
   మహాకవి కాళిదాసు
   చౌఖంబా విద్యాభవన్,
   వారణాసి-1
   1967

2. అమరకోశః
   అమరసింహుడు
   గురుబాలప్రబోధికా వ్యాఖ్యా సహితము
   వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్, మదరాసు-1
   1967

3. ఈశాది దశోపనిషదః
   శంకరభాష్య సమేతాః
   మోతీలాల్ బనారసీదాస్,
   వారణాసి
   1964

4. కావ్యప్రకాశః
   మమ్మటుడు
   ఆంగ్లవ్యాఖ్యా సహితము
   మోతీలాల్ బనారసీదాస్
   ఢిల్లీ
   1966

5. కావ్యాదర్శః
   దండి
   'ఆచార్య' పుల్లెల
   శ్రీరామచంద్రుడుగారి వ్యాఖ్య
   ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ
   హైదరాబాదు
   1981

6. కుమారసంభవము
   మహాకవి కాళిదాసు
   మల్లినాథ సూరి వ్యాఖ్య
   వావిళ్ల రామస్వామి శాస్త్రులు
   అండ్ సన్స్, మదరాసు-1
   1963

7. చంద్రాలోకః
   జయదేవుడు
   బుధరంజనీ వ్యాఖ్య
   వావిళ్ల రామస్వామి శాస్త్రులు
   అండ్ సన్స్, మదరాసు-1

8. చంపూరామాయణమ్
   భోజుడు
   'రామచంద్రమిశ్ర' సంస్కృతవ్యాఖ్య
   చౌఖంబా విద్యాభవన్, వారణాసి
   1956

9. తర్క సంగ్రహః
అన్నంభట్టు
న్యాయబోధినీ నిరుక్త సహితము
వావిళ్ల రామస్వామి శాస్త్రులు
అండ్ సన్స్, మదరాసు-1
1940

10. దశకుమార చరితమ్
దండి
పరిష్కర్త: పండిత శ్రీహరిహరశాస్త్రి
గంగావిష్ణు శ్రీకృష్ణదాస్
లక్ష్మీవేంకటేశ్వర స్టీమ్ ప్రెస్,
బొంబాయి
1936

11. నారాయణ సూక్తము
శ్రీ పాలావజ్ఝల
శ్రీరామశర్మగారి ఆంధ్రటీక
శ్రీరామా బుక్ డిపో
సికిందరాబాదు
1976

12. ప్రతాపరుద్రీయమ్
విద్యానాథుడు
కుమారస్వామి సోమపీథి
'రత్నాపణ' వ్యాఖ్య
పరిష్కర్త: శ్రీ ఉత్పల వేంకట
నరసింహాచార్యులు
వావిళ్ల రామస్వామి శాస్త్రులు
అండ్ సన్స్, మదరాసు-1
1965

13. ప్రసన్నామృతము
ఆంధ్రానువాదము: టి.వి. చూడామణి
ప్రకాశకులు: శ్రీ గోపాలాచార్య
చుండూరు
1984

14. ముకుందమాలా
కులశేఖరాళ్వార్
పిరాట్ల శ్రీరామమూర్తిగారి
తెలుగు వ్యాఖ్య
గొల్లపూడి వీరస్వామి సన్,
కోటగుమ్మం, రాజమండ్రి
1985

15. వక్రోక్తి జీవితమ్
కుంతకుడు
రాధేశ్యామమిశ్ర హిందీ వ్యాఖ్య
చౌఖంబా సంస్కృత సంస్థాన్,
వారణాసి
విక్రమశకము: 2037

16. వాచస్పత్యమ్
సంకలనకర్త: శ్రీ తారానాథతర్క
వాచస్పతి భట్టాచార్యుడు
చౌఖంబా సంస్కృత సిరీస్
వారణాసి
1970

17. విశ్వగుణాదర్శచంపూః
వేంకటాధ్వరి
మధుర సుబ్బాశాస్త్రి వ్యాఖ్య
వంకాయల కృష్ణస్వామిశ్రేష్ఠి
మదరాసు
1903

18. వృత్త రత్నాకరః
కేదారభట్టు
నిర్ణయసాగర్ ప్రెస్,
బొంబాయి
1948

19. వైయాకరణ సిద్ధాంతకౌముదీ
భట్టోజీ దీక్షితుడు
బాలమనోరమా వ్యాఖ్య
చౌఖంబా సంస్కృత సిరీస్
వారణాసి
1969

20. వ్యాకరణ మహాభాష్యమ్
పతంజలి మహర్షి
పరిష్కర్త : జోషి భార్గవశాస్త్రిగారు
నిర్ణయసాగర్ ప్రెస్,
బొంబాయి
1951

21. శ్రీ భగవద్రామానుజ గ్రంథమాల
భగవద్రామానుజాచార్యుల
కృతుల సంకలనము
పరిష్కర్త : అక్కారక్కాని
సంపత్కుమారాచార్యులు
అణ్ణంగరాచార్యస్వామివారు
గ్రంథమాలా ఆఫీస్, కాంచీపురము
1956

22. శ్రీ విష్ణుసహస్రనామ స్తోత్రము
పరిష్కర్త : శ్రీ తుమ్మలపల్లి
రామలింగేశ్వరరావు
శ్రీ శారదాపీఠము
శృంగేరి-577 139
1985

23. సాహిత్యదర్పణః
విశ్వనాథ కవిరాజా
చౌఖంబా సంస్కృత సిరీస్
వారణాసి
1967

24. సుందరకాండము
వాల్మీకి మహర్షి
పరిష్కర్త : శ్రీ తెన్నకరం
రంగాచార్యులు
ప్రసాద్ అండ్ కంపెనీ
మదరాసు
1972

# తెలుగు

1. ఆచార్యసూక్తి ముక్తావళి
నంబూరి కేశవాచార్యులు
పరిష్కర్త : పురాణం
సూర్యనారాయణతీర్థులు
ఆర్. వేంకటేశ్వర్ అండ్ కంపెనీ
మదరాసు
1922

2. ఆముక్త మాల్యద
శ్రీకృష్ణదేవరాయలు
వావిళ్లవారి వ్యాఖ్య
వావిళ్ల రామస్వామి శాస్త్రులు
అండ్ సన్స్, మదరాసు
1969

3 ఆముక్త మాల్యదా సౌందర్యము
'ఆచార్య' తుమ్మపూడి కోటీశ్వరరావు
మలయకూట ప్రచురణలు
తిరుపతి
1971

4. ఉదాహరణ వాఙ్మయచరిత్ర
నిడదవోలు వేంకటరావు
ఆనంద ముద్రణాలయము
మదరాసు
1950

5. కావ్యాలంకార సంగ్రహము
రామరాజభూషణుడు
సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి
గారి వ్యాఖ్య
ఎం. శేషాచలం అండ్ కంపెనీ,
మచిలీపట్నం
1976

6. ప్రథమాంధ్ర మహాపురాణము
డా॥ జి.వి. సుబ్రహ్మణ్యం
1-8-702/105 'శ్రీవాణి'
నల్లకుంట, హైదరాబాదు-500 044
1978

7. మనపండితులు-కవులు-రచయితలు
(ప్రథమ సంపుటము)
డా॥ కోవెల సంపత్కుమారాచార్య
జనధర్మ ప్రచురణ, వరంగల్లు
1970

8. రంగనాథ-వాల్మీకి రామాయణముల
తులనాత్మక పరిశీలనము
డా॥ గుండి వేంకటాచార్యులు
వివేకానందకాలనీ,
కామారెడ్డి-503 111
1987

9. వసుచరిత్ర
రామరాజభూషణుడు
ఎం. శేషాచలం అండ్ కంపెనీ
మచిలీపట్నం
1970

10. శ్రీ ఆండాళ్లు తిరుప్పావు
దేవులపల్లి కృష్ణశాస్త్రి
14, సుంకురామచెట్టి స్ట్రీట్,
మదరాసు-1
1975

11. శ్రీ మహాభాగవతము
బమ్మెర పోతనామాత్యుడు
ఆం.ప్ర. సాహిత్య అకాడమీ
హైదరాబాదు
1977


## తమిళము


1. టీకా నిత్యానుసంధానము
పరిష్కర్త: కేశా వరదరామానుజాచార్యులు
వంకాయల కృష్ణస్వామిశెట్టి
మదరాసు
1883

2. తిరుప్పల్లాండు-పెరియాళ్వార్ తిరుమొళి
పెరియాళ్వారు
అణ్ణంగరాచార్యస్వామివారి ఆంధ్రటీక
గ్రంథమాలా ఆఫీస్, కాంచీపురము
1968

3. నాచ్చియార్ తిరుమొళి
గోదాదేవి
అణ్ణంగరాచార్యస్వామివారి ఆంధ్రటీక
గ్రంథమాలా ఆఫీస్, కాంచీపురము
1967

4. దివ్యప్రబంధత్రయము
తిరుమంగై ఆళ్వార్
నేలటూరు భక్తవత్సలమయ్యంగారు ఆంధ్రటీక
గ్రంథమాలా ఆఫీస్, కాంచీపురము
1967

## హిందీ

1. చంపూకావ్యకా తులనాత్మక్ ఏవం
   ఐతిహాసిక్ అధ్యయన్
   డా॥ ఛవినాథ్ త్రిపాఠి
   చౌఖంబా విద్యాభవన్, వారణాసి
   1965

2. తమిళ్ ఔర్ హిందీకా భక్తిసాహిత్య
   డా॥ ఎస్. చంద్రకాంత్
   దక్షిణభారత హిందీ ప్రచారసభ
   మద్రాసు-17
   1971

3. భారతీయ దర్శన్
   పండిత బలదేవ ఉపాధ్యాయ
   శారదామందిర్, వారణాసి
   1960

## ఆంగ్లము

1 Sravana, Manana &
  Nididhyasana
  Dr. K. Pratap
  Dept. of Sanskrit
  S.V. University, Tirupati
  1983




# దాతలు

| | | | |
|---|---|---|---|
| 1. | శ్రీ పార్శి గంగయ్య, కామారెడ్డి | .... | 500–00 |
| 2. | డా॥ టి. ప్రకాశరావు, కామారెడ్డి | .... | 500–00 |
| 3. | డా॥ టి.వి. పురుషోత్తమాచార్య, నార్సింగి | .... | 500–00 |
| 4. | డా॥ కే. అంజల్‌రెడ్డి, కామారెడ్డి | .... | 250–00 |
| 5. | గంజివర్తక సంఘము, కామారెడ్డి | .... | 250–00 |
| 6. | శ్రీ టి. రాజేశం, కామారెడ్డి | .... | 122–00 |
| 7. | గుప్త దాత | .... | 116–00 |
| 8. | శ్రీ కే. కొండల్‌రావు, కామారెడ్డి | .... | 116–C0 |
| 9. | శ్రీ సి. సత్యనారాయణ, కామారెడ్డి | .... | 116–00 |
| 10. | శ్రీ కంజర్ల రామాచార్య, కామారెడ్డి | .... | 116–00 |
| 11. | డా॥ విజయకుమార్, కామారెడ్డి | .... | 116–00 |
| 12. | శ్రీ లింగాల నర్సాగౌడు, రామారెడ్డి | .... | 116–00 |
| 13. | శ్రీ బి. రామకిషన్, కామారెడ్డి | .... | 111–00 |
| 14. | శ్రీ శాస్త్రిమోహన్, కామారెడ్డి | .... | 111–00 |
| 15 | శ్రీమహాలక్ష్మి రైస్‌మిల్, కామారెడ్డి | .... | 105–00 |
| 16. | శ్రీ జానూరు రాజరెడ్డి, రామారెడ్డి | .... | 105–00 |
| 17. | శ్రీ జి. శంకరశర్మ, కామారెడ్డి (కీ.శే సంధ్యారాణి జ్ఞాపకార్థం) | .... | 101–00 |
| 18. | శ్రీ రాగి చిన్నయ్య, ధర్మారం (బి) | .... | 100–00 |
| 19. | శ్రీ కే. నరసింగరావు, బోర్లం | .... | 1C0–00 |
| 20. | శ్రీ బచ్చు లక్ష్మిపతి, కామారెడ్డి | .... | 100–00 |
| 21. | శ్రీ రేపూరి సురేందర్, కామారెడ్డి | .... | 100–00 |
| 22. | శ్రీ పి. నారాయణరెడ్డి, కామారెడ్డి | .... | 100–00 |
| 23. | శ్రీ బి.ఎం.ఎస్.వి. ధర్మయ్య, కామారెడ్డి | .... | 100–00 |
| 24. | శ్రీ ముత్యపు చంద్రయ్య, కామారెడ్డి | .... | 100–00 |
| 25. | డా॥ బి. రాజగోపాలరావు, కామారెడ్డి | .... | 100–00 |
| 26. | శ్రీ దోర్బల వేంకటేశ్వరశర్మ, మక్కాపూర్ | .... | 58–00 |
| 27. | శ్రీ చిదుర శ్యామసుందర్, కామారెడ్డి | .... | 55–00 |

| | | | |
|---|---|---|---|
| 28. | శ్రీ ఎం. రమేశ్, వారి సోదరులు, కామారెడ్డి (కీ.శే. మహాదేవజనార్దనరావుగారి జ్ఞాపకార్థం) | .... | 51-00 |
| 29. | శ్రీ ఎం. వేణు, కామారెడ్డి | .... | 51-00 |
| 30. | శ్రీ బి. సుధాకరశర్మ, కామారెడ్డి | .... | 51-00 |
| 31. | శ్రీ బి. నారాయణ, కామారెడ్డి | .... | 51-00 |
| 32. | శ్రీ మైలారపు గంగయ్య, కామారెడ్డి | .... | 51-00 |
| 33. | శ్రీ కందుకూరి శ్రీనివాస్, ఎల్లారెడ్డిపేట | .... | 51-00 |
| 34. | శ్రీ కోర్పోలు విశ్వనాథం, కామారెడ్డి | .... | 51-00 |
| 35. | శ్రీ బి. భోగేశ్వరశర్మ, కామారెడ్డి | .... | 51-00 |
| 36. | శ్రీ పీల భాస్కర్, కామారెడ్డి | .... | 51-00 |
| 37. | శ్రీ పడకంటి వేంకటేశం, కామారెడ్డి | .... | 51-00 |
| 38. | శ్రీ పి. గోవర్ధన్, రామాయంపేట | .... | 51-00 |
| 39. | శ్రీ వరిగొండ కాంతారావు, రామాయంపేట | .... | 51-00 |
| 40. | శ్రీ పాల్తి రమణయ్య, కామారెడ్డి | .... | 50-00 |
| 41. | శ్రీ కే.వి.ఎస్. ఆచార్యులు, కామారెడ్డి | .... | 50-00 |
| 42. | శ్రీ సేనాపతి భాష్యకాచార్యులు, నిజామాబాదు | .... | 50-00 |
| 43. | శ్రీ తాటి కిష్టయ్య, కామారెడ్డి | .... | 50-00 |
| 44. | డా॥ సుదర్శన్‌రావు, కామారెడ్డి | .... | 50-00 |
| 45. | శ్రీ గోజ వెంకట్రావు, కామారెడ్డి | .... | 50-00 |
| 46. | శ్రీ టి. అంతిరెడ్డి, కామారెడ్డి | .... | 50-00 |
| 47. | వాసవి పబ్లిక్ స్కూల్, కామారెడ్డి | .... | 50-00 |
| 48. | శ్రీ పైడిమఱ్ఱి బలరామశాస్త్రి, దోమకొండ | .... | 50-00 |
| 49. | శ్రీ బి. రాజేశ్వరశర్మ, కామారెడ్డి | .... | 50-00 |
| 50. | శ్రీ శాంతి మహిళామండలి, కామారెడ్డి | .... | 50-00 |
| 51. | శ్రీ కోదండరావు, కామారెడ్డి | .... | 50-00 |
| 52. | శ్రీ పెనుగొండ శ్రీనివాసులు, బోరం | .... | 25-00 |
| 53. | శ్రీ చిదుర సత్యనారాయణ, కామారెడ్డి | .... | 25-00 |
| 54. | శ్రీ జగన్నాథాచార్యులు, హైదరాబాదు | .... | 25-00 |
| 55. | శ్రీ పీల వీరయ్య, కామారెడ్డి | .... | 25-00 |
| 56. | శ్రీ ఎస్. లింబాద్రి, లింగంపేట | .... | 25-00 |
| 57. | శ్రీ గాదెం లక్ష్మీనారాయణ, కామారెడ్డి | .... | 25-00 |
| 58. | శ్రీ యజ్ఞం వసంతకుమార్, కామారెడ్డి | .... | 25-00 |
| 59. | శ్రీ తన్నీరు విఠల్, కామారెడ్డి | .... | 25-00 |
| 60. | శ్రీ కే. శంకరయ్య, కామారెడ్డి | .... | 25-00 |

| | | | |
|---|---|---|---|
| 61. | శ్రీ వై. హనుమంతరావు, సంగారెడ్డి | .... | 25-00 |
| 62. | శ్రీ పద్మ శ్రీనివాస్, రామారెడ్డి | .... | 25-00 |
| 63. | శ్రీ కే. సుదర్శన్, రామ రెడ్డి | .... | 25-00 |
| 64. | శ్రీ జంగం కోటప్ప, రామారెడ్డి | .... | 25-00 |
| 65. | శ్రీ చీకోటి కృష్ణయ్య, రామారెడ్డి | .... | 25-00 |
| 66. | శ్రీ చొల్లేటి నాగయ్య, రామారెడ్డి | .... | 25-00 |
| 67. | శ్రీ కొమ్మ శంకర్, రామారెడ్డి | .... | 25-00 |
| 68. | శ్రీ మంద లింబయ్య, రామారెడ్డి | .... | 25-00 |
| 69. | శ్రీ అల్లందాస్ నర్సయ్య, రామారెడ్డి | .... | 25-00 |
| 70. | శ్రీ కొమ్మ భైరయ్య, రామారెడ్డి | .... | 25-00 |
| 71. | శ్రీ తిరునగరి చక్రపాణి, రామారెడ్డి | .... | 25-00 |
| 72. | డా॥ సామల నర్సయ్య, రామారెడ్డి | .... | 25-00 |
| 73. | శ్రీ భూపతి గంగారాం, రామారెడ్డి | .... | 25-00 |
| 74. | శ్రీ పద్మ శ్రీహరి, రామారెడ్డి | .... | 25-00 |
| 75. | శ్రీ జి. లింగాగౌడు, రామారెడ్డి | .... | 25-00 |
| 76. | శ్రీ కొమ్మ రాజమౌళి, రామారెడ్డి | .... | 25-00 |
| 77. | శ్రీ రాజేందర్, కామారెడ్డి | .... | 25-00 |
| 78. | శ్రీ ఆకుల శేఖరం, రామారెడ్డి | .... | 25-00 |
| 79. | శ్రీ గజవాడ రాజయ్య, రామారెడ్డి | .... | 25-00 |
| 80. | శ్రీ ఆకుల భాస్కర్, రామారెడ్డి | .... | 25-00 |
| 81. | డా॥ జి. భాస్కరరావు, రామారెడ్డి | .... | 25-00 |
| 82. | శ్రీ సుప్పని గంగారాం, రామారెడ్డి | .... | 25-00 |
| 83. | శ్రీ ఎస్. రాజలింగం, కామారెడ్డి | .. . | 25 00 |
| 84. | శ్రీ టి. మహేశ్‌బాబు, కొండూరు | .... | 25-00 |
| 85. | పూజారి తిగుళ్ల నళిని, చిక్కనూరు | .... | 25-00 |
| 86 | శ్రీ కే. శివలింగము, లింగంపేట | .... | 25-00 |
| 87. | శ్రీ వడ్ల లింబాద్రి, రామారెడ్డి | .... | 25-00 |
| 88 | శ్రీ కొక్కుల వేంకటేశం, సిరిసిల్ల | ... | 25-00 |
| 89 | శ్రీ ముక్క పవన్‌కుమార్, లింగంపేట | .... | 25-00 |
| 90. | శ్రీ జి. ఆనందరావు, గరుగుల | .... | 25-00 |
| 91. | శ్రీ జి. బాలకిషన్‌రావు, గరుగుల | .... | 25-00 |
| 92. | శ్రీ సత్యనారాయణరావు, కామారెడ్డి | .... | 25-00 |

—✱—

# శోధిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 3 | 6 | నూతనలంకరణము | నూతనాలంకరణము |
| 5 | 26 | ప్రసిద్ద | ప్రసిద్ధ |
| 8 | 14 | అహుమహమికయా | అహమహమికయా |
| 12 | 16 | మూరుడైన | మూఢుడైన |
| 26 | 9 | శ్రీ వనలశైలనాథ | శ్రీ వనశైలనాథ |
| 27 | 11 | గ్రేహాగ్రస్థ | గేహాగ్రస్థ |
| 27 | 19 | నారణనమ్మి | నారణనమ్మి |
| 28 | 8, 9 | మణిపాదుకే చ | మణిపాదుకేన |
| 35 | 23 | వసంతుర్తు | వసంతర్తు |
| 35 | 23 | శృంగార | శృంగార |
| 38 | 17 | గురువుల వద్ద | గురువులవద్ద |
| 40 | 4 | భూదేవి | భూదేవి |
| 41 | 9 | ద్రోపపధూ | ద్రోప వధూ |
| 43 | 3 | ప్రారంభించిరి | ప్రారంభించిరి. |
| 46 | 24 | ముదాదును | ముద్దాడును |
| 51 | 10 | చిత్త వృత్తిః | చిత్త ప్రవృత్తిః |
| 53 | 11 | హెతూత్ప్రేక్ష | హేతూత్ప్రేక్ష |
| 57 | 22 | పేర్కొంచబడినవి | పేర్కొంచబడినవి. |
| 64 | 6 | స్వోచ్ఛిష్ట | స్వోచ్ఛిష్ట |
| 69 | 14 | ఊహాయు | ఊహయు |
| 72 | 9 | విన్యాసబేదమును | విన్యాసభేదము ను |
| 76 | 22 | నొలదటంచు | నొల్లదటంచు |
| 79 | 8 | గురువః | గురవః |
| 80 | 10 | (శబ్దె) | (శబ్దే) |
| 88 | 13 | దారిద్ర్యమునుకు | దారిద్ర్యమునకు |
| 91 | 21 | సమాధానమలో | సమాధానములో |
| 94 | 19 | శొకపాదములు | శ్లోకపాదములు |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 95 | 13 | శ్లొకమున్నది | శ్లోకమున్నది |
| 96 | 27 | శ్లొకమును | శ్లోకమును |
| 101 | 29 | మపాదేయం | ముపాదేయం |
| 103 | 12 | ఆరాధింవెను | ఆరాధించెను |
| 105 | 9 | స్వోచ్ఛిష్ట | స్వోచ్ఛిష్ట |
| 105 | 14 | స్వోచ్ఛిష్టాయాం | స్వోచ్ఛిష్టాయాం |
| 106 | 22 | ప్రథమముసనున్నట | ప్రథమముననున్నట్లు |
| 107 | 9 | పూదొటలో | పూదోటలో |
| 108 | 20 | గొదాదేవికి | గోదాదేవికి |
| 113 | 23 | శ్లోకమునవాదము. | శ్లోకమునకనువాదము. |
| 118 | 15 | గొదాదేవి | గోదాదేవి |

అనుబంధములు

| | | | |
|---|---|---|---|
| ii | 21 | గరుడని | గరుడుని |
| v | 13 | తిరుపల్లియెళుచ్చి | తిరుప్పళ్ళి యెళుచ్చి |



# అయాచితం నటేశ్వరశర్మ

సంస్కృతోపన్యాసకులు

ప్రాచ్యవిద్యాపరిషత్తు సాయంప్రాచ్య కళాశాల,

కామారెడ్డి - 508 111.


జననీజనకులు : జయలక్ష్మీదేవి - అనంతరామశర్మ.

జన్మస్థానం : రామారెడ్డి గ్రామం; సదాశివనగర్ మండలం, నిజామాబాద్ జిల్లా.

జన్మతిథి : దుర్ముఖి - ఆషాఢ - శుక్ల - దశమి (17-7-1

విద్యార్హతలు వ్యాకరణ శిరోమణి (సంస్కృతం); బి.ఓ.ఎల్. (సంస్కృతం);
ఎం.ఏ. (సంస్కృతం); ఎం.ఏ. (తెలుగు).

పరిశోధనార్హత 'ఆముక్తమాల్యదమ్ - ఏకపరిశీలన' అనే అంశంపై
సంస్కృతంలో ఎం.ఫిల్.,

ప్రస్తుత పరిశోధన 'సౌందర్యలహర్యాః అధ్యయనమ్' అనే అంశంపై
పిహెచ్.డి., కోసం.

ముద్రితరచనలు వసంతకుమారి (గేయరూపకం); శ్రీ గజాననస్తోత్రమ్
(సంస్కృతంలోనికి అనువదింపబడిన స్తోత్రం);
శ్రీ శౌరీ (సంస్కృతస్తోత్రం); భారతీప్రశస్తి (కవితాసంకలనం)
ఆముక్తమాల్యదపరిశీలనము (పరిశోధనవ్యాసము).

అముద్రిత రచనలు : నవ్యగీతి; విక్రాంతిగీతి; పూసనారాలు; ఆమని; ఋతుగీత; నాగినీ.

ప్రవృత్తి సంస్కృతాంధ్రసాహిత్యాధ్యయనం; రచనావ్యాసంగం.

సాహిత్యసేవ సంస్కృతాంధ్రసాహిత్యాలకు సంబంధించిన అనేకాంశాలపై
రేడియో ప్రసంగాలు; పత్రికలలో వ్యాసాలు; కవితలు.
సాహిత్యసంస్థలలో సాహచర్యం; సాహిత్యకార్యక్రమాల నిర్వహణ.

ఆశయం సంస్కృతాంధ్రభాషాసాహిత్యసేవ.